


## ముస్తాబు ద్రవ్యముల చరిత్రలో ఇంతవరకు తయారుకాని కొంగ్రొత్త ఫేస్ పౌడర్లు!

### గోకుల్ శాంటోల్ టాయిలెట్ పౌడరు

శుద్ధమైన చందనపు చెక్కల పొడరుతో (మైక్రోనైజ్డ) చాల ఇంపైన టాల్కం చేర్చబడి తయారుకాబడిన పౌడరు. మీ ముఖ కాంతిలో మెరుగు చూపుట, చెమటను ఆపుట, చాలకాలము వాసన యుండుట దీని ముఖ్య విశేషములు. చెమట పొక్కులను ఆపుచేయును.

### గోకుల్ శాండల్ వుడ్ టాయిలెట్ పౌడరు:

శుద్ధమైన చందనపు చెక్కలనుండి తయారుకాబడిన పౌడరు. ఫేస్ పౌడరులకు వలయునంత సున్నితము చేయబడినది.

### గోకుల్ ట్యాల్ పౌడరు:

శరీరశ్రేష్ఠమైన వేమవుగొమ్మల నుండి తయారుకాబడిన పౌడరు. వివిధ రాయలలో గలవు. మీ ముఖవర్చస్సును పెంపొందించునట్టియు, క్రిమి సంహారక సంబంధమగు శక్తియు గుణములు గలది. దీని సువాసన గంటలతరబడి నిలచియుండును.

## టి.యస్.ఆర్ & కో., కుంబకోణమ్

C. L. Mani

# నవంబరు 27 నుండి



విక్రమ్ ప్రొడక్షన్స్

# మహిషాసుర మర్దని

తారాగణం : * రాజకుమార్ * వి. నాగయ్య * రాజనాల * జానకి
* సూర్యకళ * సంధ్య * కుచలకుమారి

మాటలు, పాటలు: సముద్రాల జూనియర్

సంగీతం : జి. కె. వెంకటేశ్వర్లు

నిర్మాత, దర్శకుడు : బి. ఎస్. రంగా

—నవయుగ రిలీజ్

FLOODLIGHT

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

Founder
K. Nageswara Rao

స్థాపితము
1908

★

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 55
సంచిక 12

2-12-59
బుధవారం

వికారి మార్గశిర శుద్ధ ద్వితీయ

★

విడిప్రతి వెల 25 న. పై.

సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.


## క్రమణిక

ముఖచిత్రం:
"అలుమగలు" చిత్రంలో
గిరిజ.



### హరివంశం

"హరివంశము" చదువుతున్నాను. చదువుతున్నంత సేపూ ఆనందము పొందినాను. భగవంతుని చరిత్ర తెలుగు పాఠకలోకానికి అందజేస్తున్నందుకు మీకు నా ధన్యవాదాలు. రచయిత ఆధునిక పదజాలముతో లలిత లలితంగా వ్రాస్తున్నారు.

లోలుగువ రసింహప్పారావు
ఇప్పలి.

కొత్త పోకడలతోను, మనోహరమైనవర్ణనలతోను కూడిన హరివంశం సీరియల్ చాలాబాగుంది. ఇది ప్రతి యొక్క పాఠకుణ్ణి ఆనంద పరుస్తుందనుటలో సందేహము లేదు. రచయిత పోరీత శివశర్మగారికి నా హృదయ పూర్వక ధన్యవాదాలు...

యస్. నారాయణచౌదరి,
బండమీదపల్లె.

హరివంశమనగా ఏమో తెలియని నావంటివారికి మీ [illegible] యకట చాల ఆనందదాయకము. శైలిమార్పక కడపటి వరకు ఇదేశైలిలో రచింతురని ఆశించుచున్నాను.

శైవ రామలింగము,
తిరుచురాపల్లి.

వర్ణన బహు పేర్వగా, రమణీయంగా ఉండి వన్నె కర్షించింది.

అచ్చి రఘురామరెడ్డి,
మద్రాసు.

* * *

### లంకెబిందెలు

"బాపు" గారి "లంకె బిందెలు" బొమ్మలసీరియల్ పిన్నలకు పెద్దలకు ఆకర్షిస్తాంది. ఆ బొమ్మల కథను రంగులలో వారపత్రిక వెనుక కవరు పై ముద్రిస్తే ఇంకా ఆకర్షణీయంగా వుండగలదని నా అభిప్రాయం.

యేమూరి చలపతిరావు,
కాకినాడ.

* * *

### లంబాడీలు

విశ్వనాథన్ గారు లంబాడీలను గురించి [illegible] చాలబాగున్నది. వివాహమైనపిదప పెండ్లికూతురును అత్తవారింటికి పంపునపుడు ముఖ్యమైన వారందరూ, ఒకరితర్వాత ఒకరు పెండ్లికూతురిని దగ్గరకుతీసుకొని ఏడుస్తారు. అది వాళ్ళ ఆచారం. కొంతమంది ప్రతి వారం తలంటిపోసుకొని, జడలు వేసుకుంటారు. వాళ్లు జడలో వెండివగలు పెడ్తారు. ఒకరోజున జడవేసుకొని, ఆభరణాలన్నీ పెట్టుకుంటే, తిరిగి వారంరోజులకే మరల తలదువ్వుతారు.

లంకా వెంకటసుబ్రహ్మణ్య
శాస్త్రి, గుంటూరు.

శ్రీ విశ్వనాథన్ గారు వ్రాసిన లంబాడీల వింత ఆచారాలు వింతగానే ఉన్నాయి. కాని వారు పేర్కొనవలసినవి కొన్ని పేర్కొనలేదు. లేనివాటిని కొన్ని ఏకరువు పెట్టారు. లంబాడీలు కి తివారసంచీలు చేస్తారు. అది వారి ప్రధాన వృత్తి. ఇది సార్వత్రికంగా

(51 వ పేజీ చూడండి)

# త్రాగినవాళ్ళసంగతి
# కట్టేఇళ్ళసంగతి
# పోయిన ఎన్నికలసంగతి

## రాజధానికబుర్లు

ప్రవీణ్

"త్రాగిన వాళ్లంతా ఇదే అన్నారు"- అంది రాజధానినగరంలోని ఒక సిగరెట్ల కంపెనీ దేశం మొహంమీదకి పొగ విడుస్తూ. వాళ్ల సిగరెట్టు చాలా మంచిదన్నారట. ఆ సిగరెట్టు మంచిదే కావచ్చు; కాకపోవచ్చు. కాని త్రాగిన వాళ్లంతా, అంతా, ఒకేమాట అన్నారంటే. నమ్మడం కష్టం.

ఆంధ్రప్రాంతం అంతటా మద్యపాన నిషేధం అమల్లో ఉంది. దురదృష్టవంతుల్లో అదృష్టవంతులు కొద్దిమంది త్రాగుతూనే ఉన్నారు. చట్టం అమల్లో ఉంది కనుక-సాధ్యమైనంతవరకు ఇది బయటపడకుండా చేస్తున్నారు. ఆ నోటా ఈ నోటా 'పబ్లికు' చెవిని పడకుండా ఉండడం కష్టం కాని-తాగినవాడి చేతుల్లో పడ్డంకంటె, వాడి విషయం మన చెవిలో పడ్డమే మంచిది.

రాజధాని నగరంలో వారం రోజులున్న వారికి ఇక్కడ మద్యపాననిషేధం అమల్లో లేదన్న విషయం స్పష్టంగా తెలుస్తుంది. ఒకటి: బారులుతీర్చి, 'బారు'లు కనిపిస్తాయ్ రాజవీధుల్లో. రెండు రోడ్డుపడి ఎడమల్ని కొలుస్తూ, త్యాగరాజు మొదలు శంకర్-జైకిషన్‌వరకు సంగీత విద్వాంసుల ఆధ్యాత్మిక ఆత్మహత్యలకు 'హాగోన్లు' వేసే మనుష్యులు కనిపిస్తారు. వచ్చే నెల జీతం ఖర్చుపెట్టే పెద్దలు బారుల్లో బీరులు సేవిస్తారు. రేపొద్దున్న గంజికోసం సేకరించిన పైసలు రొండిలో దాచుకున్న చిన్నలు కల్లు దుకాణాల చుట్టూవున్న గుడిసెల్లో దూరతారు.

మద్యపాన నిషేధం అమలు జరగాల్సిన అవసరంగూర్చి కాని, అమలు జరుగుతూన్న విధానంగూర్చి కాని రాసే వాక్యాలు కావివి. రాజధాని నగరంలో రాత్రి ఏడుగంటలు మొదలు పదిగంటలవరకు రాజవీధుల్లో నడిచే సామాన్యులు ఎదుర్కోవలసివచ్చే ప్రమాదాలగూర్చి వ్రాసే వాక్యాలు.

హైదరాబాదులోని ఒక వీధిలో కొన్ని వారాల క్రిందట తప్పత్రాగిన పద్దెనిమిదేళ్ళ కుర్రాడు ఊగుతూ, జోగుతూ కనపడ్డాడు. అరడుగుల పొడవున్నాడు. అతన్ని అదుపులో ఉంచడానికి వ్యర్థప్రయత్నాలు చేస్తూ, పదేళ్ళ కుర్రాళ్ళు ఇద్దరు అటూ ఇటూ గాలికి ఊగినట్లు ఊగిపోతున్నారు. ఆ పదేళ్ళ కుర్రాళ్ళుకూడా కొద్దో గొప్పో తాగినవాళ్ళే. ఈలోగా చక్కచిక్కన మసలాడు తొక్కుతున్న ఖాళీ సైకిల్ రిక్షా ఆ దారినొచ్చింది. వెంటనే-ఆ పద్దెనిమిదేళ్ళ త్రాగుబోతు, వాగుబోతు, ఆ రిక్షావాణ్ణి కౌగిలించుకున్నాడు. విడిపించుకోడానికి రిక్షావాడుచేసే ప్రయత్నాలు, దారినిపోయే వారి హాస్యప్రియత్వానికి ఆహారపదార్థాలయ్యాయ్. త్రాగుబోతు రిక్షాలో కూచున్నాడు. సగం త్రాగిన అరటికెట్లు రిక్షావాణ్ణి బతిమాలుకున్నాయ్. గత్యంతరంలేని రిక్షావాడు ఇష్టంలేని బరువును మోసుకుంటూ ముందుకుపోయాడు.

ఇటువంటి సంఘటనలు రాజధాని వీధుల్లో ఈ మధ్య ఎక్కువయ్యాయ్. రాజధానిలో మద్యపాన నిషేధం లేకపోవచ్చు కాని పద్దెనిమిదేళ్ల లోపు కుర్రాళ్ళు కూడా శరీరానికి నిలువుమామా రాసిచ్చేసే అవకాశాలు కల్పించడం మంచిదేనా?—అన్నది ఒక ప్రశ్న. కల్లు 'కంపౌండులు' రాజధాని నగరంలో చాలాచోట్ల ఆవాస గృహాలమధ్యనున్నాయ్. త్రాగుబోతుల్ని అవి బరితప్పిన బాణాల్లా వీధుల్లో విడిచిపెడుతూంటాయ్. ఆడవాళ్ళు, పెద్దవాళ్ళు, పిల్లలు నడవడానికి వీలులేని పరిస్థితుల్లోకి వీధుల్ని దింపడమా?—అన్నది మరో ప్రశ్న. రక్షకభటశాఖ, నగరపాలక సంఘం తీవ్రంగా ఆలోచించవలసిన విషయం ఇది.

### "ఇళ్ళు కట్టిచూడు...."

మంత్రుల పర్యటన కార్యక్రమాలకి, ఏటేటా వాడవాడలా జరిగే సమావేశాలకి అయ్యే ఖర్చులన్నీ కలిపితే, 'దేహి' అనకుండానే మూడవ ప్రణాళిక అమలు జరపడానికి అయ్యేటంతటి ఖర్చు ఔతుందని ఓ మిత్రుడన్నాడు ఇటీవల. ఇది కేవలం అతిశయోక్తి అని మనం వెంటనే అంగీకరించవచ్చు.

మంత్రుల పర్యటనలపై ఎంత ఖర్చు చేసినా, ఒక్కొక్క మంత్రి కొన్ని లక్షలు మాత్రమే వెచ్చిస్తారు. సమావేశాలపై ఎంత వెచ్చించినా, ఒక్కొక్క సమావేశానికి కొన్ని లక్షలుమాత్రమే ఖర్చౌతుంది. మరి-మూడవ ప్రణాళిక అమలుజరపడానికి కొన్ని వందలకోట్లు కావాలి.

కాని—ఏటేటా జరిగే సమావేశాల్లో గవర్నర్ల ప్రారంభోత్సవాలు, మంత్రుల, ముఖ్య, ఉపమంత్రుల కేంద్రమంత్రుల గంభీరోపన్యాసాలు తప్పిస్తే, కార్యక్రమం ఏమీ జరగడంలేదని మనం అందరం అంగీకరించాలి. నవంబర్లో రాజధానినగరంలో జరిగిన గృహనిర్మాణ మంత్రుల నాల్గవ సమావేశం ఉదాహరణగా తీసుకోండి. క్రిందటి సమావేశం కొన్ని సూచనలు చేసింది. ఆ సూచనలను ఏయేరాష్ట్రాలు ఎంతవరకు అమలు జరిపాయో నివేదికలు రాలేదు. కొన్ని రాష్ట్రాలుమాత్రమే నివేదికలు పంపాయి. మరి యీ సమావేశం ఎందుకు జరిగినట్టు? ఈ ఖర్చు పన్నుదార్లు ఎందుకు భరించాలి?

ప్రస్తుతం దేశంలో ఏభై లక్షలవరకు ఇళ్ళ కొరత వుందని అంచనా. మూడవ ప్రణాళిక అంతానికి నలభైలక్షల ఇళ్లు నిర్మిస్తామని పథకం. దానికి విపరీతంగా జనాభా పెరిగిపోతూంది. ప్రభుత్వవిధానాల ఫలితముగా, దినం దినం గ్రామాలువిడిచి పట్టణాలకు చేరుకుంటున్నారు జనం; పట్టణాలు



టెరిటోరియల్ ఆర్మీ దినోత్సవం నవంబరు 21న జరిగింది. ఈ సైన్యానికి చెందిన ఆర్టిలరీ దళంవారు పెద్ద ఫిరంగి ప్రయోగంలో శిక్షణపొందుతున్న దృశ్యం.

# ★ రాజధాని కబుర్లు ★

విడిచి నగరాలు చేరుతున్నారు. వీళ్ళవుండ డానికి ఇళ్ళు కావాలి. పథకం సక్రమంగా అమలు జరిగినా—(ఇదో ప్రశ్నార్థకం!)-ఇప్పటి లెక్కల ప్రకారం మరో పదిలక్షల ఇళ్ళు అవసరం అవుతాయి. జనాభా పెరుగుదల వల్ల, ఇతర కారణాలవల్ల మరికొన్ని లక్షల ఇళ్ళు మూడవ ప్రణాళిక అంతానికి అవసరం ఔతాయ్. ఈలోగా మన ఇంజనీర్ల ప్రతిభవల్ల కట్టినయిళ్లు కూలిపోతూంటాయ్. సమగ్రంగా ఆలోచించనప్పుడు—ఎందుకీ సమావేశాలు? ఎందుకీ బరువు కున్నదార్ల పై?

ఈ పరిస్థితుల్లో హైదరాబాదు విషయం ఆలోచించండి. 1956 తర్వాత మహారాష్ట్రులు, కన్నడిగులు కొందరు నగరం విడిచి పోయినా, కొన్ని లక్షలమంది జనంచేరారు ఇక్కడికి. నగరానికి సి. ఐ. బి. అనే సంస్థ కాపలాకాస్తోంది. అవినీతికి, అసమర్థతకీ, ఎక్కడ తక్కువలకి ఓట్లు తీసుకుంటే బహుశః మొదటి ఐదుస్థానాల్లో సి. ఐ. బి. వస్తుంది. ఇళ్లు కట్టడానికి పథకాలువేసి కంట్రాక్టులు ఇవ్వడం, తరువాత ఆ ఇళ్లసంగతే మరచిపోవడం, కట్టిన ఇళ్లను మనకి అర్థంకాని పద్ధతులను అనుసరించి కేటాయించడం, తరవాత ఆ ఇళ్ల సంగతే మరచిపోవడం—ఇవి ఈసంస్థ బహిరంగంగా చేసేపనులు.

చిక్కడపల్లి - ముషీరాబాద్ ప్రాంతాలకి వెనుక అధ్వాన్న పరిస్థితిలోఉన్న ఇళ్ల సంగతి గతవారం ప్రస్తావించాను. ఈ 'కాలనీ'లను నిర్వహించడానికి బడ్జెటులో మంజూరు లేదట! సికిందరాబాదులోని సీతాఫల్ మండీ ప్రాంతంలో ఇళ్ళుకట్టడం ప్రారంభించి నాలుగు సంవత్సరాలపైగా ఐంది. పునాదులు లేచినతర్వాత కొంతభాగం పనిచేసి మానేశాడు గుత్తెదారుడు. మరొకడు రంగంపై ప్రవేశించి, మరికొంత పనిచేశాడు. ఇళ్ళు లేవవు; లేచిన ఇళ్లల్లోకి మనుష్యులను రానివ్వరు.

ఇళ్లకొరత సమావేశాలవల్ల, ఉపన్యాసాలవల్ల తీరదని ప్రభుత్వం ఎంత తొందరగా గ్రహిస్తే అంత మంచిది.

## ఇత్తెహాద్ పునఃప్రవేశం

అధికారంలోఉన్న వ్యక్తులకు రాజకీయ ప్రయోజనాల ననుసరించి, నిర్వచనాలు తారుమారౌతుంటాయ్. దేశభక్తులు హఠాత్తుగా దేశద్రోహులౌతూంటారు. ఎర్రటోపీలను ఎండపెట్టి, వెల్లపూసి, దేశభక్తులౌతారు దేశద్రోహులు.

నిర్వచనాలు తారుమారుకావడం అధికారంలోఉన్న రాజకీయవాదులవిషయంలోనే కాదు; అధికారాన్ని ఆశించే రాజకీయవాదుల విషయంలోకూడా ఇదే జరుగుతుంది.

1948 సెప్టెంబర్ 13 మొదలు 17 వరకు జరిగిన పోలీసుచర్య హైదరాబాదులో—మనకు సంబంధించినంతవరకు తెలంగాణంలో — చరిత్రాత్మకమైన మార్పులు తెచ్చింది. ఆనాటివరకు అధికారంలోవున్న నిరంకుశ ప్రభుత్వంపై తిరుగుబాటు చేసిన వ్యక్తులకు పోలీస్ చర్య తరువాత చాలవరకు రాజకీయరంగంలో స్థానం లేకుండా పోయింది. రజాకారులతో సహకరించిప్రజలను నానాహింసలకు గురిచేసిన వ్యక్తులు కొందరు కొందరు పెద్దల అనుగ్రహంవల్ల పెద్దలైనారు.

మహమ్మదీయుల ఆశలను పురికొల్పి, వారిని పఉపయోగించుకొని, హిందువులపై, భారతప్రభుత్వంపై రెచ్చగొటిన నాయకులు కొందరు రంగుమార్చి జాతీయ నాయకులయ్యారు. మహమ్మదీయుల్లో సామాన్యులకి జీవనోపాధకూడా పోయింది చాలాకారణాలవల్ల. ఉర్దూ భాషలో విద్య నభ్యసించినవారిని, ఇంగ్లీషు భాష అమలులోకివచ్చి 'మీకు స్థానం లేదు పొమ్మ'ంది. ఈనాడు రాజధాని నగరంలోని నేరస్థుల నందరినీ పట్టుకొని, వారు నేరస్థులవడానికి కారణాలను నిష్పక్షపాతంగా పరిశీలిస్తే, పదకొండేండ్ల మన పరిపాలన ఎంతగా వ్యర్థమైందో మనకి అర్థమౌతుంది. గత వారంలో నగర పాలక సంఘానికి జరిగిన ఎన్నికలు చెప్పే పాఠాలు ఇవి. ముఖ్యంగా రాజధాని నగరంలో కాంగ్రెసుపక్షం అవలంబిస్తూన్న విధానాలకు ఈ ఎన్నికలు పరాజయాన్ని సూచిస్తాయ్.

రెండు నెలలక్రితం నగరపాలక సంఘం మేయర్ పదవికి ఎన్నిక జరిగింది. ప్రజాస్వామ్య పద్ధతులనుసరించి, నగరపాలక సంఘ సభ్యులకే ఈ ఎన్నిక విడిచిపెడితే ఎంతో బాగుండేది. అసమం-కొంతవరకైనా బాగుండేది. ప్రదేశ్ కాంగ్రెస్ సంఘం మేయర్ పదవికి ఫలానావారిని ఎన్నుకోవాలనిసూచించింది. ఎన్నిక జరిగింది; కాని ఇది అసంతృప్తికి దారి తీసింది. మేయర్ పదవిపై ఆశపెట్టుకున్న కొందరు రాజీనామా ఇవ్వడం, ఉపసంహరించుకోడం జరిగింది. అధికంగా నగరపాలకసంఘానికి రాజీనామా ఇచ్చి తొందరపడి, వెంటనే ఉపసంహరించుకొ

(61-వ పేజీ చూడండి)

# చైనా దుశ్చర్యకు లోక్‌సభ అభిశంసన

## ప్రధాని జన్మదిన విశేషాలు: భారత కమ్యూనిస్టుల ఎత్తుగడలు

### న్యూఢిల్లీ లేఖ — శ్రీ కృష్ణ

ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ 70 వ జన్మదినోత్సవం మొన్న నవంబరు 14 న జరిగింది. గడచిన పన్నెండు సంవత్సరాలుగా భారత్‌కు ఆయన ప్రధానమంత్రిగా ఉండి సారథ్యం నిర్వహించారు. చరిత్రలో జాతీయ, అంతర్జాతీయ రంగాలలో ఆర్థికంగా, రాజకీయంగా అనేక గడ్డు సమస్యలకు గురి అవుతున్న భారత్‌కు నేడు ఆయన సారథ్యం ఎంత అవసరమో వేరే చెప్పనక్కరలేదు.

లోక్ సభా సమావేశాలు ప్రారంభమైనాయి.

దేశంలో ప్రస్తుతం గడ్డుసమస్యగా పరిణమించిన చైనా దురాక్రమణపట్ల తమ ప్రభుత్వాన్ని పల్లెత్తుమాట కూడా అనకుండా కాంగ్రెస్‌వాదులు క్రమశిక్షణతో మెలగుతున్నారు. కాంగ్రెసులో మితవాదులనుంచి ప్రధానమంత్రికి ప్రత్యేక రక్షణలు కల్పించడానికి ఇదివరలో కమ్యూనిస్టులు మీరట్‌లో సమావేశమై ఒక నిర్ణయం చేశారు కూడా. దీనితో ప్రజాసోషలిస్టులు, జనసంఘం, స్వతంత్రులు మిగిలిపోయారు. స్వతంత్రులలో ఉన్న విశేషమేమిటంటే—వారు నిజంగా స్వతంత్రులే! స్వతంత్రులలో కొందరు ఒక ముఠాగా ఏర్పడి ప్రస్తుతం విదేశాలలో ఉన్న శ్రీ జయపాల్ సింగ్‌ను తమ నాయకునిగా ఎన్నుకున్నారు. ఎన్నడూ ముందుకురాని శ్రీ వాజ్‌పాయ్ జనసంఘీయులకు ప్రతినిధి. ఇక ప్రతిపక్షబాధ్యత అంతా ప్రజాసోషలిస్టులమీద పడ్డది. ఆచారప్రకారంగా ప్రజాసోషలిస్టులు అంతర్ని కూడగట్టుకుని ప్రభుత్వానికి బలమైన ప్రతిపక్షంగా వ్యవహరించలేకపోయారు.

లోకసభ సమావేశాలు ప్రారంభమైన రోజున ప్రజాసోషలిస్టు నాయకుడు ఆచార్య కృపలానీ సభకు వాయిదా తీర్మానం ప్రతిపాదిస్తూ తాను సరిహద్దు ప్రాంతాలు పర్యటించి అక్కడి గ్రామాల పరిస్థితులు స్వయంగా పరిశీలించామని వెల్లడించారు. డార్జిలింగు చుట్టుపట్ల చిత్రవస్త్రాలయశాలలు చైనీయులు నెలకొల్పారని ఆయన తెలిపారు. ఈ అంశం చర్చకు పెట్టాలని శ్రీ కృపలానీ కోరారు.

### చతురంగం

ఇక ప్రధానమంత్రి సామాన్యులా? ఇటువంటి రాజకీయ చతురంగంలో ఆయన ఆరితేరినవారు. చర్చకు తాను సిద్ధమేననీ, అభ్యంతరమేమీ తనకు లేదనీ ఆయన అన్నారు. కాగా ఆ చర్చ ఆయనకు చాలా ఇష్టం కూడాను. ఎందుచేతనంటే ఈ చర్చవల్ల చైనా దురాక్రమణనుంచి దేశాన్ని రక్షించడానికిగాను ప్రభుత్వం ఇంతవరకూ ఏంచేసిందో, ఏంచేయనున్నదో చెప్పడానికి ఆయనకిది మంచి అవకాశం కలిగిస్తుంది. అయితే వాయిదా తీర్మానం వాంఛనీయం కాదని అంతా భావించారు. వాయిదా తీర్మానానికి కేటాయించిన రెండున్నర గంటలూ చాలవు. పైగా చౌ-ఎన్-లై కి శ్రీ నెహ్రూ వ్రాసిన లేఖతోసహా ముఖ్యమైన కాగితాలన్నీ లోకసభకు ప్రభుత్వం అందజేయలేదు. కాగా చైనా ప్రధానికి శ్రీ నెహ్రూ వ్రాసిన లేఖ నవంబరు 16 న న్యూఢిల్లీలోని చైనా రాయబార కార్యాలయానికి అందజేయబడింది. అది చైనా ప్రధానికి అందిన తర్వాతనే సభవారికి దాని ప్రతి అందిస్తామని శ్రీ నెహ్రూ చెప్పడంతో శ్రీ కృపలానీ అంగీకరించారు. దానితో వాయిదా తీర్మానం వీగిపోయింది!

### సిక్కిం, భూటాన్?

చర్చలో జోక్యం కల్పించుకుని సిక్కిం, భూటాన్‌ల మాటేమిటని ప్రశ్నించారు శ్రీమతి రేణుకారే. భూటాన్‌పై దండయాత్ర జరిగితే అది భారత భూగంపై జరిగినట్లే భావింపబడుతుందని పదేపదే స్పష్టంగా ప్రకటించడం జరిగిందని శ్రీ నెహ్రూ బదులుచెప్పారు. "భూటాన్‌లో మేమింకా సైన్యాన్ని ఉంచలేదు. ఉంచే ఉద్దేశ్యం కూడా లేదు. అయితే మానుంచి ఎప్పుడు ఏరకం సహాయం కావలసినా అడగవలసిన బాధ్యత భూటాన్ ప్రభుత్వానికి విడిచిపెట్టాము. ఇదివరలో సైనికశిక్షణ ఇచ్చి మేమెంతో భూటాన్‌కు సాయపడ్డాము. ఇక సిక్కిం. అది పూర్తిగా మాతో ముడిపడి ఉన్న విషయం. దాని రక్షణ బాధ్యత మాదే" అని స్పష్టంగా ప్రధాని నెహ్రూ వెల్లడించారు.

ఇక్కడ కొంత పరిశీలన అవసరం. భూటాన్‌పై దురాక్రమణ భారత్‌పైచేసినట్లే కాగలదన్నారు శ్రీ నెహ్రూ. కాగా ప్రత్యక్షంగా అసలు భారత భూభాగం మీదనే చైనా దురాక్రమణ జరుపుతున్నది. ఈ దురాక్రమణ నెదుర్కొనేటందుకే ప్రధానమంత్రి పదేపదే మహాత్ముని స్మృతి స్మరిస్తున్నారు. చైనా దురాక్రమణకు ముందే భూటాన్‌లో భారత వ్యతిరేకపక్షాల ప్రాబల్యం ఉన్నట్లు తెలుస్తున్నది. కాగా చైనాను తమ భూభాగంనుంచే తరిమివేయలేని భారత్‌ను భూటాన్ ఎలా విశ్వసించగలదు? ప్రధానమంత్రి ఈ విషయం ఆలోచించాలి.

### "సోవియట్ ట్రిక్స్"

భారత్‌పట్ల స్నేహాభిమానాలు చూపుతున్నదని ప్రత్యేకంగా పేర్కొని రష్యాకు కృతజ్ఞత తెలిపారు ప్రధానమంత్రి. ఇటీవలనే శ్రీ క్రుశ్చేవ్ 'లడక్ కీలక ప్రాధాన్యాన్ని' గుర్తించడానికి నిరాకరించారు. "ఎవరికయినా సైన్యాధిపతికి నివేదించండివన్నీ—ఈ సైనికాధికార్లు చెప్పే కీలక ప్రాధాన్యాలు నేనువిశ్వసించను" అని శ్రీ క్రుశ్చేవ్ వక్కాణించారు.

చిరకాలంగా శ్రీ నెహ్రూను, ఆయన విధానాలను బలపరుస్తున్న లండన్ పత్రిక 'న్యూ స్టేట్స్‌మన్' ఈవారం ఒక ప్రత్యేక వ్యాసం వ్రాస్తూ, లడక్‌లోని విస్తృత భూభాగాలు చైనాలో మెల్లిగా కలిపివేసుకోవాలని శ్రీ చౌ-ఎన్-లై ఉద్దేశిస్తున్నారని వ్యాఖ్యానించింది. ఇటువంటి దుశ్చర్యలమాని శాంతి నెలకొల్పకునే ప్రయత్నాలు జరుగుతే ఢిల్లీతోపాటు పెకింగ్‌కుకూడా గౌరవమర్యాదలు ప్రపంచంలో మరింత ఇనుమడించగలవని 'న్యూ స్టేట్స్‌మన్' ప్రకటించింది.

ఇదియిలావుండగా టిబెట్‌లోని షీగాట్సీ ప్రాంతంలో రష్యన్‌లు సైనికస్థావరాలు నెలకొల్పుతున్నట్లు గ్యాంగ్‌టాక్ వర్తమానం తెలుపుతున్నది. ఇటీవల సిక్కిం సందర్శించిన 'డెయిలీ ఎక్స్‌ప్రెస్' ప్రతినిధి ఒక సందర్భంలో ఇలా వ్రాశారు:




భారత నౌకాబలం కోసం "కృపాణ్" "కుఠార్" అనే రెండు అత్యాధునికమైన ఫ్రిగేట్ లను తయారు చేశారు. ఇవి నవంబరు 20 వ తేదీన బొంబాయి చేరాయి. ఇవి జలాంతర్గాములను ఎదుర్కొనగలవు.

# ★ న్యూఢిల్లీ లేఖ ★

'సిక్కిం మహారాజాను దర్శించాను. కోటలో కూర్చుంటారు ఆయన. చిత్రలేఖనం ఆయన సరదా. బొమ్మలు గీస్తున్నారు ఆయన పరికొత్తగా ఒక చిత్రం వేశారు. అందులో ఒక యతి సుందరాంగి అయిన స్త్రీని కౌగలించుకున్నట్లు చిత్రించబడింది. ఆ చిత్ర మనిపించింది. తూర్పునుంచి ఏవో దయ్యాలు వచ్చిపడుతున్నాయని ఆయన భయం (!) వాటిని తరిమివేయడానికి కట్టా గోపురాలు నిర్మిస్తున్నారు సిక్కిం మహారాజా. కాగా యువరాజాకు నిరంకుశ పాలనలో తప్ప రాజ్యాంగ సమ్మతమైన ప్రజాప్రభుత్వంలో నమ్మకం లేదు. రాజకీయ కార్యకర్తలంటే ఆయనకు చాలా ద్వేషం. ఈ స్థితిని ఒక్కమాటలో చెప్పాలంటే 'చిత్రంగా వుంది' అనాలి—అసలు అంతే'.

*           *           *

## సప్తతివత్సరకీర్తిమాన్!

నవంబరు 14 వ తేదీని ఢిల్లీలో ప్రధాన మంత్రి 70 వ జన్మదినోత్సవకృత్యములు నిండాయి. 'టైమ్స్ ఆఫ్ ఇండియా' యజమాని ప్రయివేటురంగానికి నాయకుడూ అనదగిన శ్రీ శాంతిప్రసాద్ జైయిన్ ఈ మహోత్సవ సందర్భంలో ఒక పుస్తకాన్ని ప్రచురించారు. ప్రధానికి అంకితం చేసిన ఈ పుస్తకం అందజేయబడింది ఇందులో అనేకుల వ్యాసాలు ఏర్చి కూర్చబడినాయి. అయితే ఐదేళ్ళ క్రితం ఇటువంటిదే ఒక పుస్తకం ప్రకటించారు. దానిక్రింద ఇప్పటి పుస్తకం అన్నివిధాలా తీసికట్టు. ఇందులో వున్న సరుకునుబట్టిచూస్తే ఈమాట అనక తప్పడంలేదు: శ్రీ నెహ్రూ సోదరీమణులు ఇద్దరూ ఇందులో వ్యాసకర్తలే. కాగా మంత్రిపదవికి శాశ్వత అభ్యర్థినిగావున్న ఆయన మేనకోడలొకామె అందులో శ్రీ నెహ్రూనుగూర్చి వ్రాశారు. డాక్టర్ సయ్యద్ మహమూద్ లాటి ఆయన హితైషులు మరికొందరి వ్యాసాలున్నాయి. అందులో శ్రీలాల్ బహదూర్ శాస్త్రి, హుమయూన్ కబీర్ లు కూడా ఉన్నారు. కాగా ప్రణాళికను గూర్చి శ్రీ ఢేబర్, 'నవీన యుగం' గూర్చి పి. సి. మహలనబీస్ ఇందులో వ్యాసాలు వ్రాశారు!

అయితే కొన్ని మంచి అంశాలు కూడా లేక పోలేదు. ఆర్థర్ మూర్, లూడ్విగ్ ఏర్ హార్డ్, కూజ్ వెల్లసలీ, విలియం డగ్లస్, విన్సెంట్ షీయాన్ మొదలైనవారి వ్యాసాలు ప్రకటించి ఈ పుస్తకానికి న్యాయం చేకూర్చారు.

## ఉన్నమాటలు

శ్రీ నెహ్రూమీద ఈమధ్య బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడు శ్రీ డెస్మండ్ డోనెల్లీ డెయిలీ మెయిల్ (లండన్)లో ఒక [illegible] వ్రాశారు. అందులో ఆయన శ్రీ నెహ్రూను బ్రిటిష్ మాజీ ప్రధాని శ్రీ చేంబర్ లేన్ తో పోల్చారు. "ఇద్దరికీ పోలిక కొంతవరకే పరిపోతుంది. భయంకరమైన మొండితనం ఇద్దరిలోనూ ఉంది. ఇద్దరిలోను ఎన్ని లోపాలున్నా [illegible]మైన ధర్మావేశం ఉన్నది. ఇంతటితో నే ఇద్దరికీగల పోలిక అయిపోతుంది. శ్రీ చేంబర్ లేన్ కన్నా శ్రీ నెహ్రూ చాలా విశాల దృష్టి కలవారు. కాని అంతటి సమర్థుడైన పాలకుడు కాదు. శ్రీ నెహ్రూ ఎంత కార్యశూరుడైనా ఇంకొకరికి బాధ్యత అప్పగించరు, అప్పగించలేరు. అలా చేయలేనివారు పరిపాలనాదక్షులు కాలేరు. భారత్ కు సమగ్రపరిపాలన అవసరమైన సమయంలో నాయకత్వం వహిస్తున్న శ్రీ నెహ్రూలోగల ఈ లోపమే అడ్డుతగులుతున్నది. అన్నీ తన చేతిమీదుగా జరగాలనే అభినివేశం ఎక్కువ. తన వారసుడుగా ఎవరికీ ఆయన శిక్షణ నివ్వలేదు. ఆయన మరికొంతకాలం శారీరకంగా మానసికంగా దృఢంగా ఉండవలసిన అవసరం ఆయన సృష్టించారు. ఆయన దార్ఢ్యంమీద, ఆరోగ్యంమీద భారత్ భవితవ్యం ఆధారపడి ఉన్నది. నాకు వ్యక్తిగతంగా శ్రీ నెహ్రూ అంటే చాలా అభిమానం. అయితే ఇంతటి మహావ్యక్తి పై పరిస్థితులకు కారకుడు కావటం విచారకరం. కొన్ని మూలప్రశ్నలు అలానే నిలచిపోతున్నాయి. ఈ మనిషి డెబ్బైయేళ్ళ వయస్సులో మారటం సాధ్యమా? ప్రస్తుతం ఎదుర్కొంటున్న గడ్డుసమస్యలకు ఆయన ఇకపై తట్టుకొనగలడా? అయితే ఇటువంటి స్థితిలో కూడా ఆయన పదవినుంచి వైదొలగాలనే ప్రసక్తి ఎక్కడా వినరావటంలేదు. ఆయనకూ ఆ ఉద్దేశ్యం లేదు. ఆయనలో ఎన్ని లోపాలున్నాయో ఆయనపై అంతటి అభిమానం భారత్ లో ఉన్నది. ఆయన వైదొలగితే భారత్ లో తుఫాను ఏర్పడుతుంది. అయోమయ మౌతుంది... ఆయన అనుభవం, జాగ్రత్త ఈ సమయంలో ఎంతైనా అవసరం, అయితే నేడు ఎదుర్కొంటున్న గడ్డు పరిస్థితిలో భారత్ తన భూభాగం ఏమాత్రం కోల్పోయినా శ్రీ నెహ్రూ వ్యక్తిగత గౌరవం పూర్తిగా పోతుంది. అయితే అప్పటి తరుణోపాయం ఒక్కటే. పరిపాలనా వ్యవస్థలో అటువంటి [illegible]మే కనుక ఏర్పడితే - దానికి బాధ్యుడు ఆయన కనుక మరొకరిని, సమర్థుడైన వ్యక్తిని ప్రధానమంత్రిగా ఎన్నుకొనమని పదవినుంచి వైదొలగడం ఒక్కటే ఆయన చేయగలిగింది. ఇటీవల అలాంటి ప్రయత్నం ఆయన చేశారు. చిరకాలంగా ఆక్రమించుకున్న ఆసనంనుంచి ఆయన దిగితే ఇంతకన్న గొప్పసేవ దేశానికి ఆయన చేయగలుగుతారు. ముందున్న చారిత్రిక సమరంలో భారత్ ను ఉత్తేజపరచడానికి ఆయన జీవితం అంకితం

(63 వ పేజీ చూడుడు)

# ఆంధ్రప్రాంతాన్ని సస్యశ్యామలము, సుసంపన్నముచేసే ప్రాజెక్టులు పరిశ్రమలు

బులుసు వేంకట సుబ్బారావు

ఈ సువిశాల రాష్ట్రాన్ని సందర్శించిన వారెవరైనా అంటారు..."మీ ఆంధ్రులు ఎంత అదృష్టవంతులు! ఈ మహానదుల్లో ఏ ఒక్క నదీజలాలను వినియోగించుకో గలిగినా చాలు, అపరిమితమైన విద్యుచ్ఛక్తి మీకు శాశ్వతంగా దాస్యంచేస్తుంది. ఒక్క మహానది నీళ్ళను మీ పొలాలకు మళ్ళించుకొంటే చాలును, లక్షల ఎకరాలు సస్యశ్యామలములౌతాయి. మీ దేశపు ప్రకృతి సంపద అతులయమైనది. ఎంత ఖనిజ సంపద! ఇనుము బొగ్గు, మైకా, మాంగనీసు, బెరైటస్, ఆస్బెస్టస్, సున్నపురాయి—ఎన్ని రకాల ఖనిజాలు! ఈ గనుల లోపలగల ఖనిజాలను, ఆ నదులిచ్చే విద్యుచ్ఛక్తిని జోడిస్తే చాలు మహత్తర పారిశ్రామిక వైభవంతో కలకలలాడుతుంది మీ తెలుగు నేల!"

అవును మనరాష్ట్రానికి అనేక సహజ సదుపాయాలున్నవి. వాటిని ఫలోన్ముఖం చేసికో గలిగితే ఇటు వ్యావసాయికంగాను, అటు పారిశ్రామికంగాను మనం ముందడుగు వేయవచ్చును. స్వతంత్రం వచ్చింది. స్వరాష్ట్రం సిద్ధించింది. ఇక ఏ మాత్రం జాప్యం పనికిరాదు. మనం అతిరయంగా పురోగమించాలి. మన నదీజలాలను ప్రాజక్టులద్వారా ఫలదాయకం చేసుకోవాలి. జలవిద్యుచ్ఛక్తిని సాధించి మన ఖనిజసంపదతో, మన ముడిపదార్థములతో పారిశ్రామికాభ్యుదయానికి యత్నించాలి.

ప్రాజక్టులు రెండు రకాలు-ఇరిగేషన్ ప్రాజక్టులు అనగా నీటి పారుదల సౌకర్యాన్ని విస్తరించడానికి ఉద్దేశింపబడినవి. పవర్ ప్రాజక్టులు అనగా విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి ఉద్దేశింపబడినవి. అయితే సాధారణంగా భారీప్రాజక్టులను నిర్మించేటప్పుడు రెండువిధాలా ఉపయుక్తమయేటట్లు చూస్తారు.

## నాగార్జున సాగర్

మన ప్రాజక్టులను గురించి చెప్పుకొనేటప్పుడు ముఖ్యంగా పేర్కొనవలసినది నాగార్జునసాగరం. ఆనాడు ఆచార్య నాగార్జునుడు ఇక్కడనే ఉద్భవించి ఈ ప్రదేశాన్నంతా విజ్ఞానవిహారంగా, సర్వకళాలాలంగా శోభింపచేసేడు. ఈనాడు ఆ మహాశయుని పేర నిర్మితమౌతూన్న ప్రాజక్టు ఆంధ్రప్రదేశాన్నంతా అఖండ భాగ్యోపేతంగా విలసిల్లచేస్తుంది. ఈ ప్రాజక్టు నిర్మాణానికిఅయే మొత్తం ఖర్చు 93 కోట్ల రూపాయలు. ప్రథమంలో 66½ కోట్ల రూపాయిలతోనే నిర్మితమౌతుందనుకొన్నారు. కాని ఇనుము, ఉక్కు, సిమెంటు ధరలు పెరగడంవలన ఖర్చు 98 కోట్లరూపాయిలకు పెరిగింది. రెండవ పంచవర్ష ప్రణాళికలో దీనికై కేంద్రప్రభుత్వం రూ 32.30 కోట్లను కేటాయించింది. అయితే ఈ ధనం చాలదని దీనిని అదనపతుం రు. 43 కోట్లకు పెంచాలని రాష్ట్రప్రభుత్వం అభ్యర్థించింది. అనుకొన్నవిధంగా జరిగితే ఈ పథకంలో మొదటి దశ నిర్మాణం 1964 వ సంవత్సరానికి పూర్తి అయేదకాని ఏవో అడ్డులు తగలడంవలన ఒక సంవత్సరం ఎక్కువపడుతుందని భావిస్తున్నారు. నేటికి ఈ పథకంపై రు. 18 కోట్లుఖర్చు చేసేరు. నాగార్జునసాగరనిర్మాణం మూడు విధాలుగా కొనసాగుతోంది-డాము (ఆనకట్ట) నిర్మాణము, ఎడమవైపు కాలువ నిర్మాణము, కుడివైపు కాలువ నిర్మాణము. ఈ మూడింటిలోను పని చురుకుగా సాగుతోంది. డాము నిర్మాణంలో 25,000 మంది కాలువల నిర్మాణంలో 80,000 మంది నిరంతరాయంగా పని చేస్తున్నారు. నాగార్జున సాగరం కుడికాలువ ప్రపంచమందలి కాలువలన్నిటిలోను పొడవైనది. ఇది పూర్తి అయిన తరువాత 125 మైళ్లు వ్యాపిస్తుంది. నేటికి 48 మైళ్ళ త్రవ్వకం పూర్తి అయింది. నాగార్జునసాగరం ఎడమ కాలువ పొడ[illegible] 108 మైళ్లు. 85 మైళ్ళ త్రవ్వకం ఇప్పటి[illegible] పూర్తి అయింది: ఈ ప్రాజక్టువలన మొత[illegible] 75,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి లభిం[illegible] కలదు. 1965 లో ప్రాజక్టు మొదటి భాగ[illegible] పూర్తి అయేసరికి ఇటు వ్యవసాయికంగాను అటు పారిశ్రామికంగాను రాష్ట్రానికి ఎంతో సహాయకారి కాగలదు. ఆంధ్రుల నవయు[illegible] చైతన్యానికి నాగార్జునసాగర నిర్మాణ[illegible] ప్రత్యక్ష నిదర్శనమని చెప్పవచ్చును.

## ఎగువ పెన్నారు

తృతీయ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్ర ప్రాంతంలో ప్రాముఖ్యం పొందిన మరో ప్రాజక్టు ఎగువ పెన్నారు ప్రాజక్టు. దీ[illegible]నందు తుంగభద్రా లోలెవెల్ కనాల్ నిర్మాణం పూర్తి అయింది. దీని తరువా[illegible] తుంగభద్రా హైలెవెల్ కనాల్ నిర్మాణ[illegible] అత్యంత లాభకరమైనదని భావింపబడు[illegible] వలన కేంద్రప్రభుత్వం 18 కోట్ల రూపాయ[illegible]ను కేటాయించింది. ఈ ప్రాజక్టువ[illegible] మైసూరు రాష్ట్రంకూడా అధిక లాభాని[illegible] పొందగలదు. ఆంధ్రరాష్ట్రంలో 1,18,00[illegible] ఎకరాలకు మైసూరు రాష్ట్రంలో 68,00[illegible] ఎకరాలకు నీటి వసతులను ఈ పథక[illegible] కలిగించకలదని అంచనా వేసేరు. 21.[illegible] లక్షల రూపాయిలు ఇప్పటికే ఖర్చు చెం[illegible] బడ్డాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళి[illegible] ఆఖరు సంవత్సరంలో పూర్తి చేయబ[illegible] భైరవానితిప్ప ప్రాజక్టు కూడ అతిరయం[illegible] నిర్మింపబడుతోంది.

## పోచంపాడు

ఆంధ్రప్రాంతంలో రెండవ ప్రణాళి[illegible] యందు నాగార్జునసాగర్, ఎగువ పెన్నా[illegible] ప్రాజకులెంత ప్రాముఖ్యమైనవో అదేవి[illegible] గా తెలంగాణాయందు పోచంపాడు, కడె[illegible] ప్రాజక్టులు అంతటి ప్రాముఖ్యమైనవి. 19[illegible] డిసెంబరు నెలనాటికి పోచంపాడు ప్రాజ[illegible] విషయ పరిశీలనము ముగిసింది. నామ[illegible]

# ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్యమైన ప్రాజెక్టులు




## ప్రాజెక్టులు. పరిశ్రమలు ★

నింగ్ కమిషన్ సమ్మతింపగానే ఈ జెక్టు పని ప్రారంభమౌతుంది. తెలంగా కు ఈ ప్రాజక్టు అత్యంత లాభదాయక వది. దీనివలన సుమారు 20 లక్షల ఎక లకు నీటి వసతి కలుగుతుంది. ఇది కేవలం గేషన్ ప్రాజెక్టే కాదు. దీనివలన సుమారు 5,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి కూడ లభి ందని అంచనా వేసేరు. అయితే పోచం ప్రాజక్టు సంపూర్ణ నిర్మాణానికి తగిన ం సమకూరనందున ప్రస్తుతం 8,60,000 రాలకు నీటి పారుదల సదుపాయాలు కలి ట్టుగాను, నిజామాబాద్, కరీంనగర్ లకు 20,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ్యమయేటట్టుగాను ఈ ప్రాజక్టును నిర్మి రు. ఇంత తక్కువలో నిర్మించడా మొత్తం 16 కోట్ల రూపాయిలు ఖర్చు కాగలదనీ అంచనా వేశారు.

కడెం ప్రాజక్టు కూడా తెలంగాణాకు అధిక ప్రయోజనకారి కాగలదు. అయితే ఆ ప్రాజక్టు నిర్మాణానికి నియోగించిన ఇంజనీర్ల పొరపాటువలననో, వరదల వలననో... (వరదలవలన. వర్షాలవలన ప్రాజక్టులు కొట్టుకొనిపోవడంకూడా ఇంజనీర్ల సామర్థ్య లోపమే) డాము ఇప్పటికే రెండుసార్లు కూలిపోయి, అధికమైన ధన వ్యయానికి దారి తీసింది. ఇకమీదనైనా రాష్ట్రప్రభుత్వం సమర్థులైన ఇంజనీర్లను, కంట్రాక్టర్లను నియమించి ప్రజాధనం గంగపాలు కాకుండా చూడవలసి ఉంది.

## నిజాంసాగర్

తెలంగాణాలో చాలాకాలం క్రితమే పూర్తిఅయిన ప్రాజక్టులందు నిజాంసాగర్ ప్రాజక్టు గణనీయమైనది. గోదావరినదికి ఉపనదిఅయిన మంజీరానదిజలాలను సద్వినియోగపరచడానికిగాను 1924 లో నవాబ్ అలీ నవాజ్ జంగ్ ఒక పథకాన్ని తయారు చేసేరు. ఆ ప్రకారమే నేటి ప్రాజక్టు నిర్మాణం ప్రారంభమై 1931 లో సమాప్తమైనది. నిజాంసాగర్ ప్రాజక్టు రిజర్వాయరు అతివిశాలమైనది. ఆనకట్ట పొడవు రెండు మైళ్ళు. వందమైళ్ళ పొడవైన కాలువ త్రవ్వబడినది. దీనికైన మొత్తం ఖర్చు 4½ కోట్ల రూపాయలు. కృష్ణానదికి ఉపనది అయిన పాలేరు జలాలను వినియోగపరచేందుకు తెలంగాణాలో పాలేరు ప్రాజక్టు నిర్మింపబడింది. ఇది చాలా చిన్నది. దీనికైన ఖర్చు రూ 25 లక్షలు మాత్రమే. పాలేరు ప్రాజక్టువలన మొత్తం 18,000 ఎకరాలకు నీటివసతి కలిగింది.

## రాజోలిబండ

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ప్రారంభమై 1960 వ సంవత్సరం జూన్‌మాసములో

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# సంక్రాంతి ప్రత్యేక సంచిక

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 13-1-60 తేదీ సంచిక సంక్రాంతి ప్రత్యేకసంచికగా వెలువడుతుంది. దసరా, దీపావళి సంచికలవలెనే సంక్రాంతిసంచిక కూడా మా అసంఖ్యాక పాఠకలోకానికి ఉల్లాసోత్సాహాలు కలిగించే కానుకగా సమర్పించాలని మా ఆశయం.

సంక్రాంతి సంచికకు ప్రత్యేకంగా వ్యాసాలు, కథలు, పద్యాలు, గేయాలు, రేఖాచిత్రాలు, ఫొటోలు, పంపించగోరువారు డిసెంబరు 20 వ తేదీలోగా మాకు అందేటట్లు పంపించ మనవి. వాటిపై "సంక్రాంతి సంచికకు" అని కూడా వ్రాయాలి.

పూర్తికానున్న రాజోలిబండ ప్రాజక్టు, తెలంగాణాకు అధిక ప్రయోజనకరమైనది. రాజోలిబండ ప్రాజక్టు నిర్మాణానికి 1958-59 సంవత్సరంలో అయ్యే వ్యయం రూ 41 లక్షలు. 1959-60 వ సంవత్సరాంతానికి మరొక రూ 93 లక్షలు వ్యయమౌతుంది. ఆంధ్రప్రదేశ్ వంక ఈ ప్రాజక్టులో మైసూరురాష్ట్రమందు ఒక ఆనకట్ట నిర్మాణం జరగవలసియుంది. మైసూరు రాష్ట్రం ఈ ఆనకట్ట నిర్మాణానికి అశక్తను చూపడంవలన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వమే ఆ నిర్మాణానికి పూనుకొన్నది.

## ఎగువ సీలేరు

అసలు డాము నిర్మాణం అవసరం లేకుండానే అత్యల్పవ్యయంతో అధిక ప్రయోజనాన్ని సాధింపగల ప్రాజక్టు ఎగువ సీలేరు ప్రాజక్టు. ఎగువ సీలేరు ప్రాజక్టు నిర్మాణ సౌకర్యం దృష్ట్యా ప్రధాన భాగాలుగా విభజింపబడింది. మాచ్‌ఖండు మిగులు జలాలను వినియోగపరచడానికి ఈ ప్రాజక్టు ఏర్పరచబడింది. దీనియందు ప్రథమదశ నిర్మాణానికి అనుమతి లభించింది. పూర్తిగా ప్రథమదశ నిర్మాణం అవడానికి మూడు నాలుగు సంవత్సరాలు పట్టవచ్చును. మాచ్‌ఖండ్ ప్రాజక్టునకు ఎగువన 50 మైళ్ళలో ఈ ప్రాజక్టు నిర్మాణం జరుగుతుంది. ఎగువ సీలేరు ప్రాజెక్టు నిర్మాణానికి మాచ్‌ఖండు ప్రాజక్టు నిర్మాణమందు వినియోగించిన యంత్రాంగం పనికివస్తుంది. కనుక విదేశీమారక ద్రవ్యం రు 200 లక్షలు మాత్రమే కావాలి. ఈ మొత్తాన్ని కేంద్ర ప్రభుత్వం కేటాయించడానికి అంగీకరించింది. ఈ ప్రాజక్టులకు 25 మైళ్ళ దిగువన దిగువసీలేరు ప్రాజక్టు నిర్మింపబడవచ్చును. పై రెండు ప్రాజక్టులుకూడ విద్యుదుత్పత్తికి, నీటిపారుదలకు ఉపయుక్తమైనవే.

## మాచ్‌ఖండ్

విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి ఉద్దేశింపబడి నిర్మితమైన ప్రాజక్టులందు మాచ్‌ఖండ్ హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజక్టు ప్రధానమైనది. ఈ ప్రాజక్టు ఆంధ్ర, ఒరిస్సా ప్రభుత్వాల సహకారంతో నిర్మింపబడింది. విశాఖపట్టణానికి 125 మైళ్లలో ఉన్నదిది. డుడుమా జలపాతం వలన ఉత్పన్నమయే శక్తి యీ ప్రాజక్టుకు ఆధారభూతము. దీనివలన కలిగే విద్యుచ్ఛక్తిలో డెబ్భైపాళ్ళు ఆంధ్రప్రదేశ్‌కీ, 30 పాళ్ళు ఒరిస్సాకు లభిస్తాయి. 17(0 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే మూడు ఉత్పాదక యంత్రాలు, 21,250 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని సరఫరాచేసే ఒక ఉత్పాదక యంత్రము 42,250 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని సరఫరాచేసే మరిరెండు ఉత్పాదక యంత్రాలు పూర్తిగా నిర్మింపబడినాయిక్కడ. కొద్దికాలంలోనే ప్రాజక్టునిర్మాణం సంపూర్ణమౌతుంది. దీనివలన శ్రీకాకుళం, విశాఖపట్టణం, ఉభయగోదావరులు, గుంటూరు, కృష్ణా, నెల్లూరుజిల్లాలకు తగినంత విద్యుచ్ఛక్తి సరఫరా అవుతుంది.

## తుంగభద్ర

తుంగభద్రా హైడ్రో ఎలెక్ట్రిక్ స్కీ కూడ ఇటువంటిదే. దీనియందు 36 కిలోవాట్ల శక్తిని సరఫరాచేయగల నా పెద్ద జనరేటర్లు డామ్‌వద్దనున్న పవర్ హౌ లో నిర్మితమయాయి. ఇవికాక యీ ప్ర క్టులో హాంపీ పవర్ హౌసు వద్ద మొ 18,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్ చేసే రెండు ఉత్పాదకయంత్రాలు నాటికి సమాప్తమయాయి. తుంగభద్రా విద్యుదుత్పాదకపథకం క్రింద రాయలసీ కొంతవరకు నీటిపారుదల సదుపాయాల గించడానికి విజయవంతమైన కృషి జరి అధికమైన విద్యుచ్ఛక్తి సరఫరాను కలిం శ్రీశైలం ప్రాజక్టు బహుశా రెండవ ప్ర కలో చేర్చబడవచ్చు.

## చిన్న ప్రాజెక్టులు

పైన తెలుపబడినవి ప్రధానమైన ప్ర క్టులు. ఇవికాక ఇంకా అనేకం ఉన్నా ఇటీవలే 10,000 ఎకరాలకు నీటివసతి క చిన కృష్ణాబారేజ్ ప్రాజక్టు, రాం ప్రాజక్టు, రాళ్ళపాడు ప్రాజక్టు పూ అయేయి. విశాఖపట్టణంజిల్లాకు నీటిసర కల్పించడానికి మొన్న జూన్‌లో నే ప్రారం బడింది. మరొక చిన్న ప్రాజక్టు - తా రిజర్వాయరు స్కీమ్. దీనికయే వ్య వ్యయం 118 లక్షల రూపాయిలు.

(54 వ పేజీ చూడండి)

# కల్యాణి స్మృతులు

పణతుల రామచంద్రయ్య

"జోజో మహానంద జోజో ముకుందా
జోజో జగద్వంద్య జోజో ఉపేంద్రా
జోజో"

జోలపాట వినవస్తున్నది. మధుర మధురంగా, మకరంద స్రావిగా వినవస్తున్నది. …లయేటి హొయలులా, మామిడిగుబురులలో …రి రవళించే పిల్లగాలిలా ఆ పాట వెయ్యి …య్యారాలు పోతూ వినవస్తున్నది ... ఏ యశోద ఈ సమయంలో తన చిన్నికృష్ణునికి జోల పాడుతోందో!

...రాగాలు పెట్టి ఏడుస్తున్న చంటిగాడు మెల్లగా ఏడుపు ఆపేసి నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోయాడు. ఉయ్యాల వూపుతూ …టపాడుతున్న కల్యాణి, వూపటం ఆపి, జోలపాటను కూని రాగంగా మార్చి ఒక్కసారి ఉయ్యాలలోకి చూసింది.

కుర్రాడు ప్రశాంతంగా నిద్రపోతున్నాడు. వాడి పచ్చని మొహంమీద వల్లటి వెంట్రుకలు పడి ఆమె నిశ్వాసపుగాలికి అటూ యిటూ కదులుతున్నయ్... "ఆరు నెల్లు నిండలేదు వెధవకు, ఎందుకో ఇంత పెద్ద జుత్తు! ... ఇప్పట్నుంచే 'ఒంకులు' తిప్పి క్రాపులు దువ్వటం సాగిస్తాడు కాబోలు" అనుకుంది కల్యాణి. ఉండబట్టలేక ఆమె రెండుసార్లు వాడి బుగ్గలమీద వేలితో చక్కిలిగింత పెట్టింది. అలా చక్కిలిగింత పెట్టినప్పుడు వాడు ఆ చిన్ని బోసినోరు తెరిచి నవ్వుల వెన్నెలలు కురిపిస్తుంటే, …ఆనందం కల్యాణికి.

అంతా అయ్యపోలికే! తన పోలిక ఒక్కటీ వచ్చినట్లు లేదు వెధవాయికి! నవ్వేటప్పుడు నోటిదగ్గర లోతైన సొట్టలూ, ముద్దబంతి చెండుల్లాంటి రెండు బుగ్గలూ… …ంచి ముందుకు ఉబికి వచ్చిన చుబుకమూ. ఇంకా కొన్నాళ్లు పోతే అయ్యలాగే ఒంకుల క్రాపూ......!

నవ్వుకుంది కల్యాణి.

కుర్రాణ్ణి గురించిన ఆలోచనాతరంగాన్ని ఒకవేపుకు తోసేసి, ఉయ్యాల్లోకి చూస్తున్నదల్లా ఒక్కసారి తలెత్తి గోడమీద ఫోటోవైపు చూసింది. కల్యాణి. అదే నవ్వు ... అవే బుగ్గలు ... అదే జుత్తు! నవ్వే, నుదురుమీద వంపులు తిరిగిన ఆ జుత్తే ఆనాడు తనను తనవేపుకు ఆకర్షించుకున్నాయి. ఏ యింద్రజాలం వున్నదో వాటిల్లో! వాటిని చూశాక, మనస్సుకు కళ్లెం వేసి బిగించుకోబోయిందిగాని, సాధ్యం కాలేదు. అంతవరకూ మస్తిష్క కుహరంలో నివసిస్తున్న ఆనర్సు చదువు తాలూకు ఆదర్శాలూ, హక్కులూ వగైరాలన్నీ ఆ నవ్వు ముందు ఆగలేక రెక్కలుకట్టుకుని ఎగిరిపోయాయి! తనలో వచ్చిన ఈ హఠాత్పరివర్తనమూ చూసి తల్లిదండ్రులూ, అక్కయ్యా, బావా, ఇంకా తెలిసినవాళ్ళూ... వాళ్ళూ వీళ్ళూ ఏమిటి, చివరకు ఎకనమిక్సు లెక్చరరు శర్మగారుకూడా ఆశ్చర్యపోయారు.

రెండు సంవత్సరాలు వెనక్కు వెళ్ళి నిల్చుంది కల్యాణి......

ఏవేవో ఆశయాలనూ, లక్ష్యాలనూ పమిటి కొంగులో ముడేసుకుని ఎకనమిక్సు చివరి సంవత్సరం చదువుతున్న రోజులవి. ఆ ఆశయాలూ, లక్ష్యాలూ అన్నీ ఒక్కటొక్కటిగా విజయవంతంగా ఆచరించేసి, ఉన్నత స్థానాన్ని చేరుకుని, ఆ తరువాత జీవితాన్ని రంగురంగుల ఇంద్రధనస్సుగా చేసుకోవాలని ఉబలాట పడుతున్న రోజులు......అవును. అప్పుడు తనకు జీవితపు తాకిడి తెలీదు. ఆర్థిక సూత్రాల ప్రకారం జీవితాన్ని సిద్ధాంతీకరించుకుని, దానికి అనుబంధంగా వేసుకున్న ప్రణాళికల సహాయంతో, జీవితంలో ఏవైపుకు కావాలంటే ఆవైపుకు పుష్పకయాత్ర చేయవచ్చుననుకుంది తాను......

"పెద్దవాళ్లు గుడ్డిగా ముడిపెట్టేస్తుంటే, ఆ ముడికి దాసులై భార్యాభర్తలు జీవితాల్లో ఒకరికొకరు గుదిబండలుగా తయారవకూడదు. 'పెళ్ళి', 'పెళ్ళి' అంటూ ఏవో సనాతనుల సంప్రదాయాల ప్రకారం ... ఒక పసుపుదారం జీవితబంధంగా చేసుకుని...జీవితంలో ఎన్ని అగ్నిపర్వతాలు, ఎన్ని ఝంఝామారుతాలు చెలరేగినా, ఆ సూత్రాన్ని అతిక్రమించలేక కృంగిపోకూడదు. 'విధి, విధి' అంటూ, ఆ శాసనాలను విధిగా అనుసరిస్తూ మనచేతిలో ఏమీ లేదనుకుని దుర్బలులమై పోరాదు. అనాదినుండీ ఈ దౌర్బల్యాలకు లోనుకావటంవల్లనే మనకు—స్త్రీలకు—జీవితంలో సమానవిలువలు అందలేదు. ఈ దౌర్బల్యాలనుండి విముక్తిపొంది చైతన్యం అలవర్చుకోనంతకాలం స్త్రీజాతికి అభ్యుదయం లేదు..." ఇలా దొర్లిపోయేవి తన ఉపన్యాసాలు.

ఈ విప్లవభావాలతోనే తను కాలేజీ విద్యార్థినుల సంఘానికి కార్యదర్శిని అయింది. తోటి విద్యార్థినులంతా తనని 'ఝాన్సీరాణి' అనీ, ఇంకా ఏవేవో మాటలతో వేళాకోళాలు చేసినా, ఆ వేళాకోళాల్లోనే తనకో వింతతృప్తి; వెంటనే ఒక ఆవేశం...తనపద్ధతీ, ఉపన్యాసాలూ గూర్చి ఒక్కోసారి లెక్చరరు కామేశ్వరమ్మ ముసిముసిగా నవ్వేది. శర్మగారు కూడా!...ఏ అంతరార్థంతో నవ్వేవాళ్లో! శర్మగారు కామేశ్వరమ్మ భర్త. తరచు చనువుగా వాళ్ళింటికి వెళుతుండేది తను. ఓరోజున కామేశ్వరమ్మ తనకూ, శర్మగారికీ టిఫిను పెడుతూ "ఏమండోయ్, మీ శిష్యురాలికి, మోస్ట్ అప్‌టుడేట్, మోస్ట్ ఎడ్యుకేటెడ్, మోస్ట్ రివల్యూషనిస్ట్ అయిన కుర్రాడెక్కడన్నా వుంటే గాలం వేసి లాక్కురండి. లేకపోతే మరోకర్వే. మరోకర్వే తరించదు సరా!" అనేసరికి శర్మగారు కూడా ఫక్కున నవ్వేసి "మరయితే త్వరలో నాకు ప్యారిస్ ప్రయాణం వుందన్నమాట!" అన్నాడు... శర్మగారు నిజంగా ధర్మరాజు...ఆ రోజులే చాలా తమాషైనరోజులు ... అబ్బాయిలతో పోటీ పడేందుకే తాము కాలేజీలో చేరామనుకున్న రోజులు...

అలాంటి తనను మార్చేసి, అయస్కాంత శక్తితో తనవేపుకు ఆకర్షించుకున్నది....

ఏమిటి?

ఆ ఫోటోలోని విగ్రహం!

...ఆలోచనలకు కళ్లెంవేసి మళ్ళీ ఒకసారి ఆ ఫోటోవంక చూసింది కల్యాణి... ఫోటోలో అదే నవ్వు! నీడలు తేలుతున్న ముఖంమీద ఆ మాయదారి నవ్వు! భానూ ఎప్పుడు నవ్వినా అదేవిధంగా, అవే సొంపుల్తో నవ్వుతాడు. మళ్ళీ, నిన్నగాక మొన్న అవతరించిన 'యీ వెధవ'కూడా అదే నవ్వు!...

కల్యాణి కిటికీదగ్గిరికి వెళ్ళి చూసింది. సాయంకాలమయింది. రెగ్యులేటర్ వంతెన

# ★ కల్యాణి స్మృతులు ★

కూడా కాదని—గది యివ్వవలసిన అగత్యం ఏమిటి తనకి? ఈ విషయం ఆరోజు వ్యక్తావ్యక్తంగానే వుండిపోయింది...అలా చేసినందుకు తాతయ్యగాని, ఇంకా యింట్లో వాళ్లుగాని తనమీద మరోలా అభిప్రాయ పడతారేమోనని తను భయపడినమాట నిజమే. కాని వాళ్ళేమీ అనుకోలేదు. తాతయ్య మాత్రం ఇదంతా తన పెడసరంకింద జమకట్టి, ఓపిక వున్నంతసేపూ అరచి వూరుకున్నాడు.

ఆ అబ్బాయి—భానుమూర్తి—గదిలో చేరిన తరవాత పదిరోజులకు, ఓ రోజు తాతయ్య తనతో అన్నాడు:

“చూశావమ్మా, మొన్న రాజమండ్రి నుంచీ ఒకాతను వొచ్చాడు; భార్యాభర్త వచ్చి వుంటామన్నాడు....ఎంత లేదన్నా ఇరవై యిచ్చేవాడు నెలకి...మరి నువ్వేమో ఇతగాణ్ని చేర్చి పెట్టావాయె, పది రూపాయిలకి దమ్మిడీ మించకుండా—”

ఎందుకో తెలీదుగానీ, ఆ సమయంలో తాతయ్య తనమీదికేమైనా అన్యాపదేశం విసురుతున్నాడా అనిపించింది... ఛీ ఛీ! ఈ ముసలాళ్ళకు వయస్సుతోబాటే పిసినిగొట్టుతనంకూడా ఎక్కువవుతుంటుంది. ఎందుకనో!

“అయితే అతన్ని లేచిపొమ్మనక పోయావా?”—తన గొంతులోకి తనకు తెలీకుండానే కోపం ప్రవేశించింది.

“లేచిపొమ్మనటం కాదమ్మాయ్! గది యిచ్చిన తరువాత లేనిపొమ్మంటామాగాని... కాస్త ముందాలోచన వుండాలి ...” అన్నాడు తాతయ్య.

మళ్ళీ ఆ ప్రసక్తి రాలేదు.

భానుమూర్తిని కాలేజీలో స్నేహితులూ, వాళ్ళూ వీళ్ళూ కలిసి విద్యార్థి సంఘం అధ్యక్షుడుగా నిలబెట్టి గెలిపించేశారు. తను ఆశ్చర్యపడ్డా. కాలేజీలోకి కొత్తగా వొచ్చిన కుర్రాణ్ని,... ఆ ఒడ్డూపొడుగూ విగ్రహాన్ని చూసి ఎన్నుకున్నారేమోలే అనుకుంది...అవునేమో; మరి తన వోటుకూడా అతడికే వేసింది. భానుమూర్తి తన క్లాసే. క్లాసుమేటవటంవల్ల అతనికి వోటు వేశానని తనకుతనే సమాధానం చెప్పుకుంది.

విద్యార్థిసంఘం అధ్యక్షుడు తన క్లాసుమేటవటంవల్ల, పై పెచ్చు తమ యింట్లో అద్దెకుంటటంవల్ల—తనకో విధమైన గర్వంగా వుండేది. అందువల్లనే కావచ్చు, అతడు కాలేజీ కార్యక్రమాల్లో విద్యార్థినులకు ప్రాముఖ్యం ఇచ్చేలా చూడమని విజయా, ఇంకా యితర స్నేహితురాళ్ళూ తనతో చెబుతుండేవాళ్లు. తనుకూడా అలాగే ఆశించింది. కాని అలాంటి ఆశలు పెట్టుకోడం దండగే అని తేలటానికి ఎంతో కాలం పట్టలేదు. భానుమూర్తి స్వతహాగా బద్ధకస్తుడు; కొంచెం నిర్లక్ష్యంకూడా వుంది మనిషికి. అధ్యక్షుడుగా అతడు చేసిన మంచిపని ఒకటి లేదు. అయితే తమాషా—ఇంతనిర్లక్ష్యం మనిషినీ, ప్రిన్సిపాలుతో సహా అందరూ గౌరవించేవాళ్ళు. అతడు ట్వీడ్ ప్యాంటు జేబుల్లో చేతులు పెట్టుకు స్టేజీమీద నిల్చుంటే, అతడేదో ఉద్ధరించే మాటలు చెప్పబోతున్నట్టు నిశ్శబ్దంగా వినేవాళ్లు.

అధ్యక్షుడుగా తను ఒక్క నిర్మాణాత్మకమయిన పని చెయ్యకపోయినా, భానుమూర్తి చేసిన పెద్ద ఘనకార్యం ఒకటుంది. అదేమిటంటే, ప్రతియేటా కాలేజీ సారస్వత సంఘానికి కార్యదర్శిగా విద్యార్థినుల్లోంచి ఎవర్నైనా ఎన్నుకుంటుండేవాళ్లు. విద్యార్థినులకూడా యూనియన్‌లో ప్రాతినిధ్యం వుండటానికని అలా జరుగుతుండేది. పుణ్యాత్ముడు భానుమూర్తి ప్రెసిడెంటయి ఆ పద్ధతి కాస్తా ఎగరగొట్టేశాడు. ‘ఛట్, ప్రాతినిధ్యమూ లేదు, గాడిదగుడ్డూ లేదు పొమ్మన్నాడు. అతడి ధర్మమా అంటూ ఆయేట వో కుర్రాడు ఆ సీట్లో ఎన్నుకోబడ్డాడు... పాపం, తాను సారస్వత సంఘానికి సెక్రటరీ అయిపోతుందనే ఆశతో అందాకా వందరకాలుగా ‘అభ్యుదయ, సాహిత్య’ ఉపన్యాసాలతో సహా సిద్ధం చేసుకొచ్చిన విజయకు కళ్లనీళ్ల పర్యంతం అయింది!

......తనకా సంగతి తెలిసి మండిపోయింది...మరీ ఇంత దారుణమా!...... ప్రిన్సిపాలుతో వెళ్ళి చెప్పింది. ప్రిన్సిపాలు అంతావిని, ఈ విషయం తనదాకా రానేలేదంటూ, “పోనీ, ఎటూ ఎలెక్షన్ అయిపోయిందంటున్నావుగదా! మళ్ళీ తిరగదోడటమెందుకు?” అన్నాడు—“ఇప్పుడేం మునిగిపోలేదులే” అన్న ధోరణిలో.

తనేం చెయ్యగలదు? ఎంత ఎదిరించినా లాభం లేందే!......ఆ రోజు యింటికి వచ్చాక కూడా కోపం తగ్గలేదు. సాయంత్రం భానుమూర్తి వచ్చేవరకూ వేచి వుండి, అతడు రాగానే యీ విషయం అడిగేందుకు అతడి గదిలోకి వెళ్లింది తను. తను వెళ్ళేసరికి, గదిలో పుస్తకాలు సర్దుకుంటున్న భానుమూర్తి ఇటుతిరిగి తనవేపు ఏదో అడివిమృగాన్ని చూసినట్టు చూసి, “కూచోండి” అన్నాడు.

తను ముక్తసరిగా అడిగింది: “సారస్వత

సంఘానికి సెలెక్షన్ అయిపోయింది ననుకుంటాను—"

ఇంకొకరయితే తనువచ్చిన విషయాన్ని వెంటనే గ్రహించి ఏదో వొక సంజాయిషీ అయినా చెప్పివుందురు. కాని భానుమూర్తి ఏదో మహాభారాన్ని వదిలేసి చేతులు కడుక్కున్న వాడిలాగా అన్నాడు: "ఆఁ అయిపోయిందండీ!.........ఈ రోజుతో ఆఫీడా విరగడయిపోయింది......"

ఇక ఇతడితో ఏలా మాట్లాడటం? ఏమి మాట్లాడగలదు?......రాతిగుండె మనిషి కాకపోతేయినా ఎలాటివాళ్ళను గురించి తెలుసుకోలేదు!......తను మరేం మాట్లాడకుండా యివతలికి వచ్చేసింది. వచ్చేశాక ఆ కోపంలో అనుకుంది: "ఇతన్ని గది ఖాళీ చెయ్యమందామా?" అని.

కాని మనస్సు ఎదురు తిరుగుతోంది. ఎందుకో తెలీదు......

ఇంతలో ఏడేళ్ళశశి పలక చేతపట్టుకుని పరుగెత్తుకొచ్చింది, "అక్కయ్యా, మరే... పిల్లగా సీప్రూ?" అంటూ.

"ఛీ! పో" అని కోపంలో చీదరించుకున్నది తను. శశి చిన్నబుచ్చుకు వెళ్ళిపోయింది. వెళ్ళిపోయేటప్పుడు బుంగమూతి పెట్టి, "నేను పాఠం చెప్పమంటే నువ్వు నన్ను వీపుమీద ఫెడీ ఫెడీమని కొట్టావని తాతయ్యతో చెబుతానుండు" అంది.

"వీపు చీరేస్తాను" అంది తను—తన కోపానికి భానుమూర్తిమీదికోపంకూడా కలిపి.

శశి వెళ్ళిపోయింది; కాస్సేపటికి తాతయ్యను వెంటబెట్టుకొచ్చింది.

"అదికాదమ్మా, నీకేమో దానికి రెండుముక్కలు చెప్పటానికి తీరిక లేదాయె" అన్నాడు తాతయ్య.

"దాని వేషాలు చూస్తుంటే వొళ్ళుమండుకొస్తుంది తాతయ్యా!...ఎప్పుడేనా ఏదేనా స్థిమితంగా ఆలోచించుకుంటున్నప్పుడు వొస్తుంది, ఓపలక చంకనేసుకుని, సివంగిలాగా..."

"అదికాదమ్మా నేననేది...ఆ కుర్రాడు కాస్త దీనికి రెండుముక్కలు చెబుతాడేమోనని......"

ఎవరు? భానుమూర్తా?? దీనికి ప్రైవేటు చెప్పటమా"...అయినట్లే!

"ఏమోమరి" అంది తను.

"ఎటొచ్చీ దీనికి ప్రయివేటు చెప్పించాలనే అనుకుంటున్నానుగదా! ఇక వేరే మేష్టర్ని కుదిరిస్తే, ఏ పదో పన్నెండో యివ్వందేగాని రాడు. ఎందుకూ అతనుండగా? ఏదో తీరికైనప్పుడు ఇతన్నే కాస్త చెబుతుండమందాం...ఇరవై రూపాయిలఅద్దెపనికి తగ్గించాముగదా!..." తాతయ్యఇన్నిరోజుల్నుంచీ తక్కువైన అద్దెను గురించే తపస్సు చేస్తున్నట్లుంది.




'వాళ్ళమ్మాయి జోలికి పోవద్దన్నానా'?

చిత్రం: జె. సత్యనారాయణ, బిలాస్‌పూరు.

"ఏమో అనుకుమరి...ఐతే నువ్వు వెళ్లుతూనే 'యిరవై రూపాయిలూ, పది రూపాయిలూ' అంటూ మొదలెట్టకేం, బావుండదు" అంది తను.

తాతయ్య నవ్వాడు. తనూ నవ్వింది. ఇంతవరకూ 'ఇతణ్ని గది ఖాళీ చెయ్యమందామా?' అనుకున్నదే తను!...ఇప్పుడిదేమిటి? అతడిమీద తనకెందుకీ 'ఒకరకం' అభిమానం? ఏమనుకుంటోంది తను అతణ్ని గురించి?...

శశికి ప్రయివేటు చెప్పటానికి వొప్పుకున్నాడు భానుమూర్తి. మర్నాడునుంచీ శశిని అతడి దగ్గరికి పంపించారు.

ఆ ప్రయివేటు చాలా తమాషాగా వుండేది...రోజూ ఎనిమిది గంటలకు అతడి దగ్గరికి వెళ్ళేది శశి. చదివేది రెండో క్లాసయినా, అయిదో క్లాసువరకూవున్న పుస్తకాలన్నీ ఇంత కట్టకట్టి, ఇవికాక అమ్మదగ్గర పోరు చేసి చేగోడీలూ. మరమరాలూ వో పొట్లం కట్టి సంచీలో దూర్చి తీసుకెళ్ళేది. వెళ్ళి, సంచి గోడకు ఆనించి నిబ్బరంగా నే భానుమూర్తి "మాస్టారు చదువు" అనేవాడు. ఇక ఆ పిల్ల పుస్తకాలు ఇవతలికి తీసిపెట్టి, పొట్లంవిప్పి దాంట్లోంచి ఇన్నిన్ని తీసుకు నెమ్మదిగా తింటూ కూచునేది. అతడు పక్కనే కూచుని ఏ డిటెక్టివు నవలో చదువుకుంటుండేవాడు.

గంటా, గంటన్నరయ్యేసరికి ఆపిల్ల అవన్నీ తినటం పూర్తిచేసి పుస్తకాలు సరుకుని "మేష్టారూ, వెడతానండీ?" అనేది. అతడు తలెత్తి "ఆఁ......బాగా చదివావుకదూ రేపు ఈ పాఠం చదవకపోతే తన్నేస్తాను. వెళ్లు" అనేవాడు. ఆ పిల్ల చక్కా వచ్చేసేది రోజూ యిదేపద్ధతి!

ఈ సంగతి తనకు తెలిసింది......తనకి నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు. ఒరోజు శశిని ప్రయివేటు పోనీయకుండా దగ్గర కూచోబెట్టుకుని పేర్లు రాయమంటే నోరు వెళ్లబెట్టింది...ఈ మేష్టారుగారి శిష్యత్వం వల్ల, వచ్చినదికూడా మరిచిపోయింది!..

తను ఆరోజు నాన్నతో "నాన్నా! శశి తగ్గవాడే శశి మేష్టారుకూడా" అంది నవ్వుతూ.

"ఏం?"

"ఆయన ఏంచెప్పాడో, ఈ అమ్మాయి ఎంతవరకు నేర్చుకుందో ఆ బ్రహ్మకే తెలియాలి. కావలిస్తే నువ్వు రెండుప్రశ్నలడిగి చూడు."

నాన్న రెండుప్రశ్నలడిగాడు..... అమ్మాయి మెదడు ఖాళీగావుంది!

అయితే నాన్న భానుమూర్తిని తప్పుపట్టలేదు. పైగా ఆయన, చదువుకునే కుర్రాడిని—అందులో పెద్దక్లాసు చదువుతున్న వాణ్ని—పిల్లదానికి ప్రయివేటు చెప్పమని పురమాయించిన వాళ్లను ఆన్యాయపదేశించకలేడు. మరుసటిరోజునుంచీ శశికి మరో మేష్టర్ని కుదిర్చారు.

భానుమూర్తి ఎంత నిర్లక్ష్యం మనిషి

(53 వ పేజీ చూడుడు)

# లంకె బిందెలు

బాపు

బొమ్మల కథ 5












## "నసెగ గొత్తిల్లా"

(మొదటి బహుమతి రూ. 10)

నేను మొన్న వేసంగి సెలవులకు బెంగుళూరులో మా అన్నయ్యా వాళ్ళ యింటికి వెళ్ళాను. నేను వెళ్ళి వారంరోజులు అయింది. కన్నడము యింకా ఏమీ నేర్చుకోలేదు. 'నసెగ గొత్తిల్లా' - అనేమాట తప్ప ఏమీ రాదు. ఒకరోజున మా స్నేహితుడింటికి వెళ్ళవలసివచ్చింది. నేనొక్కడినే వెళ్ళామని బయలుదేరాను. బసవన్నగుడిలో వున్న మా స్నేహితుడింటికి వెళ్ళాలంటే 11 నెంబరు బస్సులో వెళ్ళాలి. 11 వ నెంబరు బస్సుకోసం మల్లేశ్వరము బస్సు స్టాపు దగ్గర నిలబడివున్నాను. పది నిమిషాలలో బస్సువచ్చి ఆగింది. ఆ వూళ్ళో ప్రతి బస్సుకి రెండు ద్వారాలు వుంటాయి. అక్కడి పద్ధతి ప్రకారం ముందుద్వారం గుండా ఆడవాళ్ళు, వెనకద్వారంగుండా మొగవాళ్ళు ప్రవేశించాలి. నాకా సంగతి తెలియదు. అది ఆదివారం కావటంవలన వెనుకద్వారం దగ్గర జనం క్రిక్కిరిసి వున్నారు. నేను ముందు ద్వారం గుండా లోపలికి ప్రవేశించాను. వెంటనే కండక్టరు నన్ను చూసి "నీను హెంగ్ సరా, గండ్ సరా?" అని ప్రశ్నించాడు. అతడు నన్నేదో ప్రశ్నిస్తున్నాడనుకొని, కన్నడం తెలిసినవాడిలాగా 'నసెగ గొత్తిల్లా' అని చెప్పాను. దానికి బస్సులో అందరూ పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వడం మొదలెట్టారు. అప్పుడు, రెండు భాషలూ తెలిసిన బస్సులోని పెద్ద మనిషి ఒకడు నన్ను పిలిచి, కండక్టరన్న దానికి అర్థం చెప్పాడు "నీను హెంగ్ సరా, గండసరా!" అంటే "నీవు మగవాడివా, ఆడదానివా!" అని అర్థం. దానికి నేను 'నసెగ గొత్తిల్లా', అంటే, 'నాకు తెలియదు' అని సమాధానం చెప్పాను. అసలు విషయం తెలిసిన తరువాత నాకూ నవ్వాగలేదు.

ఆర్. జానకిరాం, విజయవాడ.

* * *

## నోటు తెచ్చినపాటు

(రెండవ బహుమతి రూ. 5)

సెప్టెంబరు పరీక్షలు జోరుగా సాగుతున్నయ్. రిజిస్ట్రారుగారు వచ్చారని కాబోలు వాచర్లు మరి కాస్త శ్రద్ధగా వున్నారు పరీక్షహాల్లో. కాపీలు జరుగకూడదని కంకణం కట్టుకొన్నట్లు ప్రవర్తిస్తున్నారు. కాని వీళ్ళు అంత కఠుగ్గా, చురుగ్గా వున్నప్పటికీ, ఆ విద్యలో ప్రవీణుడైన ఒకవిద్యార్థి తనపని ముగించి తల ఎత్తాడు తాపీగా. వాచరు తనవైపు రావడం గమనించి ఆ కాపీచీటి ఎం ప్రమాదం తెస్తుందోనని అమాంతం దాన్ని వుండగా నలిపి మింగేశాడు. ఇదంతా ప్రక్కనవున్న ఇంకొకతను చూశాడు. అప్పటివరకు జేబులోఉన్న కాగితాన్ని బయటకు తీయడానికి జంకుతున్నాడతడు. వాచరు తన దగ్గరకువచ్చి జేబులు పరీక్షిస్తే తను అప్పటివరకు కాపీ చెయ్యకపోయినా అపనింద రావచ్చునని గమనించాడు. వెంటనే చేతిని జేబులోకి పోనిచ్చి మొదటివ్యక్తిని అనుకరించాడు. వాచరుకు ఏమీ గుటుకు మళ్లిందో అక్కడ్నించి వెనుతిరిగాడు. బెల్ అయిన తరవాత ఎవరికివారు పేపర్లిచ్చి తాము వ్రాసిన వాటినిగురించి చర్చిస్తూ బయటకు రాసాగారు. ఈ విద్యార్థి చేతులు అప్రయత్నంగా జేబులోకి పోయినయ్. వెంటనే చేతికి ఏదో తగిలితే బయటికి తీశాడు. అది అతను నమిలిమింగిన కాగితం. ఈ తంత్రం ఏమిటాఅని ఆశ్చర్యపోయాడు కాసేపు. వెంటనే జేబులన్నీ గాలించుకొన్నాడు. తను ప్రొద్దునవస్తూ తెచ్చుకొన్న 5 రూ. ల నోటుకోసం. అదెక్కడుంటుంది? ఎప్పుడో జీర్ణమై వుంటుంది. ఇహ చూడండి అతని పరిస్థితి. అవకాశం వుండికూడా కాపీ చేయలేక పోయినందుకా? లేక తను అనవసరంగా మింగేసిన 5 రూ.ల నోటుకోసమా? దేనికోసంకు అతను బాధపడాలి?

కృష్ణ, గుంటూరు.

* * *

## మూగివాడు

(రెండవ బహుమతి రూ. 5)

మా మిత్రుల మంతా ఒకనాడు ఒక మిత్రుని ఇంటివద్ద కలుసుకుని పిచ్చాపాటి మాట్లాడుకుంటూ కూర్చున్నాం. అంతలో ఒక మూగవాడువచ్చి సంజ్ఞలతో తన కేదైనా ధర్మం చెయ్యమని కోరాడు. వాణ్ణి ఎంత పొమ్మన్నా పోకుండా, సంజ్ఞలతోను, మూగ శబ్దాలతోనూ వేధిస్తున్నాడు. వాడి కసలుమూగ ఉందా లేదా అని నాకు అను మానం వేసింది. ఒక క్షణం ఆలోచించి ఒ అర్థణా తీసి వాడి చేతిలో పెట్టి "ఇదుగ చూడు నాయనా! ఈ మూగ ఎప్ప నుంచి నీకు? ఫరవా లేదు లే, నా చెప్పు," అని రహస్యంగా అడిగాను. దాని వాడు నగురూ బెదురూలేకుండా "బాబు ఈ మూగ నాకు చాలకాలంనుంచి ఉ దండి" అని జవాబిచ్చి తాపీగా వె పోయాడు.

జి. సత్యనారాయణ,
తాడేపల్లిగూడెం

* * *

## బాదస్తానికి శాస్తి

(రెండవ బహుమతి రూ. 5.)

ఆ రోజుతో మాపరీక్ష లయిపోయాయి బాగా వ్రాశాము. వేసంగిశెలవు లిచ్చారు నేనూ మా స్నేహితులు పరీక్ష విషయా మాట్లాడుకొంటూ, మా ఊరికి దగ్గరను వంతెనమీద కూర్చున్నాము. కాసేపటి మాకు కొద్దిపరిచయమున్న మా ఊరుప్రె డాయన మాదగ్గరికి వచ్చి కూర్చున్నాడు ఆయన కొద్ది బాదకుడని మాకు ముం తెలుసు. ఆయన ఒక పొడుగుపాటి పొగా పాయతీసి సరిగా ఒకజానెడు చుట్టచుట్టాడు "అగ్గిపెటి ఉంటే యిస్తారూ......చు కాల్చుకుంటా"నని మమ్మల్ని అడిగాడు మాలో ఒకడు. "మేము సిగరెట్లు త్రా మండీ" అని చల్లగా జవాబిచ్చేశాడు. నిమిషాలు నిశ్శబ్దముగానే జరిగింది. మే కూర్చున్న చోటునుండి లైనుబస్సులుపోతు ఉంటాయి. మా ప్రక్క కూర్చున్న మనిషి బస్సురావటం చూసి నిలబడ్డా బహుశా ఎక్కడికైనా వెళ్ళవలసిన ఉందేమోనని మే మూహించాం. ఆయ కాపాడు. "ఎక్కవయ్యా" అన్నక్లీన మాటవెంట వేవినిపించింది. "నేనురానయ్యా అని పీటుకు చివరగా కూర్చునున్న కండక్ట "కొద్దిగా అగ్గిపెట్టంటే యిప్పిద్దురూ. చుట్ట కాల్చుకుంటా"నని వినయంగా అ గాడు. కండక్టరు వెంటనే విశ్వామిత్ర కారముదాల్చి "చాలే ఊరుకోవయ్యా. ఏదో పెద్దవాడవని ఊరుకున్నాను. నువ్ చుట్టలు కాల్చుకోవటానికి మా కారే ది కాయా!" అని నానాచివాట్లుపెట్టి బె బటన్ నొక్కగానే కారెళ్ళిపోయిం వెంటనే మావాళ్ళంతా గొల్లున నవ్వా

అప్పుడాయన ఏమీ మాట్లాడ లే ముఖము చిన్నదిచేసుకుని ఇంటిదారిపట్టా

దాసు సూర్యనారాయణ
కైకలూరు.



# తెలుగు వెలుగులు-12

తీసిన కొద్ది సినిమాలూ గంగిగోవుపాలు.

ఒక్కొక్క చిత్రం, ఒక్కొక్క సన్నివేశం, అందులో ఒక్కొక్క దృశ్యం ఒక్కొక్క వజ్రం. తా తలచిన ఊహకు కావలసి సొమ్ము, గానుసిన చందం కుదిరేపర్యంతన చిత్రశుద్ధి, చిత్రశుద్ధిగల కళాకారుడు బి. ఎన్. ప్రతిభ, తన యాగంలో పాల్గొనే నటులను రచయితలను పెట్టే యాగీ అమితమైనవి. 'సానుభూతి' లేని వారికి చిరాకు కలిగించేవి, ఆర్థిక లాభమాత్ర భావ్యకారులు నిశితంగా ఖండించేవి. చలనచిత్ర నిర్మాణంలోని సర్వాంగోపాంగాలూ తన ఈ "ఊహా చిత్రం"లో అందమైన రేఖలుగా, తను ఆలపించే పాటలో స్వరాక్షరాలుగా ఇమిడేవరకూ, ఆకుమాటుపిందెలా, తల్లి చాటు బిడ్డలా, కృష్ణునితో మురళిలా అమరేవరకూ స్వరానుస్వరాలలా, రాగరాలలా ఏకమయేవరకూ బి. ఎన్. అహోరాత్రాలూ పడే సాధన తపస్సే అనాలి. అందుకే ఆయనతో పనిచేసినవారంతా ఈ మాట ఆయన రాయించుకున్నారా, ఈ పాట ఆయన చేయించుకున్నారా; పాడించుకున్నారు అనే అంటారు గౌరవ పురస్సరంగా.

చిత్తశుద్ధితో పనిచేయడం అనేది కనీస ధర్మంగా, అధరిమేనా గొప్పవిషయంగా చెల్లి చివరకు చాదస్తంగా కనిపించి స్వర్ణయుగం అనే మాటకు యాథార్థ్యం పోయి 'పదార్థమే' ఖంగున మోగే ఈ నాటి వరకూ పరిమాణాలు పెరిగి ప్రమాణాలు పడిపోయే సన్నివేశాన్ని చూస్తూ అప్రతిభులైపోయిన వారిలో, తేరుకొని బాధపడిన వారిలో బి. ఎన్. ఒకరు. చాలకాలం గట్టిగా నిలబడ్డ వారు ఆయన ఒకరే.

స్నేహం సాప్తపదీనం అన్నారు. బి.ఎన్ రెడ్డి, తెలుగుసినిమా కలసి ఏడు చిత్రాలు సహవాసం జరిగింది. కొబట్టి, వారు వీరో వీరు వారో కావాలి.

ఉద్గ్రంథాలు పదిలంగా దాచుకోడానికే తప్ప చదువుకోడానికి కాదన్న నానుడిని బి. ఎన్. ఉత్తమ చిత్రాలకూ ముడి పెట్టవలసివచ్చింది ఆరికంగామాసినవారికి. అందువల్ల, ధైర్యస్థైర్యాలు గల బి. ఎన్. కూడా పరిస్థితిగతుల వత్తిడిని మన్నించవలసివచ్చింది. ఒక ఘట్టంలో-ఇటీవలిది—ఒక వంక లాభసాటి సూత్రం ఉపయోగించుకుంటూనే మరోవంక ఉత్తమాభిరుచి, సంస్కారంగల కళాకారుడుగా వాటిని తనే గ్రహిస్తూ ఏకకాలంలో ఉభయతారకమంత్రం పఠించి జోడుగుర్రాల సవారీ సాధించబోయారు...

జనబాహుళ్యం పోషించని సత్కార్యాలను ఆచరిస్తూ ఒక వ్యక్తి అవస్థపడాలనీ, సభలలో పత్రికలలో చప్పట్లు కొడుతూ కొందరు సగర్వంగా ఉపన్యాసాలు ఇవ్వడానికి వీలుగా ఒకవ్యక్తి కష్టనష్టాలు భరించాలని ఒకరిని ఆజ్ఞాపించే అధికారం, హక్కు ఏవొకరికీ లేని మాటనిజమే; కాని కొన్ని మంచిపనులు చేయగల ప్రతిభా వ్యుత్పత్తులు గలవారికి మాత్రం ఈమంచిపనులు చేయడం బాధ్యత, విధి అవుతుంది.

ఈదృష్టితోనే పదాశయాలు, అవి సాధించాలన్న సంకల్పం, తగిన సంస్కారం, వాటికి దీటైన సామర్థ్యం కూడబలుక్కు కూడుపుఠాణీ చేసుకుని బహుకొద్దిమందని మాత్రమే కలసికట్టుగా వరిస్తాయి మరి.

# హరివంశము

శివశర్మ



(గతవారం తరువాయి)

## అవతారపర్వము - 3

పసిడికెందగడుపై బరపినయట్లు వి
త్కుల ఐతకాంతి పై కొలుపువాని,
ముందట నెరసంజ మొలపించు చందమ
ద్దొరగ మణిదీప్తి నొప్పువాని,
ప్రళయాగ్నిశిఖలు పై బ్రసరించు క్రోధసం
రక్త విలోచన ప్రభలవాని.
నిఖిలాండములు నొక్క నెగవున దాటంగ
గల యద్భుతోగ్ర వేగంబువాని,
వైనతేయు నింద్రవజ్రావమానన
చండకాయునెక్కి చక్రశార్ఙ్గ
గదలుదాల్చి కడిమి గడగె సర్వాభయ
ప్రదుడు శ్రీవిభుండు బవరమునకు.

నారదుడు మూడులోకాలకు అతిథియై, ఎల్లప్పుడు విశ్శృంఖలంగా, కేళిగా, గ్రుమ్మరుతూవుంటాడు. ఆయన మహాసిద్ధుడు. అఖిలక్షేమంకరప్రజ్ఞుడు. తెల్లని ఆయన శరీరంయొక్క కాంతిముందు శరత్కాలంలోని మేఘాలు సిగ్గుపడిపోతూవుంటాయి. ఆయన సత్యవాక్కు. మాటఅన్నాడో దానికి తిరుగులేదు. బ్రహ్మకు ఆయన మానసపుత్రుడు. ఆయనవచ్చి, సభలో వున్న దేవతలంతా తన వంక చూస్తూవుండగా, సరాసరి వెళ్ళి, విష్ణువు ప్రక్కనవున్న ఒక ఉన్నతాసనం మీద కూర్చున్నాడు. వినయం ఉట్టిపడగా, మహతిని పారించి, విష్ణుదేవుని భువనరక్షణావతారాలను గురించి గానంచేసి, సభ్యులు పొగడగా, భగవంతుణ్ణి అలరించాడు. ఇంత చేసిగాని నారదుడు భగవంతునికి నమస్కారం చెయ్యలేదు. చేసి ఇట్లా అన్నాడు: "ప్రభు! మతిమంతులలో నీవు ఆద్యుడివి. ఊర్జితశక్తిసమన్వితులలో శ్రేష్ఠుడివి. ధైర్యవంతులలో మేటివి. అచ్యుతా! సృష్టి అన్నా, యోగమన్నా, నీవేగాని మరియొక్కరివి కాదు. ఇప్పుడు సకల క్షత్రియోపసంహారార్థం జరుగుతున్న ఈ ఆలోచనలు నీ పరిగ్రహం లేకపోతే నిష్ఫలం అయిపోతాయి. భూలోకంలో ఇంతమంది దేవతలు తమతమ అంశాలతో పుట్టినా, మీరుకూడా అంశావతారం ఎత్తి, వారిని పాలనచేయనిపక్షంలో, ఈ అనుకుంటున్న క్రియాభారం సరిగ్గా నిర్వహిల్లదు. మీరుకూడా అవతారం ఎత్తితే వారిలో ఉత్సాహం దీపిస్తుంది. అదీగాక, ఇప్పుడు జరగవలసిన పని పార్థివక్షయకరణం ఒక్కటే కాదు. దేవాంశజులకు అసాధ్యమైన కార్యాలు కూడా అక్కడ ఏర్పడివున్నాయి. ఆ విషయం తమ చెవిని వేసిపోదామనే నేను సత్వరం ఇక్కడికి వచ్చాను. ఆ విషయం అంతా వివరిస్తాను. స్వామీ అవధరించు.

"పూర్వం తారకామయమనే పేరున జరిగిన ఘోరమైన దేవదానవ సంఘర్షణం మీకు గుర్తువుండే వుంటుంది. ఆ యుద్ధంలో మీ పరాక్రమానికి బలియై అనేకమంది అసురులు అసువులు కోల్పోయారు. వారంతా ఇప్పుడు భూలోకంలో పుట్టి నానాసంక్షోభం చేస్తున్నారు. ముఖ్యంగా మధుర అనే నగరంలో లోకవిలయకారియైన దనుజుడు కంసుడనే పేరుతో విజృంభిస్తున్నాడు. ఆ కంసుడెవరో నేను తమకు విన్నవించుకోవలసిన అవసరం లేదు. వాడు కాలనేమి. తారకామయసమయంలో మీచే నిహతుడైనవాడు. వాడు ఉగ్రసేనుడనే పరమ ధార్మికుడైన రాజుకు పుత్రుడై ఉదయించాడు. పూర్వదుర్వాసనా పరిష్కారి వాణ్ణి వదలకపోవడంవల్ల ఆ తండ్రియొక్క ధార్మికగుణంలో లవలేశం కూడా వాడికి అబ్బలేదు. వాడు రాజేగాని రాజగుణాలు వాడిలో ఎక్కడా కన్పించడం లేదు. పూజలకు యోగ్యులయిన బంధువులను ఎవరినీ వాడు మన్నించడం లేదు. ఎప్పుడూ యుద్ధాలు లేవదీస్తూ, ధరణీరాజులకు శాంతి అన్నది లేకుండా చేస్తున్నాడు. వాడితేజం అసురమైంది గనుక మూడు లోకాలకు వాడి విక్రమం వెక్కసమైపోతోంది.

"వాడు పరమ నిర్దాక్షిణ్యుడు. పరమ విజిగీషువుల రాజ్యం కోసం తండ్రినే చెరలో పెట్టాడు. అతులితమైన సామ్రాజ్యలక్ష్మిని తనవశం చేసుకున్నాడు. పైగా వాడికి మరికొందరు అసురభటులు సహాయులై పనిచేస్తున్నారు. హయగ్రీవుడనే రాక్షసుడు మీకు తెలిసినవాడే. వాడు ఇప్పుడు కేశిఅయి పుట్టి, హయరూపంతో లోకకంటకంగా తిరుగుతున్నాడు. బలిపుత్రుడు అరిష్టుడు వున్నాడే వాడు వృషభాకృతినిదాల్చి అరిష్టనామకసంజ్ఞుడై పశుప్రళయం కల్పిస్తున్నాడు. ఖరుడు ధేనుకుడై ఖరాకారంలో స్వైరవిహారం జరుపుతున్నాడు. లంబుడనే రాక్షసుడు ప్రలంబుడై జన్మించాడు. నికుంభుడు కువలయాపీడం అనే ఏనుగురూపంలో జన్మించి కంసునికి పట్టపుగజమై వుంటున్నాడు. వరాహకిశోరులు చాణూరముష్టికులై, మల్లులై, ఉద్భవిల్లారు. వీరంతా తారకామయసమయంలో కాలనేమి సహచరులు, సేనానులు. ఇప్పుడు ఆ కాలనేమి కంసుడై జన్మించగా అతనిభృత్యులై జనించి, యమునా పరిసరతీరాలలో. బృందావనంలో, భాండీరకమనే మఱ్ఱిచెట్టు దగ్గర వున్న తాళవనంలో, మధురారాజ్యంలో పశుప్రళయము, జనప్రళయము కల్పిస్తున్నారు.

# ★ హరివంశం ★

"మయుడు, మందారుడు అనే రాక్షసులుగూడా మీరు ఎరిగిన వాళ్ళే. తారకామయసమయంలో సమరంలో మీచే నిహతులైనారు. ఇప్పుడు వాళ్ళు భూలోకంలో మురాసురునికి తనయులై జన్మించి ప్రాగ్జ్యోతిషాధిపతియైన నరకునికి కూర్చిన సచివులై లోకభీకరంగా ప్రవర్తిస్తున్నారు.

"ప్రభూ! మీరు అవతారం ఎత్తినపక్షంలో వీరు ఎవరికిలొంగుతారు? ఎవరు భూదేవిభారాన్ని తొలగిస్తారు?"

నారదుని ప్రసంగం అంతా భగవంతుడు సావధానంగా విన్నాడు. విని "నారదా! నీవు చెప్పిన ఈ అందరి జన్మహేతువులు, వారు చేస్తున్న దుర్విగ్రహాలు అన్నీ నాకు తెలుసు. వీరుగాక ఇంకా పరమ రౌద్రావతారులయిన రాక్షసులుగూడా భూమిమీద పుట్టారు. పుట్టబోతున్నారు. కాలయవనుడు, జరాసంధుడు, శిశుపాలుడు, కేశిరుడు, చిత్రసేనుడు, బాణుడు ఇటువంటివాళ్ళు. వీరిని నేను సంహరిస్తాను. అందుకే భరతకులంలో పోరాటం పెట్టి భూదేవికి ప్రీతిగా, నాపని నెరవేర్చుకుంటాను. దేవర్షీ! ఇప్పుడు నీవు తారకామయం సంగతి ఎత్తావుగదా! ఆ సమరం ఎంత భయంకరంగా, ఘోరంగా సాగింది! ఇప్పటికీ ఆ పోరాటం నాకు కళ్ళకు కట్టినట్లు కన్పిస్తోంది." అన్నాడు.

"భగవన్! మీరు చిత్తగిస్తానంటే ఆ ఇతిహాసాన్ని గానం చేస్తాను."

భగవంతుడు చిరునవ్వునవ్వినాడు. దేవతలంతా ఆ యుద్ధంలో పాల్గొన్నవారే. వారికి గూడా ఆ వృత్తాంతాన్ని వినాలన్న కుతూహలంవున్నట్లే అనిపించింది. అప్పుడు కేశవుడు "సరే! నారదా! అదే గానం చెయ్యి" అని ఆజ్ఞ ఇచ్చాడు.

నారదుడు వీణను సారించి తారకామయేతిహాసాన్ని గానం చేశాడు. కృతయుగంలో వృత్రవధ జరిగింది. ఆ తర్వాత దైత్యులు కొంతకాలం పద్దుమణిగి వున్నట్లేవుండి ఒక్కసారిగా సుప్పున విజృంభించారు. మయుడు, తారుడు, వారికి నాయకత్వంవహించారు. వాళ్ళు యుద్ధాలలో దుర్జయులు, పైగా మయుడికి బ్రహ్మాండమైన రథంవుంది. అది బంగారురథం. ద్వాదశ శతహస్త విస్తృతమైంది. నాలుగుచక్రాలతో ఎంతవేగంగా పొమ్మంటే అంతవేగంగా పోతుంది. అన్ని ఆయుధాలు అందులో స్థానాలువున్నాయి. మయుడు ఆరథానికి ఎలుగుబంట్లను కట్టాడు. అవి వేయికిపైగా వున్నాయి. ఆ రథాన్ని ఎక్కి సర్వదానవులకు ఏకస్వామియా అన్నట్లు మయుడు యుద్ధానికి సన్నద్ధుడైనాడు.

తారుని రథం ఇందుకు పూర్తిగా భిన్నమైంది. దానికి ఎనిమిది చక్రాలు వున్నాయి. ఇనుముతో నిర్మించబడింది. కాకధ్వజంచేత అలంకృతమైంది. వెయ్యి గార్దభాలను పూన్చిన ఆ రథంమీద, క్రోశ విస్తీర్ణం కల్గిన శూలాన్ని ఆయుధంగా ధరించి అతడు యుద్ధానికి బయలుదేరాడు.

విరోచనుడు, హయగ్రీవుడు, వరాహుడు, విక్షరుడు, విప్రచిత్తిసుతుడు శ్వేతుడు, అరిష్టుడు, బాణుడు, లంబుడు, మొదలైన ఇతర దానవసేనానులు వారిని అనుసరించి నడిచారు. ఇతరులైన రాక్షసులు కొందరు ఖరములమీద, కొందరు ఉష్ట్రములమీద, కొందరు తోయదములమీద, మరికొందరు నానా పక్షిగణాలమీద, వికృతాలైన ముఖాలతో, ఏకపాదులు, ద్విపాదులు అయిన వికారాకారులు, దీప్తశార్దూల నిర్ఘోషులు, యుద్ధకాంక్షకలవారై రణరంగంలోకి ఉరికారు.

దేవతలకు ఇంద్రుడు నాయకత్వం వహించాడు. వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, విశ్వులు, సాధ్యులు మొదలైన దేవగణాలన్నీ సపరివారంగా పురుహూతుని నాయకత్వాన్ని ఆమోదించి రాక్షసులతో యుద్ధానికి సన్నద్ధమైనాయి. ఇంద్రుని రథం మేరువులాగావుంది. భాస్కర తేజంతో ప్రకాశిస్తోంది. మనస్సువలె, మారుతమువలె, వేగగమనం కల్గిన వేయిగుఱ్ఱాలను ఆ రథానికి కట్టారు. అశనిధ్వజాన్ని ఎగురవేశారు. బంగారంతో, వజ్రాలతో పరిష్కృతమై, అర్కమండలాన్ని ధిక్కరిస్తూ, సర్వదేవతల మనోరథం ఆకారందాల్చినట్లు వుంది ఆ రథం. సహస్రా

కూడా ఆ రథంమీద ఎక్కలేదు. వజ్రాయుధాన్ని చేతోపట్టుకొని, ఐరావతాన్ని అధిరోహించాడు. మాతలిపాలులో కూర్చుని రథాన్ని ఇంద్రుని ప్రక్కనే నడిపిస్తున్నాడు.

ఆ ఇంద్రునికి ఒక ప్రక్క, కఠోరదండహస్తుడు, కాలమృత్యు సహాయుడు, అపరిమితవ్యాధి పరివారుడు. యముడు నడుస్తున్నాడు. ఇంకో ప్రక్క కాలపాశం చేతోపుచ్చుకొని సకల సాగరభోగిపరివృతుడై, ముక్తావరకత భూషణాలుధరించి వరుణుడు నిలబడ్డాడు. కుబేరుడు యక్షరాక్షసబలాలతో, శంఖపద్మాదినిధులతో, పుష్పక విమానం ఎక్కి, గదను ధరించి, సాక్షాత్తూ త్రిలోచనుడు యుద్ధానికి వచ్చాడా అన్నట్లుగా ఇంద్రుని వెనుక మొహరించి నిలిచాడు.

తక్కిన దిక్పాలురంతా తమ తమ పరివారాలతో, అత్మీయమైన వాహనాలతో, యుద్ధసన్నద్ధులై వచ్చారు. ఏడు గుర్రాలు కట్టి, అనూరుడు రథసారధిగా సూర్యభగవానుడూ, తెల్లని గుర్రాలు, తెల్లనిరథం, చందనసుందరమైన శరీరం, తారాపరివారం, నీహార ప్రసారణం— ఈ అందంతో ఈ చందంతో చంద్రుడు, వచ్చారు. వీరిద్దరు దేవసేనా మధ్యస్థితులై నిల్చారు.

వీరు గాక భుజంగప్రభువులు, శైలేంద్రులు, వారు విషాగ్నిజ్వాలలతో శత్రునిర్దహనం చెయ్యడానికి, వీరు అరివర్గంపై సాంద్ర పాషాణవర్షం కురిపించడానికి వచ్చారు.

దేవతల ఈ సైన్యానికి కన్నాకై, పన్నెండువేలమంది సూర్యులు, పదివేలమంది ప్రళయపావకులు ప్రోవుకట్టినట్లు, బాసటగా నిలబడినాడు విష్ణువు.

ఈ రెండుబలాలకు ఘోరమైనయుద్ధం నడచింది. రెండుమహాసముద్రాలు, ఒకటి కొకటి ఎదురై, ఢీకొన్నట్లు, ఆ రెండు సైన్యాలు తలపడ్డాయి. ముందుగా దానవులు దేవతల తాకిడికి తట్టుకో లేకపోయినా, తర్వాత నిలవరించుకొని, మాయాబలంచేత దేవతలను నానా చీకాకుపెట్టారు. అది చూచి ఇంద్రుడు ఆత్మవైభవంతో ఆ మాయను ప్రతిహతంచేసి, కటికచీకటిలాగావున్న అమ్ముల సమూహంతో వియత్తలం యావత్తూ కప్పి చీకటిని క్రమ్మించగా, దేవతలు ఆ చీకటిలో దైత్యులను ఊచకోతకోశారు. తన సైన్యం రూపరిపోతూవుంటే, మయుడు కోపఘూర్ణితుడైనాడు. పూర్వం ఔర్వునిచేత సృష్టింపబడిన మాయ ఒకటి వానిదగ్గర వుంది. దాన్ని ఇప్పుడు దేవతలమీద వాడు ప్రయోగించాడు. ఆ మాయ సాక్షాత్తూ అగ్నికన్నా ఘోరంగా పనిచేస్తుంది. ఇంద్రుడు పన్నిన తిమిరవ్యూహాన్ని అది చీల్చివేసింది. దేవతలను కాల్చివేసింది. ఈ ఆపదను తప్పుకోవడం ఎట్లాగో అని ఇంద్రుడు వరుణునితో ఆలోచించాడు.

ఔర్వుడనే ఋషి పూర్వం కఠోరబ్రహ్మచర్యాన్ని అవలంబించి దీర్ఘకాలం తపంచేశాడు. అతని తపాన్ని చూచి జగాలన్ని గజగజలాడాయి. ఋషులు, దేవతలు అతనివద్దకువెళ్లారు. హిరణ్యకశిపుడు మొదలైన రాక్షసులుకూడా వచ్చారు. వాళ్లంతా కలిసి ఔర్వునితో ఇల్లా అన్నారు: "మహర్షీ! నువ్వు ఇంకా చిన్నవయస్సులో వున్నావు. ఇట్లా నువ్వు బ్రహ్మచారివై నిర్వహిస్తే కులం నిలుస్తుందా? అది మూలచ్ఛిన్నమై చెడుతుంది. మునులు, సిద్ధులు కూడా భార్యలను కట్టుకొని. సంతానం కంటున్నారు. నీగోల నీది గాని, ఈ నిలకడవల్ల నీకు మేలు ఏమైనా జరుగుతుందా? మా మాట విని పెళ్ళిచేసుకొని సంతానాన్ని కను."

ఔర్వుడు చిన్నవవ్వు నవ్వి— "నేను బ్రాహ్మణుణ్ణి. బ్రహ్మవిద్యాజిజ్ఞాసువును. అట్టి నేను బ్రహ్మచర్యనిష్ఠను పూనడంలో తప్పేమిటి? బ్రహ్మను తీసుకురండి, నేను ఈ నిష్ఠను వదిలేదిలేదు— అన్నాడు. బ్రహ్మచర్యదీక్షలేనివాడు తపము, ధర్మము, వ్రతము, యోగము అన్నీ వృధా అయిపోతాయి. ఇప్పుడు మీరు నాకు మన్మథవిద్యలు గరుపుదామనుకుంటున్నారు. జితేంద్రియుడను కాగోరే నాకు మీ మాటలు చెవికి ఎక్కవు. మీరు బ్రహ్మచర్యాన్ని నింది



"ఏమోయ్ కనిపించడవేం మానేశావ్!

చిత్రం : కస్తూరి విశ్వనాథ్

స్తున్నారు. సాక్షాత్తూ బ్రహ్మయే బ్రహ్మచర్యాన్ని పాటించి వస్తు కుంటున్నాడు. మీరు దాన్ని నిందిస్తున్నారు. మీరు సాధువుల కాని అసాధువచనాలు పల్కుతున్నారు. అయినా మీరు పెద్దల నాకు సంతానం కల్గాలనేకదా ఇట్లా వచ్చారు. మీమాట ఎందు కాదనాలి—అంటూ తపస్సుచేత అనపాయం అయిపోయిన త శరీరాన్ని ఎంచి, కాలుకదిల్చి, ఎదురుగుండావున్న అగ్నికుండంల అరణిని మథించినట్లు మథించేసరికి, అందులోంచి ఔర్వమైన అగ్ని విరించనమైన అగ్ని, జనించి, ఆకాశాన్ని తాకి, ఔర్వుని ఎదు నిలిచి "తండ్రీ! నాకు ఆకలి అవుతోంది. ఆకలితో నా ఒళ్ళు మం పోతున్నది. సర్వలోకాలను వాడి వాడిగా దహించి ఈ ఆకలి తీర కుంటాను. అనుజ్ఞ ఇప్పించు" అని ప్రార్థించాడు.

ఈ ఉపద్రవాన్ని దివ్యదృష్టితో తెలిసికొని బ్రహ్మదేవు ఆ సమయంలో అక్కడికి వచ్చి—"ఔర్వా! నీ పుత్రుణ్ణి నా ఇప్పించు. నేను ఇతనికి నివాసము, భోజనము అన్నీ చూపిస్తా సర్వలోక దహనంచేస్తాననుకున్న ఈ అగ్నిని అరికట్టు" అని కోరి నాడు. "భగవన్! నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి. అంతకంటె నా కావలసింది ఏమిటి?" అన్నాడు ఔర్వుడు. వెంటనే బ్రహ్మ ఔర్వా గ్నినిపట్టి సముద్రంలో త్రోసి, అక్కడ ఆ అగ్నిని బడబాగ్ని వుండవలసిందని ఆజ్ఞాపించాడు. సముద్రజలాలు త్రాగుతూ ఆ తీర్చుకుంటూ వుండమన్నాడు. ప్రళయకాలంలో లోకాల దహిద్దువుగాని పొమ్మన్నాడు.

ఈరకంగా ఔర్వాగ్ని జనించింది. బ్రహ్మ దాన్ని ఆ రకంగ ఉపసంహారం చేయించాడు. దేవతలు ఋషులు తమ తమ నెలవుల వెళ్ళిపోయినారు. కాని హిరణ్యకశిపుడు పోలేదు. అతడు చివరిదా ఆగి, ఔర్వఋషిని పూజించి, సర్వాంగ ప్రణిపాతంగా సాష్టాం పడి ఆయన్ను ఆరాధించి ఇట్లా అర్థించాడు. "మహర్షి! సాక్షాత్తు బ్రహ్మ అంతవాడు దిగివచ్చి, సంప్రార్థనంచేసి, ఒకపని చేయించు కునేటంత తపస్సు నీవు తప్ప ఎవరుచేశారు? నేను మీకు శిష్యుడ గదా! నాకు ఏదన్నా అపాయం కల్గినప్పుడు ఆత్మరక్షణం చేసు కొనేందుకు వీలుగా ఒక విద్యను ప్రసాదించు."

# ★ హరివంశం

ఔర్వుడు సంతోషించాడు. "హిరణ్యకశిప! నీవు సర్వభువనాలను జయించిన వాడవై వుండీ గూడా, మిత్రుడవై నన్ను ఆశ్రయిస్తున్నావు. ఇప్పుడు నేను సృష్టించిన నిరింధనాగ్ని రూపమైన మాయను నీకు ఇస్తున్నాను. ఒక్క చంద్రుని స్పర్శతప్ప దానికి మరో విరుగుడు లేదు. నీకు,నీ అన్వయంలో పుట్టిన వాళ్లకు ఇది రిపునిగ్రహ భయం వాటిల్లిన సందర్భాలలో ఉపయోగపడుతుంది." అని ఆశీర్వదించి పంపించాడు.

ఈ వృత్తాంతాన్ని వరుణుడు ఇంద్రునికిచెప్పి, ఇప్పుడు మయుడు ప్రయోగించింది ఈ ఔర్వాగ్ని సంబంధమైన మాయయేనని

## కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను ఉతికింది
## -అట్లు చేసినట్టిది దాని అధిక నురగ



నాయనమ్మ మెచ్చుకొంటున్నది: అనేక సంవత్సరాల అనుభవంగల నాయనమ్మ సన్‌లైట్ సబ్బుతో అన్ని ఉతికిన బట్టలను చూచి చిరునవ్వుతో మెచ్చుకొంటున్నది. షర్టులు, దుప్పట్లు, తువ్వాళ్లు ఈ బట్టలన్నిటినీ తెల్లగాను కాంతిగాను, ఉతుకుటకు అక్కకి కొద్ది సన్‌లైట్ చాలును. సన్‌లైట్ యొక్క సమృద్ధయిన నురగ చాలా బట్టలను బాదకుండానే ఎంతో బాగుగా ఉతుకును. మీ కుటుంబ మందరి బట్టలను ఉతుకుటకు సన్‌లైట్ సబ్బును వాడండి.




***సన్‌లైట్ సబ్బు బట్టలను తెల్లగాను కాంతిగాను ఉతుకును***

S.263-X52 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి

చెప్పాడు. ఇప్పుడు చంద్రుణ్ణి ప్రయోగిస్తే తప్ప ఇది ప్రతిహతం కాదన్నాడు. ఇదివిని ఇంద్రుడు చాలా సంతోషించాడు. దేవసైన్య మధ్యస్థితుడై వున్న చంద్రుణ్ణి సమీపించి, ఇంద్రుడు ఇట్లా అన్నాడు. "సోమా! నువ్వు వరుణుడికి సహాయం చెయ్యి. మీ ఇద్దరూ కలిసి, ఇప్పుడు ఈ ఔర్వమాయాగ్ని ప్రమాదాన్నుంచి దేవసైన్యాన్ని రక్షించాలి. నువ్వు సామాన్యుడవా? అంభోధిసుతుడివి. అనంత తపోదయానికి కర్తవి. సర్వభూతాలకు పోషకుడివి. సమస్త ఔషధీ విభుడివి. యజ్ఞాలకు సాక్షాత్తు ప్రాణంవంటివాడివి. అమృతానికి ఆధారమైన నీ అంశచేత సమస్త యోగీశ్వరులు మృత్యువును జయించగలుగుతున్నారు. నువ్వు కాంతివి. కాంతిశరీరుడివి. దేవతలకు సోమాన్ని కూర్చిపెట్టేవాడవు. చీకట్లకు విరోధివి. ఇందుకు నిన్ను నియమిస్తున్నాము."

"జగత్పతీ! దేవరాజా! నేను నీ ఆజ్ఞను పాలిస్తాను. పరమ శీతాన్ని వర్షించి, దైత్యమాయను సంహరించివేస్తాను. మంచు కంటే చల్లనైన కిరణప్రసారంచేత ఎట్లా ఈ మాయను నేను సంహరిస్తానో నీవే చూస్తావు" అంటూ చంద్రుడు రాక్షసులపైకి వరుణ ద్వితీయుడై విరుచుకుపడ్డాడు. హిమకరోత్సృష్టమైన హిమవృష్టి పాతంచేత దైత్యసైన్యం చీకాకు చెందిపోయింది. ఔర్వాగ్నికృతమైన మాయావిసరం యావత్తూ డిందిపోయింది. చంద్రుడు అంతతో ఆగలేదు. నాల్గుదిశలను, నాల్గు విదిశలను నీహార మేఘమాలలతో కప్పివేసి, దైత్యులకైన మృత్యువుకన్నా చల్లనైన మంచువర్షాన్ని కురిపించాడు. వాళ్ళకు ఏమీ తోచలేదు. మంచువర్షపు అంపరను తట్టుకోవడం వారికి కష్టమైపోయింది. కొందరు మూర్ఛచెందారు. కొందరు ఖేదిల్లారు. కొందరు కంపితచేష్టులై దురపిల్లారు. కొందరు విహ్వలులై భీతిచెందారు. చంద్రుడు కురిపిస్తున్న మంచువానకు కకావికలై పోతున్న రాక్షససేనాసమూహాన్ని వరుణుడు పాశహస్తుడై కసి మసంగివేస్తున్నాడు. చంద్రవరుణులు సాగించిన ఈ యుద్ధం మాద్దానికి అవిశాగ్భతకారమైపోయింది. అయినా మయుడు చెక్కు చెదరలేదు. వాడు పారిపోతున్న దైత్యబలాన్ని మళ్ళించి, తన పుత్రుడైన క్రౌంచుడు నిర్మించిన పార్వతి అనే మాయను గీర్వాణులపై ప్రయోగించాడు.

ఆ మాయ ఘోరమై దేవతలను రాళ్ళతో, వృక్షాలతో అదిమింది. ప్రకుపిత పంచాస్యవ్యాఘ్రఘుఘోర కుహరాలైన పర్వతాలను సర్వదిక్కుల్లోను సృష్టించింది. దేవతలసైన్యంలో గగ్గోలు పుట్టించింది. కోటిరాళ్ళువచ్చి దేవతలపై ధారాపాతంగా కురిసాయి. కోటిచెట్లువచ్చి దేవతలను అదిమాయి. సింహాలు పులులు వచ్చి దేవతలను కరిచాయి. క్రౌంచోపజ్ఞమైన మాయాప్రయోగంచేత దేవతలు గాసిచెందారు. చంద్రవరుణుల ప్రతాపం మాసిపోయింది. ఒక్క విష్ణువు తప్ప దేవతాగణంలో రూపుచెడనివాడు, సొంపు సడలనివాడు లేడు. అప్పుడు విష్ణువు అగ్నిని వాయువును పిలిచి ఈ మాయను రూపుమాయించవలసిందిగా పురమాయించాడు. ఆత్మీయమైన మీ తీవ్రప్రతాపం ఏపాటిదో ఇప్పుడు చూపించండి అని ఉత్సాహం పుట్టించాడు.

అగ్ని తన యేడునాల్కలను పడగలు విప్పినట్లు విప్పి దానవ సైన్యాన్ని అప్పళించాడు. సప్తార్చిస్సులు భగ్గుమంటూ దానవ సైన్యారణ్యంపై దావానలంలాగా విజృంభించాడు. వర్ధిష్ణుడైన వాయువు దుర్దాంతుడై అగ్నిభట్టారకునికి బాసటయై, సప్తస్కంధాలను కదలుస్తూ సంపాతచండాకృతియై విక్రమించాడు. పార్వతీయ మాయావిసరం ఆ అగ్ని విక్రమంముందు మగ్గిపోయింది. భస్మసాత్కారం చెంది బూడిదయై అన్ని దిక్కుల్లోను కలయతిరిగింది. వాయుదేవుడు తనబలంచేత దాన్నిగూడా ఎక్కడా నిల్వనీయలేదు.

తనసైన్యం ఇట్లా విస్మయంగా మసియైపోవడం చూచి మయుడు యుద్ధరంగం వదిలిపెట్టి తిరుగుముఖంపట్టాడు. దేవతలు విష్ణువును కీర్తించారు. లోకాలన్నీ సంతోషించాయి. ఆ సంతోషం ఆట్టేకాలం నిల్వలేదు. కాలనేమి అనేవాడు, అసురులు పొందిన ఈ పరాభవానికి కలుషించి, తిరిగి దైత్యనాయకులనందరిని పురికొల్పుకొని, తిరిగి రాక్షససైన్యాలను సమకూర్చుకొని, వారికి తాను అగ్రగామియై దేవతల మీదికి దండు నడుపుకువచ్చాడు. ★

—(సశేషం)

# జీవనరాగం

## వేటూరి సుందరరామమూర్తి

(గతవారం తరువాయి)

'రేపాటికి పొద్దుండగా వస్తాదొరా' అని నింగికేసి వేలు చూపాడు రాజాలు. ఆ చూపుడు వేలు చూపిన ఆకాశం మూడు గంటలు ఆగింపచేసింది రఘుకు.

ముందే అనుకున్న ప్రకారం మధ్యాహ్నం మూడింటికి వచ్చాడు రాజాలు. వంకన్నతో చెప్పి రఘూ బయలుదేరాడు. నడకతో కొండఅంచుకు వచ్చారిద్దరూ. ఇక నిటారుగా లోయకు దిగాలి. చెరువుకి రాళ్ళక్కడక్కడ చురుక్కున మెరుస్తూ కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్నాయి. చెట్లమీద కోతులు పిల్లలను పొట్టకు కరచుకొని ఒక చెట్టుమీదనుంచి మరోదానిమీదకు దూకుతున్నాయి. రఘూకు ధైర్యం వచ్చింది. రాజాలు చేయూతనివ్వగా అగాధంలా ఉన్న కోనలోకి దిగటం ప్రారంభించాడు రఘు. పల్లపువాలులో కిందకు నడవటం నిమిత్తమాత్రంగా జరుగుతున్నా పడిపోకుండా తమాయించుకోవడం ప్రయత్నపూర్వకంగా రఘూ నిర్వహించుకున్నాడు. రఘూ చేయిపట్టుకున్న రాజాలు ఒక్కదమ్మున వాలు వెంబడి పరుగు తీశాడు. ఆకాశంనుంచి క్రిందికి పడిపోతున్నట్లు ఉక్కిరి బిక్కిరి అయినాడు రఘు. 'రాజాలూ మెల్లిగా-మెల్లిగా' అని మధ్యలో తను అన్నా రాజాలు వినిపించుకో లేదు. హోఁ అంటూనే ఉరకలు వేశాడు.

కోనలో దిగేసరికి రఘూతలలోకి ఆవిరులు క్రమ్మి తల దిమ్మెక్కింది. ఒళ్ళు హూనమైపోయింది. ఎదురు దెబ్బలు తగిలాయి. కాళ్లు తడబడ్డాయి. లోపల్నించి రేగిన ఆయాసప్రభంజనానికి అతడు చెట్టులా ఊగిపోయాడు. ఒళ్లంతా వణికింది. వెను దిరిగి చూశాడు. తాను దిగిన కొండచరియ విరుచుకు పడుతున్నట్లు భయంకరంగా ఆకాశమంత ఎత్తున ఉంది. ఆయాసపడుతున్న రఘూను చూసి రాజాలు జాలిపడుతున్నట్లు నవ్వాడు. 'ఏం దొరాగట్ల అగుర్రవ్-గిట్ల మెల్లంగబోతే మల్లయింటికి మునిమాపువ కొరబోతేనా' రాజాలు అడిగాడు.

రఘూ అక్కడ ఒక రాతిపై కూర్చున్నాడు. అతనికి కళ్లు తిరిగాయి. 'దాహంగా వుంది. మంచి నీళ్లు కావాలి' అన్నాడు రఘూ. 'గల్లంతబోతే, కిట్టలో దప్పి గ్గావలని వంత-జర అడుగ్గై దొరా' అన్నాడు రాజాలు.

చేయికలశాలనిండా నీరునింపి లోనికిస్తున్నట్లు 'కృష్ణ' అలలసవ్వడితో రఘూవు శ్రవణమాత్రోపశమనం కలిగిస్తోంది. లేచి మెల్లిగా కృష్ణఒడ్డుకు చేరాడు. ఆ చల్లటి కోనలో ఇరుకైన వాలుకాలువల్లో గండ్రరాళ్ల దొంతరలో సందడిస్తూ తరలిపోతున్నది కృష్ణమ్మ. పెద్ద బండరాళ్లకు కొట్టుకొని సుడులు తిరుగుతూ అలలతో కరకురాళ్ళను సైతం అనునయిస్తూ సాగిపోతున్న ఆప్రవాహం-సంసారంలో నరకయాతనలూ, ఎదురుదెబ్బలూ తింటూ కూతురాలుకోక మంచిరోజులకోసం మందహాసంతో ముందడుగు వేసే పరమసాధ్విలా ఉన్నది. కృష్ణ నీటిలో మాతృవాత్సల్యంవంటి చల్లదనం ఉన్నది. దోసిళ్లతో నీళ్ళు ఆరగా ఆరగా త్రాగి కళ్ళు మొహం తడిచేతులతో తుడుచుకుని ఒడ్డెక్కి దారిపట్టాడు రఘూ. ఏటి ఒడ్డున పచ్చికనుంచి ఇళ్లకు తిరిగివస్తున్న గొర్రెలూ, మేకలూ మందలు మందలుగా తోలుకొని కొందరు కూలీలు వస్తున్నారు. మే మే అంటూ మందలో మేకలూ, గొర్రెలూ ఒకే రొదపెడుతున్నాయి. ధూళి మబ్బులు లేపుతూ వస్తున్న మందలు చూడడానికి సందడిగా ఉన్నాయి. గొర్రెలకాపరులు చిన్నకూనలను మెడపైన పెట్టుకొని నడుస్తున్నారు.

అక్కడ కొండపల్లపు దరియలలో జొన్నచేలు వేశారు. ఎక్కడ చూసినా దోసతీగలు కాళ్లకు పెనవేసుకుంటున్నాయి. బంగారుముద్దల్లా పెద్ద దోసకాయలు నిగనిగలాడుతూ కనిపించాయి. ఏటిమీదుగా విసురుగా వీచేగాలికి జొన్న చేలు రివ్వుమంటూ సంగీతం పాడుతున్నాయి. చేలతో గాలి గుసగుసలాడుతుంటే కృష్ణమ్మ కలకల నవ్వుతున్నది. ఇక్కడ తనతో రాగిణి ఉంటే ఇవన్నీ చూసి చాలా ఆనందించేది అనుకున్నాడు రఘు.

అప్పటికింకా బాగా ప్రొద్దువాటారకపోయినా ఆ లోయలో అట్టే సూర్యకాంతి లేదు. చీకట్లు ముసరకపోయినా వెలుగు మందంగా ఉంది.

అక్కడ ఒక గుట్ట ములుపుతిరిగాక రాజాలూ.రఘూ—ఎదర దగ్గరలోనే గూడెం కనిపించింది. ఆసక్తితో ఆ గూడెం చూస్తూ అడుగులు తడబడ్డ రఘూకు మంచి ఎదురు దెబ్బతగిలింది. ఆ బాధను రాజాలు అనునయించాడు.

'ఇదిగిదే మా గూడెం దొరా' తీవిగా అన్నాడు రాజాలు. ఆ ఊరిని వాళ్ళు కోన గూడెం అని పిలుచుకుంటారు. వ్యవహారంలో మకోన అనో, గూడెం అనో అంటారు.

ఆ గూడెంలో ప్రవేశించగానే తీర్చి దిద్దినట్లున్న కుదురుటమైన గుడిసెలు, శుభ్రమైన బాటలు కనుపించాయి. ఊరిముందట పెద్దరావిచెట్టు ఉన్నది. రాజాలు దారి తీయగా రఘూ సరాసరి ఆ చెట్టువద్దకు వెళ్లాడు అది విశేష శాఖోపశాఖలతో విశాలంగా ఉన్నది. దాని మొదలంతా దట్టంగా పసుపు కుంకుమలు పట్టించి ఉన్నాయి. ఆ చెట్టుకు ఒక పెద్దతొర్ర ఉన్నది. ఆ తొర్రలో ఒక దీపం వెలుగుతున్నది. ఆ చెట్టు కొమ్మలకు గుడ్డ పీలికలు అక్కడక్కడ చుట్టి ఉన్నాయి.

చెట్టుదాకా వెళ్ళి వెనక్కి తిరిగి రఘూ ముఖంచూశాడు రాజాలు. ఎల్లి చెట్టువైపు తిరిగి మోకాళ్లమీద నిలబడి చెట్టుకు మోకరిల్లాడు అతను.

---

షోకులాడి భార్య ఎప్పుడూ హోటళ్ళలోనే ఉంటూ ఒక రోజున పల్లెటూరి భర్తకు హోటల్ బిల్లుతో సహా ఒక ఉత్తరం వ్రాసింది డబ్బుపంపమని.

'బిల్లుకు సరిపడా ధాన్యం అమ్మి డబ్బు పంపుతున్నాను. అయితే ఇంత ఖరీదులు పెట్టి హోటళ్ళకు బేరం చెయ్యకు' అని ఆ భర్త తిరుగు జాబు వ్రాశాడు.

* * *

"ఇద్దరు పెళ్లాలతో తలబొప్పి కడుతోంది అబ్బబ్బబ్బ".

'కారణం?'

'పెద్దావిడకు చెడవాగుడు అలవాటు, చిన్నావిడకు మౌనం అలవాటు, వీళ్ళను చేసుకోటం నా_పొరపాటు.'

'ఏమిటిది' అన్నాడు రఘు.

'ఇప్పుడు చెట్టుదొరా. మా గూడాన కొలం తెచ్చేముంగల ఈడ చెటుకు మొక్కాల'

జానపద చిత్రంగా మారిన జీవితంలో కథానాయకుడులాగ రఘూ రాజులు చెప్పినట్లు మొక్కాడు. తనతోపాటు రఘూ నుదుట కూడా బొటనవేలితో తిలకం అంటించాడు రాజులు దీటుగా నవ్వుతూ.

చెట్టుమీద పిట్టల కోలాహలం మనస్సును అతి మృదువుగా నొక్కి సొక్కజేసే జంత్ర సమ్మేళనంలా జిలిబిలిగా వినిపిస్తున్నది. ఆ ప్రాంతం అంతా రఘూ కలయచూశాడు. ఇంతలో వెనుదిరిగిచూస్తే రాజులు కనిపించలేదు. దిక్కులన్నీ కుదురాలు. ఒక కుడివైపు నాకలిలోంచి తెల్లటి పావురమొకటి రెక్కలు టపటప కొట్టుకుంటూ నేలబారుగా రివ్వున ఎగురుతూవచ్చి చెటు తిన్నెపై వాలింది. రఘూకు దాన్నిచూస్తే ఎంతో ముచ్చట వేసింది. ఆ తెలుపు తెల్లని తెలుపు. బొద్దుగా గుండ్రంగా ఉన్నది పావురం. దాని కళ్ళు చిత్ర వర్ణాలతో తళతళ లాడుతున్నాయి. చిట్టి ముక్కూ, చిన్న కాళ్ళూ ఎర్రని ఎరుపులో ఉండి ఆ తెలుపు రంగుకు వింత అందాన్ని చేకూరుస్తున్నాయి. ఆకృతి గొన్న శోభలా, అందంలా ఎగిరివచ్చిన పావురాన్ని ముచ్చటతో చప్పున పట్టుకుని చేత చిక్కించుకున్నాడు రఘూ. అది టపటప రెక్కలు కొట్టుకుంది. మెడ అటు ఇటు ఆడిస్తూ మిలమిలా చూసింది. తన కాలి గోళ్ళతో రఘూ చేతులకు చక్కిలిగింతలు పెట్టింది. ఉండుండి ఓరగా చూసింది. రఘూ దాన్ని ముద్దుగా రెక్కలు నిమిరాడు. దాని చిన్నారి మెడను దువ్వాడు. తిన్నెపై కూర్చుని దాంతో ముచ్చటపడుతుంటే అతనికి అందెల రవళ్ళు వినిపించాయి.

రఘూ కళ్ళకు మరిరెండు క్షణాలు గడవకుండా ఆశ్చర్యకరమైన దృశ్యం కనిపించింది. బెదరుతున్న పెద్ద కళ్ళు, చెదిరిన ముంగురులు — పున్నమిచందమామకు కనుముక్కు తీరులు తీర్చినట్లున్న ముఖం — ఎవరో సుగాలీ పడుచు — క్షణం ఆశ్చర్యంతో రఘూను ఆపాదమస్తకం ఆమె అనిమిషకాంతలా రెప్పలార్పక చూసింది. మరుక్షణంలో క్షణంలో సగం సేపట్లో నేకళ్ళార్చి చూసింది. ఆమె ఒక సచేతనా శిల్పంలా ఉన్నది.

మోకాళ్ళకు కొంచెం క్రిందికి దిగిన చోళీ, నాభినుంచి కొంతవిడిచి బిర్ర బిగిసి ఉన్న రవిక, మిలమిల మెరుస్తున్న అద్దాలతో మెరసిపోతున్న వోణీ — నెలవంకలాంటి ముక్కుపుడక, మెళ్ళో తెల్లటి చిన్న పూసలు — ముంజేతులకు తెల్లటి దంతపు గాజులు రెండు — ఇత్తడి గాజులు రెండు, చెవులకు లోలాకులు ధరించిన ఒక పదహారేళ్ళకు మించని సుందరతి.

మొదట్లో క్షణం నివ్వెరపాటుతో ఆమె చూసింది. రఘు తెల్లబోయి చూశాడు. తాను పట్టుకున్న పావురం ఎంత ముద్దుగా ముచ్చటగా అందంగా ఉన్నదో అంతకు ముందు తెలియలేదు గాని — ఆ సుగాలీపడుచు అచ్చం పావురమంత అందంగా ఉన్నది. ఆమె నివ్వెరపాటుకు కారణమేమిటి? తన వేషమా — కాదు అసలు తానే ఆమె ఆశ్చర్యానికి కారణం అనుకున్నాడు. పావురాన్ని అతను వదలలేదు. ఆమె పావురం కోసం వచ్చింది. అది ఆమె పెంపుడు పావురం కావచ్చు — ఆ సుగాలీ పడుచు భాషలో ఏదో అన్నది — తన చేతులలో పావురము గింజుకులాడింది ఇటు పావురం వంక అటు ఆమెవైపు రఘూ చూశాడు. ఆమె మళ్ళీ పిలిచింది. పావురం రఘూ చేతిలో పెనుగులాడింది. రెక్కలు టపటప కొట్టుకుంది. ఆమె తన ముంజేతి ముత్యాలగాజులు మోగించి మళ్ళీ గట్టిగా పిలిచింది. రఘూ చేతిలో పావురం గిలగిలలాడింది — ముక్కుతో వేళ్ళని పొడిచింది — కాలి గోళ్ళతో రక్కింది — ఒడుపుగా చేజారి రివ్వున ఎగిరిపోయి, సుగాలీ పడుచు భుజంపై వాలింది తీవిగా — జన్మ జన్మాలుగా అదే తన గూడు అయినట్లు అది ఆమె రెక్క గూడునక్కి ఆమె చెవుల్లో కువకువలాడింది. తనమీద ఫిర్యాదు చేసింది. రఘూవైపు ఆమె కొంచెం చిరుకోపంగా చూసి నట్టు చూసి ఆపావురాన్ని చేత్తో నిమిరి హుషారించింది.

ఆ పావురం రివ్వున తనమించి ఏ క్షణాన ఎగిరిపోయిందో గాని అది తిరిగి రాలేదు. రఘూ మనస్సు కూడా ఆ సుగాలీ పడుచు పైకి ఎగిరిపోయింది. ఇదంతా చూసి వెనక



"దేశంలో ఆహారధాన్యాల కొరతకు కారణం ముఖ్యంగా ఏమిటంటే..."

చిత్రం: ఎమ్. వెంకటేశ్వరశాస్త్రి, కాకినాడ.

చెట్టు దగ్గర ఉన్న రాజులు విరగబడి నవ్వాడు. రఘూ ఉలిక్కిపడ్డాడు. చేయి దాచేసుకున్నాడు. రాజులు నవ్వుకొంతనిస్తూ ఆ పిల్ల నవ్వింది పెదవులు జాలిగా వంచి, ఆ నవ్వు కొంత ఆ తెల్ల పావురం ఎగిరివచ్చినట్లుంది. తన మనస్సు తనకు అందినట్లుంది. కాని మరుక్షణంలో ఆమె ఆ ప్రక్క గుడిసె అరుగుమీదకున్న కడవ చంకన పెట్టుకుని — పల్లపువాలుగా ఏటివైపు — ఆనందంతో పరవళ్ళు త్రొక్కే మనోభావంలా — అంటిమొవ్వపై పడి జారిపోయే నీటిబిందువులా — వీణాతంత్రిపై జిలిబిలి వర్షంతో పరుగుతీసే లావణ్యవతి మునివేళ్ళలాగా — కదనకుతూహల రాగ అవరోహణ క్రమ స్వరరంజనలా వేగంగా హొయలతో ఆమె దూరదూరాన తీరానికి వెళ్ళిపోయింది. ఆమెతో ఆ పావురమూ వెళ్ళిపోయింది.

రఘూ హృదయాకాశ వీధిలో ఆ మూలనుంచి ఈ మూలకు ఒక మెరపుతీగ ఒరసుకొని మెరిసిపోయింది. ఇక చీకటివంటి మనోవికారం మిగిలింది.

'పదు దొరా గూడెంలోకి ముని మా ప్రమూకుకు నేను' అన్నాడు రాజులు. తర్వాత రఘూ ఆ గూడెం అంతా తిరిగి చూశాడు. అక్కడి గూడెం నాయక్ అతన్ని ఆదరించి ముగ్గిన మంచి దోసపండు ఒకటి — కొంపులవంటి రేగుపళ్ళు ఇచ్చాడు. ఆ గూడెం ... అందరూ అతన్ని వింతగా చూశారు. అందర్నీ అతను మనస్సెక్కడో ఉంచుకొని చూశాడు. అతని కళ్ళల్లో అన్వేషణ ఉన్నది గాని వింతలేదు. గూడెం నాయక్ అతన్ని ఆ మూడురోజులకు వాళ్ళు చేసుకునే తిరుణాలలో పాటపెట్టి పెట్టి పాలుపందుకుని సంతోషపెట్టమని కోరాడు చేతులుమోడ్చి — అప్రయత్నంగా అలాగే అన్న రఘూ మనస్సులో స్వార్థం కలుక్కుమన్నది. స్వార్థానికి సంగీతం పరికరంగా మారింది — అతని స్వార్థం లోతెంది కాదు. అమాయికమైనది —

ఆ గూడెం నాయక్ తొలిరోజు రఘూ కొండపై దారితప్పినప్పుడు రాజులు నప్పగించి ఇంటిదారి చూపినవాడు. అతని ముఖంలో గాంభీర్యమూ కళ్ళలో తెలివి — కంఠస్వరంలో ఔదార్యం కనిపిస్తాయి. ఆ గూడెంలో వంద వంద గజాల పొడవునా చెట్టుకొమ్మలకు కర్రలు కట్టి కిత్తనారకు పురి ఎక్కిస్తున్నారు కొందరు. మరికొందరు గోతాలూ, పంచులు నేస్తున్నారు. ఆ గూడెంలో వారి ప్రముఖ జీవిక కత్తెనార సంచీల అమ్మకం. పాలు — పెరుగు అమ్ముతారు. రేగుపళ్ళు పరికిపళ్ళు వియ్యానికి అమ్ముకుంటారు. దోసకాయల వ్యాపారం ఏటా కొన్ని నెలలపాటు చేస్తారు.

(44 వ పేజీ చూడుడు)

# కలసిన ధ్రువాలు

శ్రీవఝుల కటురామయ్య



మెడపట్టెడలోని గజ్జెల "ఘల్లు, ఘల్లు" మనే మ్రోతతో ఒంటెద్దుబండీ వచ్చి నడిరోడ్డుమీద ఆగింది. రాజారావు బండీదిగి చేసంచీ గొడుగూ అందుకొని చుట్టూ కలయజూశాడు. మిడిసిపడే ఎండలో నల్లని తారు రోడ్డు మంచి యౌవనంలో ఉన్న పల్లెటూరి స్త్రీ శరీరంలాగా నిగనిగా మెరిసిపోతోంది. చింతచెట్టు క్రింద నీడలో చింతకంత సందులేకుండా జనం కిటకిట లాడుతున్నారు. బండిదిగిన రాజారావు వంకవారు ఒకసారి పరకాయించి చూసి ఎవరి కబుర్లలో వాళ్ళు మునిగిపోయారు. ఒకరిద్దరు ఎరిగినవాళ్ళుండి పలకరించారు. వారికి జవాబుచెప్పి రోడ్డుకొ వైపునుంచే వేపచెట్టు క్రింద జాగా చూసుకొని కైలాయించాడు రాజారావు.

అక్కడే సంచిపెట్టి ఎటో పోయివచ్చిన శాస్త్రులుగారు రాజారావు దగ్గరకు వచ్చి "ఏమండోయ్! రాజారావుగారు, ఒంటరిగా ఇక్కడ కూర్చున్నారే!" అంటూ పలకరించారు. శాస్త్రులుగారు పట్టెంచుతో ధోవతీ కట్టి పైన అంగవస్త్రం కప్పుకొన్నారు. తల మీద చిన్న పిలక వ్రేలాడుతోంది.

"నమస్కారమండీ శాస్త్రిగారూ; రండి! రండి! ఎంత కా[illegible]?" అంటూ ఎదురు ప్రశ్నతో ఆహ్వానించాడు రాజారావు.

శాస్త్రులుగారు ప్రక్కనే ఉన్న వేరొక రాతిమీద కూర్చుంటూ "ఏముందండీ! ఈ శ్రావణమాసం పెండ్లిండ్ల మాసమాయెను. ఎటుచూసినా చేతినిండా పని యూను. ఒంటి గంటకల్లా కేసరపల్లె పెండ్లిమూహూర్తానికి పోవలసి. ఎలా చేరతానో ఏమిటో. చూడండి ఈ బస్సులున్నాయి చూడండీ! వీటితో విసిగివేసారి పోయిందండి! ఇప్పటికి నాలుగు బస్సులైనా వెళ్ళిపోయాయి. ఒక్కదాంట్లోనైనా సీటుండి ఛస్తే! ప్రొద్దున్నంగా బయలుదేరితే ఇప్పటికీ అతీగతీ లేదు, కాలమాహాత్మ్యం గాకపోతే ఈ జనాభా పెరుగుదల చూడండి. బస్సులు పట్టడంలేదు. రైళ్ళు పట్టడంలేదు. భూమి పట్టడంలేదు. ఈ పెరుగుదలకు తగ్గట్టు ఆ బస్సుల సంఖ్యనైనా పెంచితే కొంతనయం. అదిమాత్రం నా పుట్టకలప్పుడెన్ని ఉన్నాయో ఇప్పుడూ అన్నే ఉంటున్నాయి!"

రాజారావు నవ్వాడు "ఎందుకనిలెండి శాస్త్రులుగారూ! బస్సుల సంఖ్యమాత్రం పెరక్కుండా ఉందీ? ఈ రోజేమో ఇక్కడ [illegible] ఎక్కువగానే ఉంది. సరి; ఎందుచేతనో



"ఏమో!" అన్నాడు రాజారావు.

"ఎందుచేతనో ఏమిటండీ! శ్రావణమాసం పెండ్లిండ్ల గత్తర. అందునా ఈ రోజు మంచిరోజు. ఇక రద్దీ ఎక్కువగా ఉండదటండీ మరి. నాచేతిమీదుగా జరగాల్సిన వే పది పెండ్లిండ్లదాకా ఉన్నాయి ఈ నెల్లో. పెండ్లి అనేప్పటికి ఒకవిషయం జ్ఞాపకి వస్తోందండీ. మీరెప్పుడేనా ఉత్తర దక్షిణ ధ్రువాల్ని చూశారా!" అని ప్రశ్నించాడు శాస్త్రిలు.

రాజారావు ఈ ప్రశ్నకు విస్తుపోయాడు.

"మీరు గనుక చూశారేమిటి!" అని ప్రశ్నించాడు కించిద్దరహాసంతో రాజారావు. "చూశాను గాబట్టే మీకు చూపబోతున్నాను" అంటూ శాస్త్రిలుగారు చింతచెట్టు వైపు చూపించారు.

"అదిగో చూడండి! ఆ చింతచెట్టు నీడ గుండ్రని భూమి ఆకారంగా లేదూ! ఆ నీడకు ఉత్తర దక్షిణపు చివరల్లో చెరోవైపు మళ్ళీ కూర్చొనున్నారు చూడండి. వాళ్ళే ఉత్తర దక్షిణ ధ్రువాలు. వాళ్ళది మా వూరే లెండి! ఇరుగూ పొరుగూ ఇండ్లు వారివి. అంతేగాదు వరసకి బావమరుదులు గూడాను. ఎందుకొచ్చిన గొడవ ఇది అనుకునేరు. కాలక్షేపం గావాలి గాబట్టి, ఏదో మాటవచ్చింది గాబట్టి, పెళ్ళిళ్ళ విషయంలో ఈ కాలం వారి పోకడలెలా ఉంటాయో చెప్పదలచాను" అన్నాడు శాస్త్రిలు.

'ఐతే, బంధువుల్ని ఉత్తరదక్షిణ ధ్రువాల్తో పోల్చారేమిటండీ! ధ్రువాలు కలిసికోవు గదా;" అన్నాడు రాజారావు.

"అదేవిషయం నేనూ చెప్పబోతున్నాను. ఆ కుటుంబాల్లో కలతలుబుట్టి ఇప్పటికి పదిహేనేండ్లు కావస్తోంది లెండి! ఇప్పటికీ ఆ యింటిమీది కాకి ఈ యింటిమీద వ్రాలదు. రోజూ ఏదో గిల్లికజ్జా జరుగుతూనే ఉంటుంది వారికి."

"అంత విరోధమన్న మాట! ఐనా మా డంతే. ప్రేమ సుహృద్భావం పంచిపెట్టాల్సిన హృదయాల్లో ఈర్ష్యాసూయల్ని పెంచుకొని సతమతమౌతుంటారు మానవులు. ఎక్కడా ఉండేదే లెండి ఈ గోల. మరి వారికి తగవు లెలావచ్చాయో తెల్పక పోతిరి!" అన్నాడు రాజారావు.

"అవును గండీ మరి; నిద్రలో సగమాయుర్దాయం గడిచిపోగా మిగిలిన సగంలో సగమేనా ద్వేషం, ప్రతీకారం ఇత్యాది కుత్సిత భావాల్తో నే గడిపేస్తున్నాడు మానవుడు. ఇక ప్రస్తుతాంశానికివస్తాం. ఆవయసు మళ్ళినట్లు కనిపిస్తూ ముతకపంచె కట్టుకొని ముతక చొక్కా వేసికొని తలపాగ చుట్టుకొని ఉన్నాడే ఆ వ్యక్తి చలమయ్య. మహా పిసినారి లెండి. నడివయసులో సైకిల్ కట్టూ, తెల్లని షరా వేసికొని నున్నంగా క్రాపు దువ్వుకుని కూచున్నాడే ఆయన రాజయ్య. ఆ చలమయ్య చెల్లెలినే ఈ రాజయ్య అన్నగారికిచ్చారు. ఆయన పదిహేనేళ్ళ క్రితం నిస్సంతుగా చనిపోయాడు. అప్పటినుండి ప్రారంభమయ్యాయి కలతలు. రాజయ్య అన్నభార్య సీతమ్మ, తన అన్నగారైన చలమయ్యయింటికి చేరగానే, తన భాగం ఆస్తి పంచి ఇవ్వమని పేచీ పెట్టింది. అంటే చలమయ్య పేచీ పెట్టించాడన్న మాట. రాజయ్య ఒప్పటాన పంచియివ్వలేదు లెండి. ఏవో వీలునామాలని, బంధువులని కేసులు నడిచి హైకోర్టుదాకా వెళ్లారు. ఇటీవలే వ్యవహారం సీతమ్మపక్షమై రాజయ్య వద్దనుండి తనభాగం పదిహేనెకరాల మాగాణీ ఇతర స్థిరచరాస్తులు అన్నీ పంచుకొంది లెండి. అంతతో పూర్తయిందా! మరల నష్టపరిహారాలట; దావాలట; అది అలా రావణాసురుడి కాష్టంలా రాజుతూ ఉండేదేగా మరి. పూర్వకాలంలో కాశీకి పోయినవాడు కాటికిపోయినవాడూ ఒకటని అనేవారు. ఇప్పుడు ఆ బెడద పోయింది. కోర్టుకి పోయినవాడు కాటికి పోయినవాడూ ఒకటని అనవచ్చు ననుకొంటానండీ నేను. ఐనా చలమయ్యపని ఇప్పుడు జోరుగానే ఉంది లెండి. తన ఆస్తి, ఇరవై ఎకరాలమాగాణీ, చెల్లెలిది పదిహేనెకరాలూ కలిపి సేద్యం ఝమాయించి చేయిస్తున్నాడు. అంతా ధనంతో ఉందిగదండీ లోకం. ఆయనే ఇప్పుడు పంచాయతీ ప్రెసిడెంటు. ఇదివరలో రాజయ్య ఉండేవాడు లెండి," అన్నాడు శాస్త్రిలు.

"అంతేలెండి! ధనమూలమిదం జగత్ అన్నారు పెద్దలు. తరువాత ఏమిజరిగిందేమిటి?" ప్రశ్నించాడు రాజారావు.

"ఇక జరిగేదేముందండీ! ఇదిలా జరిగి ఉండకుంటే చలమయ్యకో కూతురుంది లెండి. పెండ్లీడు పిల్ల. మహాలక్ష్మిలా ఉంటుంది. రాజయ్యకొడుకు కాలేజిలో



చిత్రం : కె. రామకృష్ణరావు, బందరు.

చదువుతున్నాడు. చక్కనికుర్రాడు. వా గికి వివాహమై యుండేది. ఆ కుటుంబా పొంపొందా లుండేవిగాదు. ఇక ఎటూ రకంగా జరిగే పరిస్థితులు లేవులెండి. బలీయమైనది గదండీ! చలమయ్య కూతు వేరే సమ్మంధాలు చూస్తున్నాడు. ఇటీ ఎక్కడికో పోయొచ్చాట్ట. పిల్లవాడే స్కూల్ ఫైనలు చదువుతున్నా ఐదుగురు అన్నదమ్ములు, ఇం ఎకరాల మాగాణీ ఉంద ఇరవై వేలు కట్నం అడిగారటలెం పిల్లవాడు నల్లగా ఉంటాడట. ఇంత మా బోతే ఆయన భాగానికి నాలుఎకరాలురా సంబంధం. అదే, రాజయ్యకొడుకు చూడం ఒక్కడే పిల్లాడు బంగారంలాంటి వా పదిహేనెకరాల మాగాణీవుంది. ఇల్లాం సమ్మంధం వదులుకొని పేరాలు తీస్తున్నా చలమయ్య. దూరపుకొండలు నునుపుగదం ఇలా ఉంటాయి పరిస్థితులు. ఐనా వ కెందుకులెండి ఈ గొడవలన్నీను. ఎవ జరుగుతుందో అలాగే జరగాలిమరి. ఒం గంటయిపోయింది. అదుగో లాస్టుబస్ వ స్తోంది. దింటోనన్నా నీటుంటుం ఉండదో మరి!" అంటూ లేచాడు శాస్త్రిల ఏదో ఆలోచిస్తూ పరాగ్గాఉన్న రాజారా గూడ బస్సును చూడగానే ఆదరాబా రాగా లేచివచ్చాడు, రోడ్డుమీదికి.

ఆబస్సు అందరినీ ఎక్కించుకుని క పోయింది.

* * *

తరువాత పదిరోజులకు ఓనాడు రా రావు బస్సులోంచి అదేచోట దిగి పంచితో, గబగబా చిలుకోడుమీదికి వడి పోతున్నాడు. అతను తొందరలో చుట్టు ఎవరుండేది కూడ గమనించలేదు.

'ఏమండోయ్! రాజారావు గారూ' అన్న పిలుపుతో వెనుదిరిగి చూశాడు. "తో కోసం నేనూ ఇక్కడే కాచుకొని వు

# ★ కలసిన ధ్రువాలు ★

వండీ! మొదటిబస్సులో దిగాను. ఎలాగూ ఇదే రోడ్డుమీద రెండు మైళ్లదూరం కలిసి పోవాలిగద. తరువాత ఎవరిదోవ వారిది. పదండి మాటాడుతూపోదాం!" అన్నాడు శాస్త్రిలు.

"నమస్కారమండీ! తమర్ని గమనించనే లేదు నేను. వెదుకబోయినతీగ కాలికి దగిలి నట్లు, నేను మీకోసం రావాలనుంటే మీరే దర్శనమిచ్చారు. రండి, పోదాము" అంటూ రాజారావు దారితీశాడు.

ఎదురుగా రెండెడ్లబండి మహావేగంగా వస్తోంది. ఎద్దులు ఘంగు ఘంగున దౌడు తీస్తున్నాయి. బండిలో చిన్నా పెద్ద ఎనిమిది మంది వున్నారు. బండి తోలే వ్యక్తి "ఎక్కడ నుంచి స్వామీ వస్తున్నారు!" అని బిగ్గరగా కేకేశాడు. శాస్త్రులుగారు జవాబు చెప్పేలోగా బండి కదలిపోయింది.

"ఏమండీ, బండి తోలే వ్యక్తి రాజయ్య గదూ!" అన్నాడు రాజారావు.

"ప్రక్కనే వున్న చలమయ్యను చూడ లేదుటండీ మీరు!" ప్రశ్నించాడు ఉత్సుకతతో శాస్త్రులు.

"చూశానుగాని, ఆయనే అని నిర్ధారణ చేసుకోలేకపోయాను. ఎంచేతంటే మీరేమో ధ్రువాలని, వారి తకరార్లను గూర్చి పూస గ్రుచ్చినట్లు చెప్పివుంటిరి. ఇంతలో యెలా కలుస్తారనుకుంటాను చెప్పండి. ఏమిటండీ ఈ వింత! ఉత్తర దక్షిణ ధ్రువాలెలా కలిసి కొన్నాయి, ఏమిటీ కథ" ఆశ్చర్యం వ్యక్తం చేశాడు రాజారావు.

"అదే విషయం నేనూ చెప్పబోతున్నానండి! మీరూ అడిగారు. పదండి, పోతూ మాటాడుకుందాము." శాస్త్రులుగారు దారి తీశారు.

"ఇదిగో! చూడండి రాజారావుగారూ! మన జీవితంలో ఎన్నో చిన్నవి గానీయండి, పెద్దవి గానీయండి అనేక సంఘటనలు మన ప్రమేయం లేకుండానే అనుక్షణమూ జరుగుతూంటాయి. అవి జరిగిన సంగతి మనకి తెలుసు కూడ ఉండకపోవచ్చు. కాని వాని ఫలితం మాత్రం మనమెప్పుడూ ఊహించరాని విధముగా పరిణామం పొందుతూంటుంది. అదేనండీ కర్మవైచిత్ర్యం. ఇంతెందుకు? ఇప్పుడు నేనూ మీరు కలిసికొన్నాము కొండి. అది మనం ముందుగా అనుకున్నది గాదు. ఇది చాలా చిన్న విషయంగా పేర్కొన బడవచ్చు. కాని ఇదే రేపొక పెద్దమార్పుకు దారితీసినా తియ్యవచ్చు. ఇలాగే ఓ చిన్న విషయాన్ని బట్టి జరిగిందిలెండి వారి కలయిక. మీకు జ్ఞాపకముం దనుకొంటాను.

ఆరోజు మనమంతా ఓకేబస్సులో ఎక్కి వచ్చాము గదండీ! రాజయ్య, చలమయ్య ఇద్దరూ నెల్లూర్లో దిగారట. చలమయ్య స్వయంగా చెబితే తెలిశాయిలెండి నాకీ విషయాలన్నీ.

ట్రంకురోడ్డు మీదుగా పోతున్న చలమయ్య ఎందుకో వెనక్కి తిరిగి చూశాట్ట. రాజయ్య వెనకాలే వస్తూ కనిపించాట. ఇదేమిట్రా ఈ దరిద్రగ్రహం నా వెంట బడిందని విసుక్కుంటూ త్వరత్వరగా నడచి "శ్రీహరా మాన్షన్స్"ను సమీపించి ఐదో నంబరు రూమెక్కడ అని వాకబు చేసి మేడ మీదికి వెళ్లాట. రూమునంబరు చూచుకొని లోపలికి అడుగు పెట్టబోయిన చలమయ్య అలాగే నిశ్చేష్టుడై నిలువబడి పోయాట్ట. ఒక అడుగు గడపకు ఇటు, ఒకడుగు గడపకు అటుగా ఉండిపోగా, ఆశ్చర్యం, ఈర్ష్య జుగుప్స వీటివెనుక దాగొని ముసుగుకొని వచ్చే సంతోషాల్తో ఉక్కిరిబిక్కిరౌతూ, ఆ దృశ్యాన్ని నిర్నిమేషంగా చూస్తూ నిలబడిపోయాట చలమయ్య.

రాజయ్యకూడ మేడమీదికి వచ్చి 8 నెంబరు రూములో ప్రవేశించి అక్కడ వారితో ఏదో మాటాడి. మరల వెనుదిరిగి ఐదో నెంబరు రూము దగరకు వచ్చాడట. ఈ శనీశ్వరుడిక్కడ కెందుకొచ్చాడేమిటాఅనుకొంటూ దూరానే నిలువబడి చలమయ్య భుజాల మీదుగా లోపలికి చూసిన రాజయ్య, అలానే కొయ్యబారిపోయి కళ్లు మిటకరించుకొని చూసినాగాట్ట. తానెక్కడుండేది గూడ గమనించలేని పరిస్థితుల్లో," అంటూ చెప్పకపోతున్న శాస్త్రిలుగారు కొంచెం ఆపి, "ఇదిగో రాజారావుగారు ఇది సంభవించింది. ఎందుచేతనంటారు! ఇద్దరికీ ఒకే బస్సులో సీటు దొరకడంచాలనే గదండీ!" అన్నాడు.

రాజారావు నవ్వుతూ "అది సరేగానండి, అసలు దృశ్యమేమిటో చెప్పారు గాదు. రెండు విరుద్ధశక్తుల్ని ఒకచోటికి చేర్చిన ఆదృశ్యం చాలా గొప్పదై ఉండాలి!" అన్నాడు.

"తొందరపడితే ఎలాగండి! ఆ దృశ్యం మీరూహిస్తున్నంత గొప్ప విషయమేమీ కాదనుకోండి. ఆ దృశ్యాన్ని గూర్చి చెప్ప బోయేముందు దానికి సంబంధించిన కొంత పూర్వవృత్తాంతాన్ని మనవి జేయనీయండి. అప్పుడు మీరే చెప్పగలుగుతారు ఆ దృశ్యాన్ని!" అంటూ ప్రారంభించాడు శాస్త్రిలుగారు.

"వారి కుటుంబకలతలు వగైరాల్ని గూర్చి లోగడే చెప్పియున్నాను గదండీ! చలమయ్యకు ఓ కుమార్తె ఉందని ఆమె పేరు లక్ష్మి అని కూడ చెప్పినట్టే జ్ఞాపకం. ఆ అమ్మాయికంటె పెద్దవాడైన కొడుకొక డున్నాడు చలమయ్యకు. వాడిపేరు గోపాలుడు. రాజయ్యకో కుమారుడున్నాడని

లోగడే చెప్పానుగదండీ, వాడిపేరు రవీం
ద్రుడు. గోపాలుడు, రవి ఇద్దరూ సమ
వయస్కులు.

పెద్దల తేతగవుల్తో తలమునకలౌతున్నా
వీరిద్దరికీమాత్రం చిన్నప్పటినుంచి మంచి
స్నేహం ఏర్పడింది. వీధిబళ్ళో చదివేప్పుడే
కలిసిమెలసి మెలగేవారు. పెద్దలుకూడ వీరి
స్నేహాన్నిగూర్చి అంత పట్టించుకొనేవారు
గాదు. అది అలానే వృద్ధి పొందుతూ
వచ్చింది.

మా గ్రామానికి దగ్గరే రెండు మైళ్ళ
దూరంలో హైస్కూలుంది గదండీ! పిల్ల
లిద్దరూ ప్రాథమికవిద్య పూర్తి చేయగానే
వార్ని హైస్కూల్లో చేర్చారు. వారికీ
కొంత ఊహవచ్చి కుటుంబ పరిస్థితులు
అర్థమౌతున్నాయి కొబట్టి వారూ జాగ్రత్త
గానే మసలుకోసాగారు. ఇంటిదగ్గరేమో
వేరువేరుగా బయలుదేరేవారు. వంతెనదగ్గర
ఇద్దరూ కలిసికొని, మరల సాయంకాలం వం
తెనదగ్గర విడిపోయేవారు. హైస్కూలులో
ఇద్దరూ ఒకే బెంచిమీద కూర్చునేవారట.
మార్కులు కూడ చాల బాగనే
తెచ్చేవారట, ఇద్దరూ. మావాడొకడు
హైస్కూలు చదువు వెలిగిస్తున్నాడు
లెండి. వాడు చెప్పేవాడీ సంగతులన్నీ.
గోపాలుడు నలుపు. రవి తెల్లటి తెలుపు.
వీరిద్దరి స్నేహాన్నీ మట్టరికాన్ని గమనించిన
కొందరు వీరికి కృష్ణార్జునులని కూడ బిరు
దిచ్చారట లెండి. ఇలా వారు తమ పెద్దవారికి
తెలియకుండా గుప్తంగా స్నేహాన్ని
పెంపొందించుకుంటూ వచ్చారు.

మొన్న మార్చి పరీక్షల్లో స్కూల్ ఫైనలు
పరీక్షయ్యాక ఇద్దరూ శ్రీయూనివర్సిటీ తర
గతిలో చేరారు నెల్లూరు వి. ఆర్. కాలే
జిలో."

"ఇంతకూ అదృష్టమేమిటో చెప్పకుండా
పొడి చెబుతున్నారేమిటండీ!" అని అడ్డు
తగిలాడు రాజారావు.

'ఇంకే మీ కర్థమవలేదండీ! రాజారావు
గారూ!" అంటూ నవ్వాడు శాస్త్రిలు.

పిల్లలు తమ అడ్రసుల్తో వ్రాసిన జాబులు
చూసుకొని ఏదో పనిమీద నెల్లూరుకు
పోయిన చలమయ్య రాజయ్య ఇద్దరూ
ఒకేసారి మేడమీదికి పోయారు.

వాళ్ళు పోయేప్పటికి గోపాలు రవి ఆ
గదిలో ఒకే పరుపుమీద పండుకొని
గాఢంగా నిద్రపోతున్నారు. చదువుతూ
చదువుతూ నిద్రించారు గాబోలు పుస్తకాలు
పక్కనే చిందరవందరగా పడిఉన్నాయ్.
వారి ముఖాల్లో అమాయకత కొట్టవచ్చినట్టు
కనిపిస్తోంది. ఒకరిమీద ఒకరు చేతులు
వేసికొని ఈర్ష్యాసూయలకు సంకుచిత స్వార్థ
కుటుంబకలహాలకు అతీతంగా ఎంతో
హాయిగా నిండు హృదయాల్తో నిద్రించే
ఆ యువకద్వయాన్ని చూస్తే పొట్ట
మొదటగా స్ఫురించే విషయం వారిలో
ఎంతో ఆత్మీయత పొంగి పొరలుతోందని.

ఈ దృశ్యం చూస్తూ అలాగే పావుగంట
సేపు నిలబడిపోయిన చలమయ్య మెల్లగా
నడిచి ఆ గదిలోనే వొక ప్రక్కన పరచి
ఉంచే చాపమీద కూర్చున్నాడట. ఇంకొనే
టికి రాజయ్యకూడ పిల్లిలాగ నడిచి ఆ చాప
మీదే ఇంకో చివర్న కూచున్నాడట. ఇద్ద
రిలో ఎవరికీ ఆ పిల్లల్ని లేపాలని బుద్ధి
పోలేదు. వారలాగే ఉంటేనే చూడాలనిపిం
చిందట వారికి. పిల్లలవంక చూసి తమవంక
చూసుకుంటూ ఇద్దరి చూపులు కలిసి
కొన్నప్పుడు తలలు వంచుకునేవారట.

అరగంట గడిచిపోయింది. మౌనం భరించ
రానిదిగా ఉంది. వారిలో ఏవో మూగ
భావాలు పొర్లుకొస్తున్నాయి. ఏ ఒక్కరూ
వాటికి అడ్డుకట్ట వేయలేకపోతున్నారట.
కడాకు చలమయ్యే తెగించి పలకరించాట్ట
రాజయ్యను "ఎక్కణ్ణించిరా రవణం" అని.

'నీ వెనకాలే వస్తినిగద, బావా!"
అన్నాట్ట రాజయ్య. ఆ కంఠంలోని ఆర్ద్ర
తను "బావా" అన్న పిలుపులోని స్వార
స్యాన్ని అర్థం చేసికొన్న చలమయ్య ఇంక
భరించలేకపోయాట్ట.

"ఒరేయ్! రాజయ్యా, పిల్లలు చూశా
వుట్రా! ఎంత కలివిడిగా ఉన్నారో!
ఎవరికోసం మనమింక ఈ వ్యవహారాలూ,
దావాలూ దగ్గాలు వేసికొని లేనిపోని అవ
స్థలపాలుగావడం చెప్పు. నేనోమాట
చెప్తాను. పనివాళ్ళయినా వాళ్ళే నయం,
తల పగిలేసిన మనకంటె; ముందుముందు వీరి
ఒకటైపోయారు మనమేమో ఇంకా ఆవేశ
కావేషాల్లోపడి కుంపటిలో పడ్డ ఎలుకల్లాగా
కొట్టుకుంటున్నాము. ఇంక ఏ మాత్రమూ
వీటిని కొనసాగనీయను. మనం యెంత
మాత్రమూ ఇంక దూరమవడం కుదరదు!"
అని ఆవేశపూరితంగా మాటాడి, కండ్లనీళ్ళ
పర్యంతమై "ఏమంటావురా, రాజా!" అని
ప్రశ్నించాట్ట, బొంగురు పోయిన కంఠంతో
చలమయ్య రాజయ్యను.

"నేను మాత్రం కాదంటానా! బావా!"
అన్నాట్ట రాజయ్య, వ్యవహారాలకుముందు
తమ కుటుంబ పరిస్థితిని జ్ఞప్తికి తెచ్చుకొని
ఉక్కిరిబిక్కిరౌతూ.

జవాబుకోసం ఆతురతతో ఎదురు
చూస్తున్న చలమయ్య కన్నుల్లో దరహాసం
తొంగిచూసింది. వేయి ఏనుగులబలం వచ్చి
నట్లయింది. "ఇదిగో, ఐతే ఓ మాట చెబుతా
విను. నిజంగా వీరి ఆప్యాయత చూస్తుంటే
నాకో ఊహ తడుతూందోయ్. ఇంక వ్యవ
వ్యవహారాలూవద్దు, గడ్డలూ వద్దు. నేను
అమ్మాయి పెండ్లి విషయంగానే బయలుదేరి
వచ్చాను. మరుపేమో ఇక్కడే చదువు

# ★ కలసిన ధ్రువాలు ★

ఉన్నాట్టలే. ఇరవై ఎకరాల మాగాణి ఉందని పేరు; వీడి భాగానికి నాలుగెకరాలు రాదు. మరి కట్నమేమో ఇరవై వేలు కావాలిట. పిల్లాడేమో మన "రవి" కాలి గోరుకు పోలడు. వెధవ సమ్మంధాలు. ఈ మధ్య తిరగలేక చచ్చానంటే నమ్ము. ఇదిగో బాయనా! ఇప్పటికైనా ఆ భగవంతుని దయవల్ల మనిద్దరం ఒకచోటచేరి మాటాడుకొనే అవకాశం లభించింది. మీ అన్నగారి ఆస్తి నాకు పూచికపుల్ల కూడ వద్దు. అమ్మాయి పేర రాసేస్తానని నీత ఒకటే పోరు పెడుతోంది. ఏమంటావురా రాజా!" చలమయ్య గొంతు పూడుకపోయింది, దుఃఖభారంతో.

రాజయ్య మెదడులో ఎలాటి భావాలు తలెత్తుతున్నాయో! ఇది కలా, నిజమా! అనే సందేహంలోపడి జవాబివ్వనే మరిచి పోయాట్ట.

చలమయ్యలో తహ తహ ఎక్కువైంది. "ఒరేయ్, రాజా! మీ అన్నగారి ఆస్తి నీకే లభిస్తుంది. అంతేగాక ఇరవై వేల రూపాయల కట్నమూ ఎలాగు ఇస్తాంగదా! అమ్మాయి లక్ష్మిని రవికిచ్చి చేస్తే మన కుటుంబాలొకటైపోతాయి. నామాట కాదనకు!" అంటూ ప్రార్థనాపూర్వకంగా దీనవదనంతో అడిగే చలమయ్యను మాస్తే రాజయ్య కడుపు తరుక్కుపోయిందట. ఇందాక తను జవాబివ్వని తప్పిదాన్ని గమనించిన రాజయ్య. "బావా! నాదేమీ ఆక్షేపణలేదు. ఇదిగో మీచెల్లెలు ఇంట్లో ఒకటే గోలపెడ్తోంది. నేనే...!" అంటూ సగంలో ఆపాడు రాజయ్య.

"నేను మాత్రం ఏమీ తక్కువ తిన్నేను లే! మీ వదిన వేధిస్తోంటె అలాగే నెట్టుకొస్తున్నాను, కండ్లకు పొరలుగమ్మి. మీ అక్కయ్య, మీ వదిన, మా చెల్లెలు పిల్లలు అంతా ఒకత్రాటిమీద నడుస్తూంటే మనమే యింకా పోరబాటలో నడుస్తున్నాము కదూ! రాజా!" అంటూ నవ్వాడు చలమయ్య, పదిహేనేళ్లకు తిరువాత హృదయపూర్వకంగా.

ఈ గలభాకు నిద్రలేచిన గోపాలు రవిని తట్టి లేపాట్ట. గంద్రదుల్ను మోసగించడానికైతే వేరె వేరె రూములు మాటాడుకున్నారు గాని, ఇలాంటి పరిస్థితి ఎదురోక్కవలసి వస్తుందని బహుశా వారు ఊహించి ఉండరు. బిత్తరపోయారట ఇద్దరూను. దిగ్గున లేచి తప్పుచేసిన వారిలాగ దూరదూరంగా నిలబడ్డారట.

"ఒరేయ్, రాజా! వాళ్ల కండ్లకు మనం రాక్షసుల్లాగ కనబడుతున్నాములాగుంది చూశావ్!" అంటూ నవ్వాట్ట ఫకాలున చలమయ్య. "పిచ్చివాగన్నలు!" అంటూ విరగబడి నవ్వేశాట్ట రాజయ్యకూడ.

కొంతవరకు పరిస్థితి గ్రహించిన గోపాలు, రవి మేడ దిగిపోయి రెండు మసాలా దోశలు, కాఫీ గట్రా పట్టుకొచ్చారట. ప్రొద్దుట్నుంచీ తిండీ తిప్పలు లేని చలమయ్య, రాజయ్యలు వాట్ని నిముషంలో ఖాళీజేసి చెంబెడుమంచినీళ్ళు త్రాగి త్రేవ్ మని తేన్చారు.

"ఏమిరోయ్ రవీ! నీ పెండ్లి ముహూర్తం నిశ్చయం జేసికొన్నాము. అమ్మాయి లక్ష్మి నీ కిష్టమేగదూ!" అన్న చలమయ్యమాటలకు మొదట తెల్లబోయారట, రవీ గోపాలు—ఇద్దరూ ఒకరిముఖా లొకరు చూసుకుని. ఇంతలో తేరుకొని రవి తల వంచేశాట్ట.

"పెండ్లికుమారు డప్పుడే తలవంచేశాడో, రాజయ్యా! లక్ష్మి ఐతే అలా తలవంచుతుందట్రా! ఈరోజుల్లో పెండ్లికుమార్తె లే నయమోయ్. సిగ్గుపడకుండా ఉంటంలో!" విరగబడినవ్వాడు చలమయ్య.

"బావ నప్పుకొనే దేంది నాన్నా! చెవులు పిండి వప్పించదూ! అసలు, లక్ష్మి బావనితప్ప ఇంకొన్ని చేసికోనని పట్టుబడితే అత్తయ్య అట్లనే లేమ్మా! తప్పకుండా బావకే ఇప్పిస్తా నిన్ను! అని ఊరుకోబెట్టింది. ఇంకా కొన్నాళ్లు ఇట్లాగె జరిగితే పెండ్లి కూడ..." ఏదో చెప్పబోతున్న గోపాలు నోటిని చెత్తో మూసేసి బైటకి లాక్కుపోయాడు రవి. తనరహస్యాలెక్కడ బయట పడతాయోనని.

ఇప్పుడు తెల్లబోయింది రాజయ్య చలమయ్య ఇద్దరూనట. "ఒరేయ్, రాజయ్యా ఇంతకథ జరుగుతూంటే మనకేమీనా కొద్దిగానైనా తెలిసిందా! ఇంక ఒక్కక్షణమైనా ఆలస్యం చేయడానికి వీల్లేదు. పద. నాకు తెలిసిన సిద్ధాంతి ఒకాయనున్నాడు. ఈ శ్రావణమాసంలోనే ముడి పెట్టించేద్దాం!" అంటూ లాక్కుపోయాడట చలమయ్య రాజయ్యను.

"ఇంకేముంది!" అంటూ ఆపాడు శాస్త్రిలుగారు.

"మర్నాడు ఒకేబండిలోంచి దిగిన రాజయ్యను చలమయ్యనుమాసి గ్రామస్థులు, విస్తుపోయారు. శుభలేఖలు మాసి మూర్ఛపోయారు. ఈ పదిరోజులనుంచి ఇదే పురాణం మా గ్రామంలో!"

"మాశారా! రాజా రావు గారూ! ఒక

(47-వ పేజీ చూడండి)

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

[గత వారం తరువాయి]

'ఎంతసేపు పాటలో ఉంటాయి...గంట సేపు ఒక్క బిగి ఊపిరాడకుండా కుర్చీలో కూర్చుంటే అన్నీ ఆగిపోయాయి!" నవ్వింది రాణి.

'అయితే ఒక పని చెయ్యి...వీధిలో యింతమంది నడుస్తున్నారే......వాళ్ళలో నీకు నచ్చినవారిని విగ్రహం చెయ్యి" ఛలోక్తి విసిరాడు శివరాం.

'ఊహుం... నాకే......మరెవరో నే... మిమ్మల్నీ తిరస్కరించాలని ఉందండీ!" పకపక నవ్వింది రాణి

బస్సుస్టాండు వద్ద దూరంగా బస్సు వస్తున్నట్లు కనిపించింది.

"మళ్ళీ పునర్దర్శనం?"

"ప్రతీ ఆదివారం!" అంటూ రాణి బేగ్ లోంచి తీసి క్రొత్త నవల ఉపన్యాస సభల కరపత్రాలు శివరాం చేతిలో పెట్టింది.

ఇద్దరి హృదయాలు హత్తుకుపోయాయని ఆనందంలో ప్రేమమత్తులో ఊగుతూ ఖుషాషాగా యిలు తిరిగి చేరాడు శివరాం. వీలైతే ఆ సభలకు హాజరుకావాలని నిశ్చయించుకున్నాడు శివరాం.

సుల్తాను బజారులోని గ్రంథాలయంలో బెంగాలి ప్రముఖచిత్రకారుడొకడు ఉపన్యసిస్తున్నాడని విని సభకు హాజరుకావాలని శివరాం బస్సులో వెడుతున్నాడు.

ఒక శృంగాటకంలో రాణి మరొక యువకుడితో కలిసి నవ్వుతూ నడిచిపోతోంది. నల్లకళ్ళజోడు ధరించి నాజూకు నాగరిక యువతిలా కులుకులు విసురుతూ నడుస్తోంది. యువకుడు నూటులో ఠీవిగా నడుస్తూ వీధి ప్రక్క ఆపి ఉంచిన తన కారుతలుపులు తెరిచి కూర్చోపెట్టాడు రాణిని. ఆ యువకుడి ముఖం తనకు చిరపరిచయమైనదిలా అనిపించింది. శివరాం శరీరమంతా మంటతో భస్మమైపోయినట్లు బాధపడ్డాడు. తల తిరిగిపోయింది. అసూయతో మరొక దుర్భర దుస్సంఘటన జరిగేలా వుందని వ్యధ చెందాడు.

గ్రంథాలయంలో బెంగాలీ చిత్రకారుని ఉపన్యాసం తలకెక్కలేదు. చికాకుగా యింటికి వచ్చేశాడు.

శారదరూపంలో కనిపిస్తున్న పరమతిస్త్రీ రాణిని తన మానసికవ్యధ తగ్గడానికి వివాహం చేసుకోవాలని నిశ్చయించుకుంటున్నానని, అంగీకారం యివ్వవలసిందని బ్రహ్మయ్య తాతయ్యకు శివరాం వ్రాసిన లేఖకు, జవాబు సాయంత్రం యింట్లో పడిఉంది. ఆత్రతగా ఉత్తరం తీసి చదివాడు. బ్రహ్మయ్యగారు కాలగుగ్రుడైతిడుతూ వ్రాసి, తమ మతంలోని కులాలన్నీ గొడ్డుపోయాయా అని ప్రశ్నించారు. తన అంత్యకాలంలో గొంతులో నీళ్ళుపోసుకునే యిష్టం లేకపోతే, యింతకాలం పెంచి పెద్దజేసిన వారిపై కృతఘ్నత చూపదల్చుకుంటే 'తన కభ్యంతరం లేదని కర్కశంగా వ్రాశారు బ్రహ్మయ్యగారు. తెలివితక్కువగా ఉద్రేకంలో మైమరిచి తాతయ్యవరకు రాణి విషయము ప్రాకనిచ్చినందుకు కిందపడ్డాడు శివరాం. ఈసారి కనిపించినపుడు రాణితో నిక్కచ్చిగా స్నేహం తెగతెంపులు చేసుకోవాలని కృద్ధుడైపోయాడు. మనోనిమిషం

> ఎలెక్ట్రిక్ చైర్‌లో కూర్చోబెట్టి మరణదండన అమలు జరిపేముందు అధికారి హంతకుణ్ణి చివరి మాటలేమైనా చెప్పమన్నాడు.
>
> చైర్‌లో కూర్చున్న హంతకుడు వెంటనే లేచి 'క్షమించాలి పెద్దలు మీరిలా కూర్చోండి' అని ఆ కుర్చీ చూపించాడు.

ఆలోచనలో ఆమెను విడిచిఉండడం దుర్భమని గురపిల్లాడు శివరాం.

తరువాత ఆదివారం ఒంటిగంటకు రాణి శివరాంయింటికి రాలేదు. బహుశ ఆమె రాదనుకున్నాడు శివరాం. కథలపుస్తకం తీసి చదువుకుంటున్నాడు. తలుపు చప్పుడయింది. రాణి వచ్చింది. తూలుతూ తేలిగ్గా అడుగులు వేస్తూ ఆయాసంగా ఒగరుస్తూ కళ్ళు తే[...] పోయేలా చూస్తూ పాలిపోయిన ముఖంతో యింట్లో అడుగుపెట్టింది. శివరాం కోపంగా నిలుచున్నాడు తలుపుతీసి. రాణి ఆశ్చర్యంగా దూరంగా ఉన్న శివరాంవైపు ఒక్కసారి చూసింది. స్వాగతమిచ్చే అతని ప్రవర్తనలోని మార్పు రాణిని కొంచెం బాధించింది. గబగబ నడిచి వాలుకుర్చీలో కూలిపోయి చేతిలోని బేగ్ నేలమీదకు విసి[...] ఆయాసంగా మూల్గింది..."కొంచెం నీళ్ళి[...] యిస్తారా?"

మౌనంగా లేచి శివరాం ఒకగ్లాసుడు మంచినీళ్ళు తెచ్చి యిచ్చాడు. రా[...] త్రాగింది. నీరసంతో లేనిశక్తి తెచ్చుకు[...] "అలా ఉన్నారే!" అంటూ దీనంగ[...] ప్రశ్నించింది

శివరాం ఆమె ప్రవర్తనలో ఏ మార్పు[...] లేక మామూలుగా మాట్లాడుతున్న రాణి[...] శంకించలేక పోయాడు. అయినా ఆమె శరీరారోగ్యం బాగున్నట్లు కనిపించలేదు అతనికి. ఆమెవేసిన ప్రశ్న అతను ఎదుర వేశాడు. 'ఈ రెండురోజులనుంచి జ్వరం.. ఈ వేళ రాలేనేమో అనుకున్నాను..... ఒంటిగంటకు మీరు నిరీక్షిస్తూంటార[...] తెలుసు...ఇంట్లో మంచంమీద పడుకు[...] ఉండలేకపోయాను ........... రిక్షాల బయలుదేరి, బస్సుఎక్కి యీ ప్రాంతంలో దిగి యీ కొద్దదూరం నడిచేటప్పటికి నీ[...] సంతో కళ్ళుతిరిగాయి' ఒగరుస్తూ కూ[...] బడింది కుర్చీలో రాణి.

శివరాం హృదయం కరిగిపోయింది దయతో. ఆప్యాయత, అభిమానం రాణిమీ[...] ఎక్కువైపోయాయి. లేవలేని స్థితిలోకూడ చూడాలనే ఆ కాంక్షతో పరుగెత్తు[...] వచ్చిన రాణిహృదయంలో తనకు చి[...] స్థానం లేదని శివరాం అనుకోలేకపోయాడు.

కలిసిపోయిన హృదయాల అనురా[...] ప్రాబల్యం యీ విధంగానే ఉంటుంద[...] రాణి నిజమైన ప్రేమ చవిమాసించని శివరా[...] తబ్బిబ్బైపోయాడు. రాణిమీద కోపంకలి[...] అపిలుసంశ్లు,ద్రాక్ష, ఏమో కొని తీసుకురా[...] తన క్రూరత్వానికి తన్ను నిందించుకున్నా[...] శివరాం. తన మంచంమీదకు తీసుకువె[...] స్వేచ్ఛగా పడుకోమన్నాడు శివరాం.

మెత్తటి పరుపుమీద ఒత్తిగిలి పరు[...] రాణి

'నాకు కాఫీ కావాలండీ!' రాణి కోరి[...] నిర్మొహమాటంగా. చుట్టుప్రక్క

# అన్వేషణ

పళ్ళు లేవు...ఇంట్లో పాలు లేవు... కాఫీ ఎలావస్తుంది? శివరాం చిక్కుల్లో పడ్డాడు. పరిస్థితి గమనించి రాణి మౌనం వహించింది.

అలమరలో మిగిలిపోయిన బత్తాయి పండొకటి ఒలిచి యిచ్చాడు రాణికి. ఒక్కొక్క తొన అందుకుని, తిని, కొంత శక్తి తెచ్చుకుని నవ్వింది రాణి.

శివరాం ఆమెను మర్మగర్భంగా పరీక్షించాలనుకున్నాడు.

"మొన్న నిన్ను సుల్తాను బజారులో చూశాను ఎవరితోనో...నల్లకళ్ళ జోడులో బలే అందంగా ఉన్నావు!" శివరాం చమత్కారంగా మాట్లాడాడు.

'సాయంత్రమా ?...అవునండి... నేనూ మా అమ్మ సినిమాకి వెళదామని బయలుదేరాం...వీధిలో మాకంపెనీ యజమాని, భుజంగరెడ్డిగారు కారులో కనిపించారు. బట్టల దుకాణాలదగ్గర...నన్ను రామనరుసు గారు పిలిచారు...ఎవరో పెళ్ళికూతురుకు చీరకొనాలనీ,ఆ చీర, రంగు, నాణ్యం నన్ను చూడమని అడిగారు రామనరుసు తమ్ముడు గారు... నేనూ ఆయనా బట్టలదుకాణంలోకి వెళ్ళి వచ్చాం..........మా అమ్మ రామనరుసుగారు కారులో కూర్చున్నారు మేము తిరిగి వచ్చేదాక...మాతో పాటు రామనరుసుగారు ఆయన తమ్ముడూ కూడా సినీమాకు వచ్చారు ఆ సినీమా బాగుందని విని..." తడుముకోకుండా చెప్పింది రాణి.

ఆమె మాటల్లో సత్యదూరమనడానికి శివరాంకు ఏమీ ఋజువు కనిపించలేదు. నమ్మాడు శివరాం.

తాను రంగులతో పూర్తిచేస్తున్న రాణి బొమ్మ చూపించాడు శివరాం. రాణి తన బొమ్మ చూచుకుని ఆనందంగా నవ్వింది.

"ఏమండీ!...ఆ బొమ్మలో ఎంత జీవం ఉట్టిపడుతోంది...కొంపతీసి మీరు ఆ బొమ్మను పెళ్ళిచేసుకునేరు కనుక!" పక పక బలహీనంగా నవ్వింది రాణి.

'రాణి మన అనురాగచిహ్నంగా ఒక చిన్న బహుమతి! అంటూ పెట్టెలోంచి తీశాడు ఒక వెండి వస్తువు. గుండ్రని చిన్న ప్లేటులో ఆకుల కొమ్మలమధ్య నిలుచున్న చిన్న వెండి సెంటుబుడ్డి అందిచ్చాడు రాణికి శివరాం.

"పెళ్ళికాకుండానే బహుమతులిస్తున్నారే!" నవ్వింది రాణి. శివరాం ఉప్పొంగే ఆనందానురాగాలతో రాణిని చుంబించాడు.

అనారోగ్యంగా ఉన్న రాణిని యింటిదాకా తీసుకుపోయి దిగబెట్టాడు శివరాం.

మనస్సులు కలిసినపుడు మతవిభేదాలు ప్రధానంగా ఎంచక సంయోగం చెందినప్పుడే స్త్రీపురుషుల జీవనానికి హాయికలిగిస్తుందనే

నమ్మకం గట్టిదైపోయింది శివరాంకు.

రాణి యిచ్చిన క్రైస్తవ ఉపన్యాసకరపత్రాలు టేబిలుమీద కనిపించాయి. పరమతసత్యం గ్రహించుకోవడంలో స్వమత పరిత్యాగం యిమిడిఉందనే భావం దూరం చేసుకోవాలని, అన్ని మతాల సత్యం దైవస్వరూప నిర్వచనానికే ఉపయోగపడుతున్నదనే ఉద్దేశ్యంతో బషీర్ బాగ్‌లో జరుగుతున్న క్రైస్తవ ఉపన్యాససభలకు వెళ్ళాడు శివరాం. మేలి ముసుగులతో స్త్రీలు, వివిధరకాల దుస్తులతో పురుషులు శ్రద్ధగా వింటున్నారు ఉపన్యాసాలు. వివాహం మానవుల విధ్యుక్తధర్మం- భార్యాభర్తల ఆదర్శాలు బైబిలులో ఉన్నట్లు నిర్వచిస్తున్నాడు ఉపన్యాసకుడు. సర్వమతాల సారాంశము ఒకటేయైనా అవలంబనకు వివిధపద్ధతులు అనుకరించడంవల్ల, వ్యక్తులలో వ్యత్యాసాలు ఏర్పడ్డాయనే సంగతి శివరాంకు విదితమయింది. వచ్చిన స్త్రీప్రేక్షకగుంపును పరిశీలించాడు శివరాం. రాణి కనిపించలేదు. మరియమ్మ జాడకూడా లేదు. బహుశ వారిద్దరూ ఆ రోజు రాలేదను కున్నాడు శివరాం. ఉపన్యాస మందిరం నుంచి బయటికివచ్చి తరువాతి కార్యక్రమం ఆలోచిస్తూ సిగరెట్టు వెలిగించి వీధిలో నిలుచున్నాడు శివరాం. జగదీశ్వర్ కనిపించాడు.

"ఏమోయ్ శివరాం!...యిక్కడ నుంచున్నావేమిటి?..." వెకిలిగా నవ్వుతూ కాళ్ళు ఎగిరిస్తూ నడుస్తూ దగ్గరికి చేరాడు.

"క్రైస్తవమత ఉపన్యాసాలు విన్నానోయ్!" అన్నాడు శివరాం మామూలుగా.

'అంతేనా...లేక...మేలిముసుగులు..." నవ్వాడు.

"సత్యం తెలుసుకోకుండా అసత్యం ఊహించకూడదు!" క్రైస్తవ ఉపన్యాసకుడి ధోరణిలో సూక్తి బోధించాడు శివరాం.

"రాణి సావాసదోషం కాదుగదా!...నాకూ యిచ్చింది కరపత్రాలు...రెండు రోజులు మందిరాల్లో కూర్చున్నా...రాణి మాత్రం కనిపించలేదు......తీరుబడి ఏదీ?...ఎవరో ఒక స్నేహితుడు వెంట వేసుకు తిరుగుతుంటాడు." జగదీశ్వర్ అతి తేలికగా నవ్వేశాడు.

శివరాం ఆ తేలిక సంభాషణ విని చాలా బాధపడ్డాడు. రాణికీ తనకూ మధ్య విజృంభిస్తున్న అనురాగదృశ్యాలు నవయువక మండలి సభ్యులకు ఎవరికీ తెలియవని శివరాం నమ్మేడు. అదీ విధంగా తనగురించి ఏ ప్రస్తావన లేకుండా రాణిగురించి యింత తేలికగా మాట్లాడే జగదీశ్వర్‌ను యింకా ప్రశ్నలు వేసి సమాచారం తెలుసుకోవాలను కున్నాడు. [illegible] సిద్ధాంతం అనుసరించి, కొంత కారణం లేనిదే రాణి ప్రవర్తన గురించి పదిమంది పలువిధాలుగా అనుకోవడం జరగదని ఊహించాడు శివరాం.

"రాణి ఎటువంటి మనిషి?" బుజ్జగించి ప్రశ్నించాడు శివరాం.

'అమ్మ!...చాలా తెలివైనఘటం. నీలాంటి వాళ్ళని పదిమందిని బోల్తాకొట్టిస్తుంది... అయిదుగురు మగవారిని ఒకరోజు కలుసుకుని అందరినీ సంతృప్తిపరిచి, అంకినసొమ్ము చేతబట్టి, లాలిస్తూ, ఆకలి రేకెత్తించి మర్యాదగా నిష్క్రమించగలదు...ఆమె జీవితంలోనే నటిస్తుంది!" పకపక నవ్వాడు జగదీశ్వర్.

"నువ్వు ఎప్పుడైనా డబ్బిచ్చావా?"

"ఓ...ఎన్నోసార్లు... షికార్లుకొట్టాం... సినీమాలు చూశాం, మద్యపానం సేవించాం... సిగరెట్లు తాగేం... ముద్దులు, గాజులు, రిబ్బన్లు, మల్లెదండలు ఎన్నో బహుమతులిచ్చా...అన్నీ తీసుకుని ఆహ్లాదంగా, హాయిగానవ్వి అందాలు విరజిమ్మి అత్యద్భుతంగా అదృశ్యమైపోతుంది... ఒకసారి స్నేహంతో సరి...నిన్ను విడిచేస్తుంది... విచిత్రమైనమనిషి!" జగదీశ్వర్ కీయిచ్చిన రైలుబండిపరుగులా దకదక మాట్లాడేశాడు.

"అసలు ఏవూరు రాణిది?"

"అది నన్నడగకు ... బ్రహ్మాదులకే తెలియదు...ఇతరులసంగతులు అన్నీ తెలుసుకుంటుంది...తనసంగతి పరమరహస్యం... ఎవ్వరికీ చెప్పదు!...కొంపదీసి నువ్వుకాని రాణివెంట ... ప్రమాదం సుమా ... వస్తా!" జగదీశ్వర్ కంగారుగా వెళ్ళిపోయాడు.

మనస్సులోని నిశ్చిత అభిప్రాయాల నిర్మలనీరాల్లో రాళ్ళు రువ్వినట్లయింది జగదీశ్వర్ సంభాషణతో. శివరాంమనస్సు వికలమైపోయింది. రాణి బ్రతుకుగురించి ఏమీ తెలుసుకోకుండానే ఆమె బాహ్య ప్రవర్తన పాతిపదికగా అభిప్రాయాలు ఏర్పరచుకుని తప్పుత్రోవ త్రొక్కుతున్నానేమో అని భయపడ్డాడు శివరాం. అందులో నిజం పరిశీలించేకంటే మనస్సుకు నచ్చిన స్త్రీనుంచి ఆనందంపొందలేక వికృతపరిస్థితులు ఏర్పడుతున్నాయే అని కుమిలి బాధపడ్డాడు శివరాం.



చిత్రం: డి. వెంకటరావు, నెల్లూరు.

తరువాత ఆదివారం రాణి శివరాం ఇంటికి రాలేదు. బహుశ అనారోగ్యంగాఉండి రాలేకపోయిందనుకున్నాడు శివరాం. జ్వరంతో ఉన్నా తనయింటికి వచ్చినమనిషి మరీ హీనస్థితిలోఉండి రాలేకపోయిందేమో అనుకుని తనే స్వయంగా చూడాలని యింటికి వెళ్ళాడు శివరాం.

ఇంట్లో రాణి లేదు. సినీమాకివెళ్ళిందని మరియమ్మ చెప్పింది. ఎవరితో వెళ్ళిందని శివరాం ప్రశ్నించలేదు. మరియమ్మ చెప్పనూ లేదు. రాణిమీద దురభిప్రాయాలు మనస్సులో రగులుకుంటున్న శివరాం ఎవరితో సినిమాకివెళ్ళిందీ ఊహించుకున్నాడు.

తరువాతి ఆదివారం రాణి శివరాంఇంటికి వచ్చింది హుషారుగా.

'ఇంటికి వచ్చినా దర్శనమే లేదే!' శివరాం రాణి రావడంతోనే చెప్పాడు.

'ఆవేళ వనజతో కలిసి బలవంతంమీద సినీమాకి వెళ్ళానండి... మీరు వచ్చారని అమ్మ చెప్పింది!' నవ్వింది రాణి.

రాణి ప్రతిమాట ఎంతో సత్యంతో కూడి సహజంగా ఉండడంచే శివరాం తన్ను తానే నమ్మలేకపోయాడు. ఆమెను నమ్మక తప్పలేదు.

శివరాం సిగరెట్టు వెలిగించాడు. రాణికి మరొకటి అందిచ్చాడు.

'ఆడది సిగరెట్టు ఎలాత్రాగుతుందండీ... క్షమించండి!' రాణి నవ్వుతూ ముఖంత్రిప్పుకుంది.

'ఏమో సిగరెట్లు కాల్చడం మీకు కూడా అలవాటనుకున్నాను!' నవ్వాడు శివరాం.

(38-వ పేజీ చూడండి)




తిమ్మన కవీంద్రుడు తోట ఉయ్యాలలో కూర్చుని ఏదో యోచిస్తున్నాడు. ఒక నాటి మధ్యాహ్నం వేళ. అప్పుడే ఆ భవన ప్రాంగణంలోనికి ప్రవేశిస్తున్న రామకృష్ణ కవి, పరధ్యానంగా వున్న తిమ్మన నుద్దేశించి, "కవీంద్రులు ఏదో యోచిస్తున్నట్టున్నారే!" అంటూ ఆయన నీ లోకంలోకి తెచ్చాడు.

"అబ్బే, మరేం లేదు, రా, ఇలా కూర్చో!" అంటూ ఉయ్యాల చూపించాడు తిమ్మన.

రామకృష్ణుడు ఉయ్యాలబల్ల మీద తిమ్మన కెదురుగా ఒక గొలుసుని ఆనుకుని కూర్చుని, "రాయలవారి విషయమేనా మీ రాలోచించేది?" అంటూ ప్రశ్నించాడు.

"అవును గాని, రామకృష్ణా! ప్రణయ కలహం ఇంతటి సమస్యగా పరిణమిస్తుందని అనుకోలేదు సుమా! ఎంత యోచించినా దీనికి పరిష్కార మార్గం తోచటం లేదు... పోనీ ఆ చిన్నాదేవి అయినా ఏం జరిగిందో సరిగా చెప్పదు కదా!"

"మీరు ఆవిడకి ఎంత గురువుగారైనా, ఆవిడతో అరణంగా వచ్చినంత మాత్రాన, ఆ చనువుతో ప్రేమరహస్య విషయాలు చెప్పగలదా? అందులోనూ రాయల వారితో వివాహమై ఎంతకాలమ యింది?"

"ఎంతో కాలం అవలేని మాట నిజమేననుకో. కాని ఆరహస్యం ఎలా తెలుస్తుంది?"

"అంతా తెలుసుకున్నాను."

"ఆఁ, ఎలా తెల్సుకున్నావ్! అసలేం జరిగింది?"

"అబ్బే, మరేం లేదండి. వడ్లగింజలో బియ్యపు గింజ! అసలు విషయం చెప్పటానికి కాదు ఆవిడ జంకినది, అది ఏ సమయంలో జరిగిందీ చెప్పటానికి సిగ్గుపడి వుంటుంది. నేను ఆవిడ చెలికత్తె మల్లికవల్ల అంతా తెల్సుకున్నాను."

"ఓహో! అలాగా! అసలు సంగతి చెప్పు—త్వరగా దానికి తెరిగి వాత పెడితే..."

"మీ దాకా వచ్చేదాకా ఉంచానా! దానికి విరుగుడెప్పుడో వేశాను... ఆ సంగతి కేంగాని, అసలు జరిగింది యిది—

"ఒకనాటి పూర్ణిమరాత్రి రాయలవారూ చినరాణీ జలక్రీడలకు దిగారట! ప్రభువు లెంత రసికులో అంత ఉత్సాహులు. నవ వసంతం వన్నెలు దిద్దిన ఉద్యానవనం, పద్మ సరోవరం, వెన్నెలరేయి — ఇవన్నీ ఉన్న ప్రణయ సామ్రాజ్యంలో నవయౌవన వయో విలాసిని అయిన ప్రియాంగనపిలుపు వారి ఉత్సాహాన్ని ద్విగుణీకృతం చేసింది. ఆ జలక్రీడల్లో వారికి సమయంకూడా తెలియ లేదట. రాయలవారికి ఎన్ని భంగిమల్లో ప్రేయసి ముఖారవింద సౌందర్యం చూసినా తనివితీరక, అలసటలో ఎలా వుంటుందో చూడాలనుకుని వుంటారు. ఊరికే అదేపనిగా ముఖంపై నీళ్ళు కొట్టసాగారట. దానికి తట్టుకోలేక ఆ సుకుమారి సరోవరం విడిచి అందెలు ఘల్లున మోగుతూండగా వయ్యారంగా మెట్లెక్కుతో వెళుతూంటే పాదంనుంచి పడే నీళ్లు ప్రభువులపై పడ్డాయట. వెళ్ళిపోతూ చిన్నాదేవి రాయల వారిపై ఒక మందహాస వీక్షణం విసిరిందట.

"ఆమె తనను నిర్లక్ష్యం చేసి వెళ్ళిపోతూందని ఆయన అభిప్రాయపడ్డారు. పైగా ఆమె నవ్విన నవ్వు స్త్రీ సహజమైన గర్వానికి సూచన అని తలపోశారు. దానికి తగినట్టు ఆ రాత్రి అంతఃపురానికి ముందుగా తెలియజేయకుండా వెళ్ళారట. అప్పుడు తల్పంమీద పరధ్యానంగా పడుకునివున్న చిన్నాదేవి భర్తరాక గమనించి తొందరగా లేవబోయింది. దగ్గరగా వచ్చిన రాయల వారికి ఆమెపాదం తగిలిందట. వెంటనే

# ...యుని అలుక

## ...రాఘవరావు

"ఎంత నిర్లక్ష్యం!" అంటూ వెనుదిరిగి విస విసా వెళ్లిపోయారట. పాపం! యీవిడ తెల్లబోయి చూస్తూవుందట. ఈరోజు వరకూ ఆమెకు ఆయన దర్శనమే లేదట. ఇదికథ" అని సవివరంగా చెప్పాడు రామకృష్ణకవి.

తిమ్మనకవి తల పంకిస్తూ "దీనికేదో విరుగుడు వేశానన్నావు ఏం చేశావేమిటి?" అని ప్రశ్నించాడు.

"మంచి విరుగుడే వేశాను. అయిదు శ్లోకాలు రచించి స్వయంగా తీసుకెళ్ళి చిన్నాదేవికిచ్చి రాయలవారికి వినిపించమయ్యేలా చదవమన్నాను. వాటిలో ప్రభువు వారినితుమ్మెదగానూ. ఆమెను పువ్వుంగాను చిత్రించాను. ఒక శ్లోకం మచ్చుకి వినిపిస్తాను చూడండి.

శ్లో॥ సర్వాసాం తే నవమంజరీషు
న వట్పదో గంధ ఫలీము జిఘ్రత్
సాకిం నరమ్యా సచకిం నరంతా
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా.

(అన్ని పుష్పాల పరిమళాన్ని అంగీకరించె తుమ్మెద సంపంగిపువ్వుమీద వ్రాలనంత మాత్రాన సంపంగి సౌరభం లేనిదీ కాదు తుమ్మెద సౌంధ్యం తెలియనిదీ కాదు. బలీయమైన ఈశ్వరాజ్ఞవల్ల అలా జరుగుతోంది, అంతే-అని యీ శ్లోక భావం.)

శ్లోకం విని తిమ్మన, "ఈ సమస్య ఇలాటి వేదాంతాలతో పరిష్కారం కాదు. రామకృష్ణా!" అన్నాడు.

"అవుతుందో కాదో చూద్దురు గాని రాయలవారికి పాండిత్యం అంటే అభిమానం అపారం. ఈ శ్లోకాలు ఆవిడే రచించినట్టు చెప్పమని చెప్పాను." అన్నాడు రామకృష్ణుడు ఏదో ఘనకార్యం చేసినట్టు.

## 2

ఆ రాత్రి తిమ్మన్న రామకృష్ణ దర్శించి ఏమయిందని అడిగాడు. రామకృష్ణుడు ఓడిపోయినటు ముఖం పెట్టి, "మీరన్నది నిజమే రాయలవారు తామింక స్త్రీలమాటలుతో గాని చతురోక్తులతో గాని మోసపోయేది లేదని చిర్రుబుర్రులాడారని మల్లిక వార్త తెచ్చింది" అన్నాడు.

"నేను చెప్పలేదా రామకృష్ణా! ఇలాటి అన్యాపదేశాలు కవితా కళా ప్రదర్శనానికి తప్ప, పెద్దపెద్ద సమస్యల్ని పరిష్కరించలేవు" అన్నాడు తిమ్మన.

"అయితే ఇంక అంతేనా, ఆవిడ మంతే!" ప్రశ్నించాడు రామకృష్ణకవి.

"అంతే ఎందుకవుతుంది! బాగా యోచించి తర్వాత చెబుతాగా" అంటూ ఇంటికి వెళ్లాడు తిమ్మన.

తిమ్మన ఆ విషయాన్ని గురించి చాలాయోచించాడు. త్రోవ దొరకలేదు

అప్పుడాయన "పారిజాతాపహరణం" గ్రంథరచన చేస్తున్నాడు. దీపారాధన చేయగానే ఆ రాత్రి గద్య పద్యసంకలితంగా మధురమైన శైలిలో కొంతరచన సాగించాడు.

ఆయన ఊహాపేటికలో శ్రీకృష్ణ భగవానుడురుక్మిణీ సత్యభామల మధ్య పొంచుకు దర్పటానికి జావాయాతినా పడుతున్నాడు ఆఖరికి సత్యభామ కాలితాపు తినికూడా ఆమె అనుగ్రహం భిక్షించి అలా ప్రతిఫలిస్తుంటున్నాడు.

ఆ సంఘటనను వర్ణిస్తూ వ్రాసిన పద్యాల్ని మరోకమారు చదువుకున్నాడు తిమ్మనకవి. గప్పున ఆయనకేదో భావం స్ఫురించింది. కన్నులు ఆనందంతో మెరిశాయి. ప్రణయ కలహంలో పతితమయ్యే శ్రీకృష్ణునికీ రాయలవారికీ తేడా యేమీ లేదు.

ప్రస్తుతం చిన్నాదేవి కృష్ణరాయలమధ్య జరిగిన సంఘటన దృక్పథంలో ఉంచుకుని అక్కడి సంఘటనలు చక్కగా తీర్చిదిద్దాడు—పట్టుదలతో గ్రంథరచన అచిరకాలంలో పూర్తి గావించాడు. రాయలవారి అనుమతిమీద మర్నాడు వారికి 'పారిజాతాపహరణం' అంకితం చేయ నిశ్చయించుకున్నాడు.

## 3

సాహితీ సమరాంగణ సార్వభౌములయి శ్రీకృష్ణదేవరాయలవారు ఆనాడు సంతిమ్మనకవీంద్ర విరచితమైన ప్రబంధ "పారిజాతాపహరణం" కృతినందుకుంటారు. సభ కిటకిటలాడుతోంది, మంత్రిసామంతాదులతోనూ, పండిత ప్రకాండ



## ★ తెలుగురాయని అలుక ★

తోనూ.

వందిమాగధుల స్తోత్రాలతో రాయల వారు వచ్చి సింహాసనాన్ని అధిష్ఠించారు.

ఆ సభాంగణానికి ఇరువైపులా ఎత్తుగ వున్న అంతస్తులలో తెరలచాటున, రాణులు, అంతఃపురాంగనలు ఆసీనులై వున్నారు. సభలో ముందు వరుసలో అష్టదిగ్గజాలు అన బడే కవివరులు కూర్చునివున్నారు. లక్షణంగా రాయలవారు "పారిజాతాపహరణం" కృతి నందుకున్నారు.

తరువాత ఆ గ్రంథం విన కుతూహలపడు తున్న సభ్యుల నడుమ కమనీయమైన తన కంఠస్వరంతో తిమ్మనకవీంద్రుడు గ్రంథం చక్కగా చదవసాగాడు. సభ్యులు మైమరచి వింటున్నారు. రాయలవా రానందపరవశు లౌతున్నారు. పై అంతస్థులోనుంచి ముక్కు తిమ్మ లేరు ఇటువైపునుండి తిరుమలదేవి, అటువైపునుండి చిన్నాదేవీ భర్త అయిన రాయలవైపు చూస్తున్నారు.

సత్యభామను శ్రీకృష్ణుడు ప్రతిమాలే ఘట్టంలో తిమ్మన చదువుతున్నాడు.—

మ॥ జలజాతాసన వాసవాది సురపూజా
 భాజనంబై తన
ర్చు తొంతాయుతా కన్నతండ్రి కిద

మచ్చో వామపాదంబునం
 దొలగంజేసె లతాంగి యట్లయగు
 కాంతుల్ నేరముల్ సేయ, నే
 రలుకం జెందినయట్టి కాంత లుచిత
 వ్యాపారముల్ నేర్తురే!

కథాగమనంలో లీనమైన రాయలవారు, ఆ సమయంలో తిమ్మన ఆ పద్యం చదివే సరికి, "అవురా! స్త్రీ లెంత సాహసులు! శ్రీకృష్ణుఁ డంతటివాడినే లెక్క చేయక సత్యభామ శిరస్సు తన్నిందట! పదహారు వేల చిల్లర భార్యలున్నా సత్యభామతో విసిగి లేచిపోక, "నీ కాలు నొచ్చెనే!" అంటూ బుజ్జగించి ఆమె అలుక తీర్చవలసి నంత అవసరం ఆ మహానుభావుడి కేమొచ్చింది!" అన్నారు.

అప్పుడు తిమ్మన, "ప్రణయ కలహాలలో ఎంతటి కలతలైనా రేగుతాయి. తమకేమిటి, నాకేమిటి, మరొకడి కేమిటి—అది తప్పదు. అంతమాత్రాన విసిగి వెళ్ళిపోవటం ధర్మం కాదు ప్రభూ! అన్నీ తెలిసిన కృష్ణున కీ విషయం తెలియక కాదు, అలాగా ప్రవర్తించినది—నండి ప్రభూ" అంటూ మళ్ళీ తన పఠనం సాగించాడు

రాయలేదో మనసులో వేసుకుని పైఅంతస్తువై పొకసారి వీక్షించాడు. అదే సమయంలో తెరపక్కకి ఒత్తిగించి చూచి గులాబిపూవు వికసించినట్లు పెదవులు విచ్చి నవ్వింది చిన్నాదేవి. రాయలు తన సందస్మిత వదనం తిమ్మనవైపుకు తిప్పుకున్నాడు. తిమ్మన ఇది చూసినట్టే చూచి సమస్య పరిష్కారం అయినట్టు భావించి, మళ్ళీ పఠనం సాగించాడు.

మరికొంతసేపట్లో తిమ్మన ఆ నాటికి గ్రంథపఠనం ముగించాడు. రాయలాయనను అమూల్యమైన కానుకలతో సత్కరించాడు. పండితులూ, కవులూ—అంతా తిమ్మన కవీంద్రుని ప్రశంసించారు—అప్పటికి రామకృష్ణకవి ఒక్కడు తప్ప.

అప్పుడా నిండుకొలువులో తిమ్మన రామకృష్ణుని చూచి "నీ అభిప్రాయం ఏమిటి రామకృష్ణా! ఎలా వుంది రచన?" అన్నాడు, ఏవంక పెట్టదల్చుకున్నాడో అని శంకిస్తూనే.

అప్పుడు రామకృష్ణకవి లేచి 'అద్భుతంగా వుంది తిమ్మకవి చంద్రా,

కం॥ మా కొలది జానపదులకు
 నీ కవనపుతీపి అబ్బునే కూపనటత్
 భేకములకు నాకధునీ
 శీకరముల చెమ్మ నందిసెంగయ తిమ్మా!"

అన్నాడు. ఆ నాటికి కొలువు చాలించారు.

### 4

ఆ రాత్రి పండు వెన్నెలలో భవనోపరి తలంపై విహరిస్తున్నారు రాయలవారు, తిరుమలదేవీ చిన్నాదేవి సమేతులై. ఆ సమయంలో రాయలవారి అనుజ్ఞపై తిమ్మన కవి అక్కడికి తీసుకురాబడ్డాడు. రాయలవారి నమస్కారం అందుకుని కృష్ణార్పణం చేశాడు తిమ్మన.

"రాత్రివేళ పిలువనంపారు. విశేషం ఏమిటో?" అంటూ చిరునవ్వు లొలికించాడు తిమ్మన.

"మా చినదేవి గానకాలు కూడా కొన్ని పరిగ్రహించవలసివుంది మీరు అంగుకవి!.." అంటూ నేది. "అది సరేగాని, పాపం! పరమాత్ముడైన కృష్ణుడికే తప్పలేదు భార్యల బాధ. ఆయన మనస్సు అంత కష్టపెట్టటమే కాకుండా, కాలి తాపుకూడా పాలుచేసిన ఆ సత్యదేవికి ఏ శిక్ష విధించాల్సివుంటుందో!' అన్నారు రాయలవారు

"ఆ అవతారంలో మానవునికి అది సాధ్యంకాలేదు ఈ అవతారంలో కృష్ణరాయసార్వభౌముడై నేనిపరకు పతిక్కే అనుగ్రహభాగ్యం లభింపజేయుని శిక్ష విధించాడు అని తిమ్మన అంటూవుండగా రాయలూ, రాణులూ నవ్వుకున్నారు.

కవిగారు కానుకలతో ఇంటికి వెళ్ళారు. రాయలవారి ఆనందం రాణులకు ఆహ్లాదం కలిగించింది ★

# రాశిఫలాలు

**దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి**

**2-12-1959 బుధవారం మొదలు**
**8-12-1959 మంగళవారం వరకు**

**మేషం:**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈవారం మీరు ముందుగా నిర్ణయించుకున్న కార్యక్రమాలు ఏమాత్రం జరుగగల అవకాశాలు లేవు. అందువల్ల మీకు ఏవిధమైన చిక్కులు రావు. కాని తలవనితలంపుగా కొత్తపనులు ప్రారంభించటం, అందువల్ల ఉన్నతస్థితిని పొందటం జరుగుతుంది. మీ గౌరవానికి, ధనాదాయానికి లోపం రాదు. శత్రువులను జయిస్తారు. మిమ్ములను మాటలసందర్భంలో చిక్కుపెట్టి తమపనిని సాధించుకునే పెద్ద మనుష్యులు మీచుట్టూ చేరగల అవకాశాలున్నవి. జాగ్రత్తగా ఉండటం మంచిది. కుటుంబములో శాంతి, సౌఖ్యము లభించగలవు. పండితులతోటి ప్రసంగం. ధర్మకార్య ప్రయత్నాలు మొదలయిన కార్యక్రమాలు అధికముగా వుంటవి. స్థిరాస్తులు కొనటంగాని, అందుకు సంబంధించిన వ్యవహారాలుగాని సంతృప్తికరంగా పరిష్కారం అవుతవి. పిల్లల ఆరోగ్యం బాగుండదు. మీకుకూడా ఉష్ణసంబంధమైన బాధలు కనుపిస్తవి. 7, 8 లలో వృధా ప్రసంగాలు, ఆత్మీయులకు సంబంధించిన కష్టవార్తలు.

**వృషభం:**

(కృత్తిక 2, 3, 4, పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

సాధారణంగా మీరు ఇతరులతో కలసి చేయు వృత్తి వ్యాపారాలలో కలహ ప్రసంగాలు, ధననష్టం రాగల కారణాలున్నవి. కుటుంబ విషయాలలో మనస్సుకు అశాంతికరమైన సంఘటనలు ఏర్పడతవి. ఒకరిమీద మరొకరికి వృథాసందేహాలు, విపరీతమైన ఖర్చులు వస్తవి. ముందు కొంచెం చికాకు కలుగుతుంది. కాని మీ బుద్ధిచాతుర్యంతో అన్నీ చక్కపరచుకోగలుగుతారు. మీ తొందరపాటువల్ల ఒకటిరెండు సందర్భాలలో చేతికి చిక్కిన అవకాశాన్ని విడచుకుని అనంతరం ఆందోళన పడతారు. శుభకార్య ప్రయత్నాలలో అనుకూలత కనుపిస్తుంది. బంధువుల రాకపోకలు అధికం. ఈ వారం ఆరంభంలో అన్ని విషయాలలోను సందేహాలు, మీ అభివృదికి ఆటంకాలు వస్తూఉంటవి. ముఖ్యంగా ఈశ్వరస్తోత్ర పారాయణం చేసుకోవటంవల్ల చిత్తస్థయిర్యము, మీ ప్రయత్నముల యందు అనుకూలత కలుగుతవి. అధికారులతో ప్రసంగాలకు దిగవద్దు. సాధ్యమైనంత నిరాడంబరంగా ఉండటానికి ప్రయత్నించండి. 6, 7 లలో గౌరవప్రాప్తి, దైవకార్య ప్రసంగాలు, అధిక ధనవ్యయం.

**మిధునం:**

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ప్రస్తుతం మిమ్ములను గురించి ఇతరులు భావిస్తున్నంతగా మీరు ప్రయోజనం పొందలేక పోతారు. అయినా భగవంతుడు మీకు సమయానుకూలమైన బుద్ధిని ఇవ్వటంవల్ల చిక్కులనుంచి బయటపడతారు. బంధుమిత్రులవల్ల సహాయం లభించక పోగా వారివల్ల నిష్ఠురాలు మాత్రం తప్పవు. ఆదాయం బాగుంటుంది. మీరు లోగడ ఇతరులకు ఇచ్చిన వాగ్దానాలను కాపాడుకోగలుగుతారు. వృత్తి ఉద్యోగాలకు సంబంధించిన శుభవార్తలు తెలుస్తవి. సాధ్యమైనంతవరకు ముందుగా ధనం పెట్టుబడి పెట్టవలసినపనులు ఆరంభించటం మంచిదికాదు. అధికారులవల్ల జరుగవలసినపనులు ముందు కొంత శ్రమ, భయము కనుపించినా చివరకు ఫలించగలవు. వారాంతంలో ప్రయాణసూచనలున్నవి. మీ పొరపాటువల్ల వస్తువులుగాని, ధనంగాని అకస్మాత్తుగా పోయేసూచనలున్నవి. స్తోత్రపాఠకులమాటలను నమ్మవద్దు. పిల్లలవల్ల ఆనందం లభిస్తుంది. 4, 5 అతిభారమైన పనులు, నీచులతో ప్రసంగాలు, దేహాఅస్వస్థత.

**గ్రహస్థితి**

కన్యలో రాహువు, తులలో శుక్రుడు, వృశ్చికంలో సూర్య, అంగారక బుధ గురువులు, ధనుస్సులో శని, మీనంలో కేతువు, ధనుర్మకర కుంభమీనాలలో చంద్రుడు.

**కర్కాటకం:**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

సుఖసౌఖ్యాలు అనుభవించతగిన సమయం. ఉత్సాహదాయకంగా ఉంటుంది. వ్యవహార కార్య కలాపాలలో అనుభవం కలిగిన పెద్దమనుష్యుల సహాయం లభిసుంది. ప్రయాణ సందర్భాలలో సుఖం కనుపించక పోయినా కార్యసిద్ధి అవుతుంది. విలాసవస్తువులు, అలంకార వస్తువులు కొంటారు. బంధుమిత్రులవద్దనుంచి ఎదురుచూస్తున్న వార్తలు, ధనసహాయము సకాలంలో వస్తవి. కుటుంబంలోనివారి ఆరోగ్యం, మీ ఆరోగ్యం కూడా సంతృప్తికరంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాది కార్య కలాపాలలో ఇంతకుముందున్న చిక్కులు క్రమక్రమంగా తొలగిపోయి ప్రతిపనీ నిరాటంకంగా జరుపుకోగల అవకాశం లభిస్తుంది. అన్ని విధాలా అనుకూలంగా ఉంటున్న సమయంలో కూడా కారణం తెలియని ఆందోళన, సందేహాలు మిమ్ములను వేధిస్తూ ఉంటవి. ప్రత్యక్షంగా ఏవిధమైన అపకారము కలుగదు. గతవారంలో నిలచి ఉన్న ప్రయత్నాలు ఒక నిర్ణయానికి వస్తవి. 7.8 ల్లో గౌరవప్రాప్తి, శ్రమవల్ల ధనలాభం. పొరపాట్లు చేయటం.

**సింహం:**

(మఘ, పుబ్బ, ఉత్తర 1 వ పాదం.)

మీరు ఓర్పుతో అన్ని పనులు చక్కబెట్టుకోగలుగుతారు. మీ మనస్సులో ఇంతకు ముందున్న భయ సందేహాలు సంపూర్ణంగా తొలగిపోయి ధైర్యంతో కార్యరంగంలో ప్రవేశించగల అవకాశాలు లభిస్తవి. మీ మాటకు గౌరవం లభిస్తుంది. ఇతరుల శుభకార్య కలాపాలలో బాధ్యత వహించవలసిన అవసరం కలుగుతుంది మీకు ఇతరులవల్ల జరుగవలసినపనులు చక్కగా నెరవేరి మీరు అనుకున్న ప్రకారం ఫలితం లభిస్తుంది. పశ్చిమ దిక్కునుంచి లాభవార్తలు తెలుస్తవి. ధనాదాయం క్రమక్రమంగా పెరుగుతుంది. ఈ సమయంలో మీకు సంబంధంలేని విషయాలలో ప్రవేశించి కలహ ప్రసంగాలలో చిక్కుకుంటారు. సాధ్యమైనంతవరకు జాగ్రత్తగా ఉండటం అవసరం. కోర్టు కచేరీలలో అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. పిల్లల ఆరోగ్యం సరిగా వుండదు. పుణ్యకార్యాలకు ఆటంకాలు కనుపిస్తవి. విలువగల వస్తువులు కొంటారు. వారం రెండవ భాగంలో అధికారులవల్ల అనుకూలత లభిస్తుంది. 6, 7 లలో పాటివారిలో గౌరవం, మితిమీరిన ధనవ్యయం.

**కన్య: (ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

మీ వృత్తి వ్యాపారాలలో సాధారణమైన శ్రమ, ఆలస్యము కనుపిస్తున్నా, పదిమందిలో పేరు ప్రతిష్ఠలు, ధనాదాయము బాగా లభిస్తవి. మీ మనస్సులోని ఆలోచనలు సకాలంలో ఆచరణలోకి వస్తవి. కొన్ని సందర్భాలలో పోటీ తప్పదు. కాని, పట్టుదలతో పనిచేసి విజయం సాధించగలుగుతారు.

వ్యవహార కార్యకలాపాలకు ఆటంకాలు రావచ్చు అని భావిస్తారు. కాని భగవంతుని దయవల్ల అన్ని పనులు శీఘ్రకాలంలో నెరవేరి సక్రమమైన ఫలితం లభిస్తుంది. మీరు ఇంతకుముందు ఒప్పుకున్న కార్యభారంనిదానంగా తగ్గించుకోన కలుగుతారు. నరముల యందు, జీర్ణకోశములయందు బాధ కనుపిస్తుంది. విలువగల వస్తువులు కొనే సందర్భాలలో ఇతరులవల్ల మోసం జరుగకుండా చూచుకోనటం అవసరం. వారం రెండవ భాగంలో తలవని తలంపుగా ధర్మకార్యాల నిమిత్తం ధనవ్యయం చేయవలసివస్తుంది. దూరమందున్న బంధువుల వద్దనుంచి సంతోష వార్తలు తెలుస్తవి. 2, 3 లలో సౌఖ్యలోపం,మిత్రులతోఅభిప్రాయభేదాలు

తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ముఖ్యంగా మీ ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. బాహ్య విషయాలలో అనుకూలమైన సమయం. గౌరవం పెరుగుతుంది. అకస్మాత్తుగా ఖర్చులు పెరగటంవల్ల మనస్సుకు కొంచెం చికాకు కలుగుతుంది. కాని మీ శక్తి సామర్థ్యాలతో సమర్థించుకోగలుగుతారు. మిమ్మల్ని చూచి సహించలేని వారు మీమీద అపవాదులను ప్రచారంచేయటానికి ప్రయత్నిస్తారు. వృత్తిలో గౌరవంతోపాటు ఆదాయంకూడా పెరుగుతుంది. కాని కొన్ని సమయాలలో మీకు రావలసిన ధనం సమయంలో రాకపోవటంవల్ల మనస్సులో బాధపడవలసివస్తుంది. మీరు నెరవేర్చవలసిన పనులలో సాధ్యమైనంత జాగ్రత్తగా ఉండటం అవసరం. మీరు ఎంత ప్రశాంతంగా ఉందామనుకున్నా ఈవారం రెండవ భాగంలో అనవసరమైన కలహ ప్రసంగాలు వస్తవి. మీరు మీ బంధుమిత్రులకు వ్రాసే ఉత్తరాలు మొదలయినవాటివిషయంలో నిదానం, యోచన అవసరం. కుటుంబంలో సుఖసంతోషాలు లభిస్తవి. సంచారం అధికం అవుతుంది. 6, 7, 8 లలో వృత్తిలో శ్రమ, పుణ్యకాలక్షేపాలు, పెద్దలసహవాసం.

వృశ్చికం :

(విశాఖ 4వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈవారం ప్రతిపనిలోను ఒకప్రక్క శ్రమ, ఆందోళన కనుపిస్తున్నా మరొక ప్రక్క ఇతరుల ప్రోత్సాహము, సహాయము లభిస్తూ ఉండటంవల్ల సంఘంలో ఉన్నత స్థితిని పొందగలుగుతారు. ముఖ్యంగా ధైర్యం అవసరం అనే విషయం మరువవద్దు. మీ కార్యబాధ్యతలు చాలావరకు నెరవేరుతూ ఉండటంవల్ల మనోచింత తొలగిపోతుంది. లోగడ మీరు ఇతరులకు చేసిన సహాయం, ఈ సమయంలో మీకుబాగా ఉపయోగిస్తుంది. ఆదాయం పెరిగగల అవకాశాలున్నవి. మిత్రవర్గంనుంచి శుభవార్తలు తెలుస్తవి. మీ ఆరోగ్యంమీకుటుంబంలోనివారిఆరోగ్యము కూడా ఇంతకుముందుకన్నా బాగుంటుంది. ఈ సమయంలో వృత్తివ్యాపారాలలో అభివృద్ధికరమైన ప్రయత్నాలు, ప్రసంగాలు జరుగుతవి. అగ్ని, ఆయుధాలు, యంత్రాలు మొదలయిన వాటిని ఉపయోగించుకోనటంలో జాగ్రత్తగా ఉండండి. 5, 6 లలో మనశ్శాంతి, మిత్రలాభం, శుభవార్తలు.

ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

ఈసమయంలో మిమ్మల్ని గురించి ఎవరు ఏ విధంగా మాట్లాడినా మీరు మాత్రం "అంతా మనమేలుకే" అనే వాక్యాన్ని జ్ఞాపకం పెట్టుకుని ఓర్పుతో ఉండటం మంచిది. ప్రస్తుతం మీరు మీ ముఖ్య కార్యకలాపాలను ఇతరులను నమ్మి అశ్రద్ధగా ఉండటంవల్ల పశ్చాత్తాపపడవలసివస్తుంది. ఇతరులకు అప్పు ఇవ్వటం గాని, హామీ ఉండటం కాని మంచిది కాదు. దేహ సౌఖ్యం సాధారణంగా ఉంటుంది. వృత్తి ఉద్యోగాలలో మీ ధర్మాన్ని మీరు సక్రమంగా నిర్వహించుకోగలుగుతారు. గాని, ఒకానొక ముఖ్య ఘట్టంలో ఒకరికి ఉపకారం చేయటంవల్ల మరొకరికి అపకారం జరిగే చిక్కు సమస్యను ఎదుర్కొనవలసి వస్తుంది. ధనాదాయం సంతృప్తికరంగా కనుపించదు. కుటుంబ నిర్వహణలో శ్రమకనిపిస్తుంది. మొత్తం మీద గౌరవం నిమిత్తం పాటుపడగలుగుతారు. సుబ్రహ్మణ్య స్తోత్రం పారాయణం చేసుకోనటం మంచిది. మనోధైర్యం, వ్యవహార విజయం లభిస్తవి. వాక్చాతుర్యంతో సర్వకార్యసిద్ధి పొందగలుగుతారు. 2, 3 లలో కార్యభారం అధికం, చోరభయం వృథా ప్రసంగాలు.

మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

మీరు ముందుగా అనుకునేది ఒకటి, చివరకు జరిగేది మరొకటి. అయితే మొత్తం మీద గ్రహస్థితి బాగున్నదికనుక అసంతృప్తి చెందవలసిన అవసరంమాత్రం ఉండదు. మీ ధనాదాయం పెరుగుతుంది. వృత్తిలో గౌరవం, పలుకుబడి పెరుగుతవి. మీకు సహాయంచేస్తామని చెప్పిన మనుష్యులు ప్రస్తుతం చేయజాలరు. కాని సకాలంలో ఇతరుల సహాయం లభిస్తుంది. మీ ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్య ప్రయత్నాలకు అనుకూలమైన సమయం. మిమ్మల్ని భయపెట్టి మీకు ఉపకారంచేస్తున్నట్లునటిస్తూతమకార్యాన్ని సాధించుకొనే మనుష్యులు దగ్గరచేరవచ్చు. జాగ్రత్తగా ఉండటం మంచిది. కుటుంబంలో సుఖసౌఖ్యాలు లభిస్తవి. వృత్తి ఉద్యోగాలలో మీరు ఎదురుచూస్తున్న వార్తలు నిదానంగా తెలియగలవు. ప్రయాణాలు సుఖంగా జరుగుతవి. మీరు ఎవరివద్దనుంచి ధనంకోసం ఎదురుచూస్తున్నారో అది లభించదు. కాని నూతనమార్గాలలో అకస్మాత్తుగా ధనం లభిస్తుంది. 6, 7 లలో మనస్సంతోషం. పరోపకారం, శ్రమవల్ల కార్యసిద్ధి.

కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఈ వారంలో మీ పరిస్థితులు ఇంతకుముందుకన్న ఎంతో మేలుగా ఉంటవి. మీ మనస్సులోని ఆందోళన, సందేహాలు తొలగిపోయి ప్రశాంతమైన పరిస్థితి కనిపిస్తుంది. కుటుంబంలోని వారివల్ల పరస్పర సహాయ సంప్రదింపులు లభించగలవు. మీ రహస్య కార్యక్రమాలు నిరాటంకంగా జరుగుతవి. ధనం విశేషంగా వస్తుంది. ఖర్చులు అదే విధంగా పెరుగుతవి. క్రొత్తమనుష్యుల మైత్రి లభిస్తుంది. కాని తాత్కాలికంగా ప్రయోజనం తక్కువ. మీరు యధార్థ విషయాలను, న్యాయాన్ని నమ్ముకుని నిష్కల్మషంగా ప్రవర్తించటంవల్ల మీ బంధువర్గంలోనివారు కొందరు మీతో విరోధిస్తారు. అందువల్ల భయపడవలసిన అవసరం లేదు. విచారకరమైనవార్తలు తెలుస్తవి. ప్రయాణాలుచేయవలయునని అనుకుంటారు. కానిఅవకాశాలు సరిగా లభించవు. పుణ్యకార్యాలలో పాల్గొంటారు. వారాంతంలో ఆరోగ్యం లోపిస్తుంది. జాగ్రత్తగావుండటం అవసరం. 3, 4, 5 లలో పెద్దవారిమైత్రి, ఖర్చులు అధికం. సంచారం, వృత్తిలో అనుకూలమైన మార్పులు.

మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

మీ మనస్సులో ఉత్సాహం, ధైర్యము, ఆలోచించగలశక్తి, అవకాశము బాగాలభిస్తవి. బాహ్య ఆడంబరంతోపాటు యధార్థమైన కార్యనిర్వహణశక్తిని పెరుగుతుంది. ఈసమయంలో శ్రమనుఓర్చుకుని ముఖ్యంగా గౌరవ మర్యాదలను కాపాడుకునే నిమిత్తం పాటుపడగలుగుతారు. వృత్తిలో మాత్రం సాధారణమైనపోటీకనుపిస్తుంది. కాని అందువల్ల చెప్పుకోతగిన నష్టకష్టాలురావు. అదృష్టవంతమైన సమయం. కుటుంబంలోనివారి ఆరోగ్యంలో కొద్దిలోపాలు కనుపించగలవు. కాని అంతమాత్రంచేత ఆదుర్దాపడవలసిన అవసరంలేదు. సుఖసౌఖ్యాలు లభిస్తవి. లోగడ మీరు ప్రయత్నించినా జరుగక మీకు కొంత ఆవేశకరంగా ఉన్న పనులు ఈవారంలో మీప్రయత్నం లేకనే ఒకకొల్కి యానికివస్తవి. వారం మధ్యలో కారణంలేని సందేహాలు మిమ్మల్ని వేధిస్తూ ఉండటంవల్ల ముందుపొరపాట్లుచేసి అనంతరం తెలుసుకుని పశ్చాత్తాప పడవలసి వస్తుంది. 7, 8 లలో మనశ్శాంతి, ఇతరుల సహాయంవల్ల కార్యసిద్ధి, గౌరవప్రాప్తి. 

## ★ అన్వేషణ ★

(31-వ పేజీ తరువాయి)

ఆశ్చర్యంగా.

'అలా ఉన్నదీ లేనిదీ తెలవులను చూస్తేనే తెలుస్తుంది!' రాణిమాటలు తీవ్రంగా వినబడ్డాయి. ఆమెకు కోపం తెప్పించడం శివరాంకు ఇష్టంలేదు.

'పోనిలే...ఆ విషయం మాట్లాడ మానేద్దాం...నీ బొమ్మ తయారయింది... ఏమిస్తావు.'

ఎర్రగులాబీచీర, పాలపిట్టరంగుల జాకెట్టు, రంగురంగులచుక్కలగాజులు...కనుబొమలు ఎగరవేస్తూ, చైతన్యవంతంగా సొట్టబుగ్గలతో నవ్వుతూ చిలిపిగా చూస్తోంది రాణిబొమ్మ.

‘అబ్బ!...ఎంత చక్కగా ఉందండీ... ఏమివ్వగలను...ఈ బీదరాణి ఏమివ్వగలదు. నా హృదయసామ్రాజ్యానికి మిమ్మల్ని తక్షణం పట్టాభిషిక్తులుగా చేస్తాను!’ రాణి ఉత్సాహంగా ఆనందంతో తన్మయత చెంది, బొమ్మను నిశితంగా చూసి, శివరాంవైపు చిలిపిగా కులుకుతూ నవ్వింది.

శివరాం, రాణి హావభావచేష్టల్లో తనపై పరిపూర్ణప్రేమ ఉన్నట్లు అనుభూతి పొందాడు. దగ్గిరకి చేరి ఆమె మూర్ధం ఆఘ్రాణించాడు. రాణి మెల్లిగా మలయమారుత కెరటాల్లా నవ్వు ప్రసరించింది.

‘ఈ బొమ్మకూడా అచ్చు మీరు మునుపు ప్రేమించిన అమ్మాయిలాగే ఉందాండీ?’

‘కొద్దిగా ఆకారసౌష్ఠవంలో మార్పు ఉంది...ముఖం డిటో’ నవ్వాడు శివరాం.

‘ఏమండీ ఆ అమ్మాయి తిరిగి కనిపించి పశ్చాత్తాపపడి మిమ్మల్ని కోరితే...బహుశ నన్ను వదిలేస్తారనుకుంటా’ నవ్వింది రాణి.

‘అది అసంభవం!’

‘సంభవమైతే?”

‘గతం మరిచిపోవాలి రాణీ! చిరాకుగా దూరంగా వెళ్ళిపోయాడు శివరాం.

కిటికీలోంచి వ్యథతో వీధిలోకి చూశాడు శివరాం తీక్ష్ణంగా. నిజంగా శారద కనిపించి క్షమించమంటే ప్రస్తుత పరిస్థితిలో తానేమి చెయ్యగలడు నేది అనిశ్చితమైన పరిష్కారంగానే కనిపించింది. తల్లి చనిపోతూ అన్న మాటలు చెవుల్లో ప్రతిధ్వనించాయి. సరియైన సమాధానం దొరకడం దుర్లభమనిపించింది. వ్యథతో కుమిలి ఉప్పొంగే రెండు కన్నీటి బిందువులు రాల్చాడు శివరాం.

వెనకనుంచి రాణి ఏడుపు వినిపించింది శివరాంకు. రాణి మోకాళ్ళలో తల దూర్చి చేతులు చుట్టుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది. మనస్తాపంతో తను కుమిలి విచారించవలసింది పోయి రాణి ఏడ్వడంలో సమంజసత కనిపించలేదు శివరాంకు.

‘ఎందుకు ఏడుస్తున్నావు?’

రాణి ఏడ్పు ఆపింది.

శివరాం రెట్టించి ప్రశ్నించాడు.

కళ్ళు తుడుచుకుని మౌనంగా తల వంచుకుని కూర్చుంది. శివరాం గీసిన రాణి ఫోటో నేల మీద దొర్లుతోంది.

‘మీకు అనవసరంగా మనస్తాపం కలిగించానని!”

తన విచారంలో పాలుపంచుకుంటూ వేరుగా ప్రవర్తించిన రాణిఅంటే అభిమానం పొంగుకు వచ్చింది శివరాంకు. అయినా శారదగురించి ఆలోచనలు అతని మనస్సులో ఏవో తరంగాల్లా కదులుతూనే వున్నాయి.

“నేను నాటకాల్లో యింక వెయ్యదల్చుకోలేదండి. కృష్ణమూర్తిగారితో చెప్పేశాను. ఈ సంగతి.” మౌనంగా నిశితంగా రాణివైపు చూశాడు శివరాం. మనస్సు మరోవిషయంపై మళ్ళించాలని ప్రస్తావన మార్చింది రాణి.

‘నాటకాల్లో తిరుగుతూంటే సంసారంలో మనిషికే ఆడపిల్లలకు పరువు ప్రతిష్ఠలు పోతాయి. అందరితోనూ చనువుగా ఉండక పోతే సంఘంలో తప్పు, ఉంటే మనుష్యులు అపార్థం చేసుకుంటారు...అందుకే నాటకరంగంనుంచి పూర్తిగా నిష్క్రమించేను నేను!”

రాణి సాలోచనగా ఏదో పుస్తకం తెరిచింది.

శివరాం తెచ్చిన ఫలహారాలు టేబిలుమీద అట్లాగేవున్నాయి. ఎవరూ ముట్టుకోలేదు.

“అవును పెళ్ళిచేసుకోబోయే ఆడది ఆపని చెయ్యడం చాలా శ్రేయస్కరం!”

రాణి పదిమందిలోను, చనువుగా మసలడం శివరాంకుకూడా యిష్టంలేనట్లు స్పష్టమైపోయింది. శివరాం అభిప్రాయం అర్థంచేసుకున్న రాణి వింతగా లోలోపల బాధపడింది. యింతవరకు తన్ను అపార్థం చేసుకునే పరిస్థితులు అనేకం ఏర్పడి ఉంటాయని. ఇటువంటి అనుమాన ప్రవర్తనల్లో, సందిగ్ధమనో నిశ్చయాల్లో, చేసుకున్న వివాహం విజయవంతం కాదేమో అనే భయం రాణిని పీడించింది.

“నేను వివాహం చేసుకోదలచుకోలేదండి...మనం స్నేహంగా యిలాగే వుండిపోదాం!”

శివరాం ప్రవర్తనవల్ల తన మనస్సు పూర్తిగా వ్యక్తంచెయ్యలేని రాణి తప్పనిసరిగా ఆమాట అనవలసివచ్చింది. ఆమాటతో శివరాం హృదయంలో ఎన్నో అనుమానాలు ఏర్పడ్డాయి. జగదీశ్వర్ మాటల్లో కొంత సత్యం స్ఫురించింది. బహుశా యీమె అందరిదగ్గర యిదేవిధంగా ప్రవర్తించి మోసంచేస్తూ కాలం గడుపుతోందేమో అనే అభిప్రాయం ఏర్పడింది శివరాంకు. మనోభావాల సంఘర్షణలో పడి, ఆశలవైఫల్యానికి కుమిలి కుపితుడై శివరాం,

“రాణీ!......నీ ప్రవర్తన ఎంతో కాలంనుంచి గమనిస్తున్నాను......నీ విషయం గురించి స్పష్టంగా, సాకల్యంగా, హృదయం విప్పి మాట్లాడినరోజు ఒక్కటి కనిపించలేదు. ఏదో గూఢంగా మనస్సులో ఏమిటోదాచుకుని, యితరులు నన్ను అర్థంచేసుకోవాలనుకుంటావు. అది చాలాతప్పు. నువ్వు ఎలా బ్రతుకుతుంది నీకష్టాలు సుఖాలు నాతో చెప్పకపోతే నాకేం తెలుస్తుంది...ఇదే నీ సహజప్రవర్తన అయితే, ఎవరు నిన్ను వివాహంచేసుకున్నా వాళ్ళకు ముప్పు తప్పదు!”

చికాకుగా అసహ్యంగా ముఖంపెట్టాడు శివరాం రాణివైపు. (ఇంకావుంది)

# కొత్త అల్లుడు

నేలేటి భారతలక్ష్మి

దసరా పండగ అనగానే మా దొడ్డమ్మగారు ఎప్పుడో చెప్పిన కథ జ్ఞాపకానికి వస్తుంది. అసలది కథ కాదట. ఆవిడ చిన్నప్పుడు వాళ్ళమ్మగారి ఊరికి సమీప గ్రామంలో ఈ సంఘటన నిజంగానే జరిగిందట.

పూర్వము పుల్లంభొట్లపాలెం అగ్రహారంలో పేరిశాస్త్రులుగారని ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయనకు చక్కని భార్య, భూమి పుట్ర, పాడి, పంట అన్నీ ఉన్నాయి గాని సంతానము మాత్రము కలుగలేదు. సంతానం కోసమని ఆ బ్రాహ్మణ దంపతులు ఎన్నో నోములు, వ్రతాలు చేశారు. కొంత కాలానికి ఏ దేవత అనుగ్రహం వల్లనో వాళ్ల కొక అందాలభరిణ లాంటి ఆడపిల్ల పుట్టింది. లేక లేక కలిగిన ఆ పిల్లను అల్లారుముద్దుగా పెంచి, ఎనిమిదో యేడు రాగానే వాళ్ళ కుటుంబంలో ఆచారం ప్రకారం ఆ అమ్మాయికి పెళ్ళి చేయాలని తలపెట్టారు.

శాస్త్రులుగారు తను పూర్వకాలం మనిషే అయినా ఇంగ్లీషు చదువులు, నవనాగరికత అంటే ఆయనకి మోజు. అందుకని మేనరికాలు మొదలైన దగ్గరసంబంధాలన్నీ వదిలిపెట్టి, పట్నంలో ఫోర్తుఫారం చదువుకుంటున్న ఒక కుర్రవానికి అమ్మాయినిచ్చి పెళ్లి చేయడానికి నిశ్చయించారు. పదివేలరూపాయల కట్నం, వెండిచెంబులు, పట్టు పంచెలు, పట్నంనుంచి బాండు మేళాలు వీటన్నిటితో ఎంతో వైభవంగా పెళ్ళి చేశారు.

పెళ్లి కాగానే మొట్టమొదట వచ్చిన దసరాపండగకి అల్లుణ్ణి తప్పకుండా పంపించమని పేరిశాస్త్రులుగారు వియ్యంకుడికి ముందుగానే ఉత్తరం రాసి, పండగ ఇంకా నాలుగైదురోజులుందనగా తానే స్వయంగా పట్నం వచ్చి అల్లుణ్ణి ఆహ్వానించారు. ఈ అల్లుడబ్బాయికి మామగారింటికి వెళ్లడం అంటే ఎంతో సిగ్గు, మొహమాటం వేసింది. దానికి తోడు తను ఇంగ్లీషు చదువుకుంటూ పట్నంలో ఉండడంవల్ల కొంచెము బెట్టుసరి చేస్తేగాని తన గొప్పతనము మామగారికి అర్థంకాదనుకున్నాడు. దసరా సెలవులు అప్పుడే ఇచ్చేసినా "సెలవుల్లో బోలెడన్ని పుస్తకాలు చదువుకోవాలి, నాకు తీరిక ఉండదండీ" అన్నాడు. శాస్త్రులుగారు గడ్డం పట్టుకు బ్రతిమాలారు. అల్లుడితండ్రి "వెళ్లిరా బాబూ" అన్నాడు. వాళ్ళమ్మ కూడా "మా నాయన కాదూ, ఒక్క నాలుగు రోజులేగా వెళ్ళిరా" అని బోధపరచింది. వీళ్లంతా ఇలా బ్రతిమాలుతూ ఉంటే తన గొప్పతనానికి మురిసిపోయాడు అల్లుడు. "ఒకలాగయితే వస్తాను. మీ పల్లెటూరిలో పార్కులు, లైబ్రరీలు, మైదానాలు ఏమీ ఉండవు కనుక నాకేమీ ఊసుపోదు. అందుచేత మా ఫ్రెండు హనుమంతరావు, నేను కలసి విజయదశమి రేపనగా వస్తాము. రెండు రోజులుండి చక్కా వచ్చేస్తాము" అన్నాడు అల్లుడు. మామగారు మురిసిపోయి "ఒకడేమిటి నలుగురు స్నేహితుల్ని తీసుకురావోయ్. కాని తప్పకుండా రావాలిసుమీ" అని చెప్పి వెళ్ళిపోయారు.

హనుమంతరావు మన అల్లుడికి క్లాసుమేటు, దూరపుబంధువు, ప్రాణస్నేహితుడూను. అనుకున్న ప్రకారం స్నేహితులిద్దరూ బస్సులో పుల్లంభొట్లపాలెం బయలుదేరారు. దారిలో హనుమంతరావు తన స్నేహితుడికి పట్నవాసంవాళ్లు పల్లెటూరివాళ్ళదగ్గర ఎలా దర్జాగా ప్రవర్తించాలో చెప్పాడు. ముఖ్యంగా వాగుడుకాయలాగ మాట్లాడకూడదని, భోజనపదార్థాలు, ఫలహారాలు ఎంత రుచిగా ఉన్నా ఏమీ నచ్చనట్లు వదిలిపెట్టేయాలని మరీమరీ చెప్పాడు. అల్లుడు అవన్నీ జాగ్రత్తగా నోటుపుస్తకంలో రాసుకొని కంఠతాపట్టాడు.

బస్సు దిగగానే పేరిశాస్త్రులుగారు

ఇద్దరు పాలికాపుల్తోసహా వచ్చి పిల్లిద్దరినీ కుశలప్రశ్నలువేసి సంతోషంగా ఇంటికి తీసుకువెళ్ళి డాబా మీద కొత్తగా కట్టించిన చిన్న గదిలో వాళ్ళ సూట్ కేసులు పెట్టించారు. అత్తగారు మొదలయిన ఇంట్లో వాళ్లు, ఇరుగు పొరుగు అమ్మలక్కలు ఒక్కొక్కరే వచ్చి అల్లుణ్ణి పలుకరించి ఎన్నో ప్రశ్నలువేశారు. కాని అల్లుడు 'అవును', 'కాదు' లాంటి సమాధానాలే ఇచ్చాడు. అల్లుడు ఉన్నన్నాళ్లు అత్తగారు కాఫీలు, ఫలహారాలు, పిండివంటలు లెక్క లేకుండా చేసి పెట్టేవారు. హనుమంతరావు కొద్దిగా నయినా తినేవాడు కాని అల్లుడు మాత్రం అన్ని పదార్థాలు రుచిచూసి వదిలిపెట్టేసేవాడు. ఇది అంతా చూసి పట్నవాసం కుఱ్ఱవాళ్ళతీరు అంతేగా మోసు అనుకున్నారు అంతా.

ఊళ్లో అమ్మాయిల బొమ్మల కొలువులు బడిపిల్లలు పప్పుబెల్లాలు మొదలైన ఉత్సవాలన్నిటితో విజయదశమిగడచిపోయింది. అల్లుడు వెంటనే పట్నం వెళ్లిపోతానన్నాడు కాని "ఇంకొక్క రెండు రోజులుండి త్రయోదశినాడు వెళ్ల"మని అత్తగారు బలవంతంచేస్తే అల్లుడు కాదనలేకపోయాడు. ఈ నాలుగు రోజులు స్నేహితు లిద్దరు ప్రొద్దస్తమానం మేడమీద కూర్చుని కబుర్లతోను, కథల పుస్తకాలతోను కాలక్షేపం చేసి సాయంత్రంవేళ పొలాలంట పికార్లుకొట్టి ఇంటికొచ్చేవారు. ఏదో విధంగా నాలుగురోజులు కాలక్షేపం అయిపోయింది. ఆరోజు తెల్లారితే మొదటిబస్సులో తిరుగుప్రయాణం నిశ్చయమయింది. అంతా బాగానే ఉంది గాని మామూలుగా మూడు

గేయకథా మంజరి

# కోతి-నీతి

కోతిబావ కొమ్మమీద
మూతి ముడిచి కూరుచుండ
దారి పోవు నక్క ఒకటి
తేరిచూచి ఇటు లన్నది!

"కోతిబావ! కోతిబావ!
చేతిబీరకాయ లాగ
కొమ్మమీద కూర్చుంటివి
నెమ్మదిగా పనిలేదా?"

"పనుల కేమి? లోకంలో
పలుచోటుల ఉంటాయి;
కనికరించి ఇచ్చువారు
కనిపించద్దా బావా?"

సృష్టించే మొనగాడే
కష్టించే మొగ్గవాడికి
కావలసిన అన్నిపనులు
కల్పిస్తా డనెను నక్క!

"మూడునాళ్లుగా నేనిట
ముడుచుకు కూర్చున్నాను.
పని చెప్పిన ప్రభువొక్కడు
కనిపిస్తేనా బావా?!"

ఓస్! దానికేమి గాని
ఒస్తావా నాతోటి-
మాష్టరు ఉద్యోగానికి
మావూరికి అనెను నక్క!

"బఱ్ఱెల దొడ్లంటిస్కూళ్లు
గొఱ్ఱెతోకలంటి స్కేళ్లు,
వినగు పిల్ల లొక్కపూట
తమ గురువులు చెప్పమాట.

సరిగా చదవండని యొక
పరివారిని కూక లేస్తే,
పిల్లలంత ఏకమ్మై-
పిలకుచ్చుకు లాగుతారు!

పంతులయ్య పనిలో-ఇసు
మంత లేదు ప్రయోజనము
తెల్లవారి లేస్తే ప్రతి-
పిల్లవాని వెతుకవలయు!

కాన, రాను మీ వూరికి
నేనా ఉద్యోగానికి
కొమ్మమీద హాయిగాను
కూర్చుంటా ననెను కోతి!"

పంతులంటె నీకంటికి
ఎంత తేలికైనాడు?
భావిజాతి తీర్చిదిద్ద-
ఆ విధాత కాదుటయ్య!

తెలిసేమరి అన్నావో
తెలియక వాగొన్నావో
'ఒప్పుకోను నీమాటను
తప్పు తప్పు! అనెను నక్క

అయినా సరె వద్దంటూ
అచటినుండి కదలెకోతి;
మూర్ఖుడంచు తిట్టుకొనుచు
ముందు కరిగె జంబుకమూ!

పంతులంటె భక్తి లేని-
పాఠమంటె రక్తిలేని
కోతి పిల్లలను చూస్తే
కోతికైన రోతగాదె?...

— శ్రీనివాస కాశ్యప

# కొత్త అల్లుడు

పూట్లా మూడు కంచాలు ఫూదేసే అల్లుడుగారు లేని పోని గొప్పకొద్దీ భోజనం మానేయటంవల్ల కడుపులో కరకరలాడుతూ ఉంది. రాత్రి పది కొండు గంటలయింది. అంతా నిద్ర పోతున్నారు. అల్లుడు ఆకలిబాధ ఇంక భరించలేకపోయాడు. ఆ వేళ సాయంత్రం చేసిన సున్ని ఉండలు తలుచుకుంటే నోరూరింది. హనుమంతరావును లేపి తన ఆకలిసంగతి చెప్పాడు. "తెల్లవారితే మన ఇళ్లకి వెళ్ళిపోతాం కదట్రా. కళ్లుమూసుకొని పడుకో" అన్నాడు హనుమంతరావు. తెల్లవారేవరకూ ఉండలేనన్నాడు అల్లుడు.

చాలాసేపు ఆలోచించినమీదట హనుమంతరావు కొక మాంచి ఉపాయం తట్టింది. పక్కమీదనుంచి లేచి ఒక్క గంతువేశాడు. అల్లుడబ్బాయిని చెయ్యిపట్టుకుని గదిలోనించి డాబామీదికిలాక్కొచ్చాడు. బట్టలు ఆరవేసుకుందుకు కట్టిన లావుపాటి త్రాటిని విప్పి వంటింట్లోనుంచి పొగపోయేగొట్టందగ్గిరకి తీసుకువచ్చాడు. ఈ పొగ గొట్టం చివర డాబామీద ఒకమూలకి ఉంది. హనుమంతరావు పొగగొట్టంమీది రేకు మూత ఊడదీశాడు. ఇదంతా అర్థంగాక తెల్లబోయి చూస్తున్న స్నేహితుడితో ఇలా చెప్పాడు: "ఇదుగో, ఈ టార్చిలైటు జేబులో వేసుకుని ఈ తాడు చివర పట్టుకొని మెల్లగా గొట్టంలోకి దిగు. నేను నెమ్మదిగా తాడువదులుతాను. నువ్వు వరాసరి వంటింట్లో ఫలహారాలముందు దిగుతావు. నీక్కావలసిన వన్నీ తినేశాక తాడు చివర కొంచెము కదలించి 'లాగు' అని నెమ్మదిగా అరువు. వెంటనే పైకి

లాగేస్తాను." అల్లుడబ్బాయి ఈలాంటి పనిచేయడానికి మొదట్లో జంకినా, తన ఆకలిబాధను తలుచుకుని సరేనన్నాడు. ఆ ఇరుకుగొట్టంలో కష్టపడి దూరి మసిఅంతా పులుముకొని ఎలాగైతేనేం వంటింట్లో దిగాడు. టార్చిలైటు కాంతిలో నాలుగుమూలలా వెతికి తనకిష్టమైనవన్నీ తింటూ కూర్చున్నాడు. ఈలోపుగా హనుమంతరావుకి కునికిపాట్లొచ్చి తాడుచివర కిటికీఊచకి కట్టేసి కొంచంసేపు నడుంవాల్చి మళ్లీవద్దామని వెళ్లిపోయాడు. పడుకోగానే నిద్ర బాగా పట్టేసింది. అల్లుడబ్బాయి ఫలహారం ముగించి తాడుచివర లాగి నెమ్మదిగా 'లాగు'అన్నాడు. తాడు పైకి లేవలేదు. అందుచేత కొంచము బిగ్గరగా "లాగు...లాగు..."అన్నాడు. లాభంలేక పోయింది. బిగ్గరగా అరవడం ప్రమాదకరమే అయినా విధిలేక గొంతుపెంచి "లాగు... లాగు...లాగు..." అని అరుస్తున్నాడు. ఆ అరుపులకు అత్తగారికి మెళకువ వచ్చింది. లాంతరు పెంచి గదిలోనుంచి బయటకు వచ్చి ఆ అరుపు వంటింట్లోనుంచే వస్తున్నట్టు గ్రహించి నెమ్మదిగా శాస్తుర్లుగారిని లేపి తీసుక వచ్చింది. "లాగు...లాగు.. లాగు" అంటూ ఒకసారి మెల్లగాను, ఒకసారి బిగ్గరగాను వినిపిస్తూఉంది. వాళ్ళకు చెప్పరానంత భయంవేసింది. తప్పకుండా అది దయ్యపు అరుపే అని అనుకున్నారు. "ఏదో పెద్దబరువులాగుతూ ఎవడో చచ్చిపోయి దయ్యం అయి ఉంటాడు. అందుకనే ఆ దయ్యం 'లాగు, లాగు' అంటోంది"అన్నారు శాస్తుర్లుగారు. "అలాగా!" అని ఆవిడ ముక్కుమీద వేలేసుకుంది. ఇంట్లోవాళ్ళని ఇరుగుపొరుగువాళ్ళని అందర్నీ లేపి తీసుకొచ్చారు. అంతా 'లాగు' దయ్యంఅరుపులు విని అదిరిపోతున్నారు. వీళ్ళ హడావిడిఅంతా వింటూఉన్న అల్లుడు భయంతో వణికిపోయి ఇంకా బిగ్గరగా అరుస్తున్నాడు. కొంతసేపటికి ఊరిచివర ఉన్న భూతవైద్యుడు వచ్చి గుగ్గిలం ధూపం అదీవేసి 'హాంఫట్'అంటూ ఏదో మంత్రాలు చదివాడు. అల్లుడు ఇదంతా విని తాడు లాగమని అరవటం మానేసి తలుపు వారగా నిల్చుని మాంత్రికుడి మాటలు జాగ్రత్తగా వింటున్నాడు. "మీరంతా ఈ వరండాలోంచి వెళ్ళిపోండి. నే

(47-వ పేజి చూడండి)

# ★ జీవనరాగం ★

(23-వ పేజీ తరువాయి)

ఈ విశేషాలన్నీ చూసి బాగా చీకటిపడుతున్నందున రాజులుతో సహా తిరిగి తన కుటీరం చేరాడు రఘూ అతి ప్రయాసమీద. వెంకన్న పెట్టిన వేడినీళ్లు పోసుకుని, వేడి అన్నం తిని మౌనంగా పడుకున్న రఘూకు వెంటనే నిద్రపట్టలేదు. అతనేదో నిగూఢముగా ఆలోచిస్తున్నాడు. వెంకన్న కిటకిటలాడే కిర్రుతలుపు తెరుచుకుని బయటకు వెళ్ళాడు. కృష్ణపక్షపు చీకటిలోకి చొచ్చుకెళ్ళిన వెంకన్న లీలామాత్రుడై తర్వాత అసలు కనపడలేదు. రఘూ చూపుకు కొంత సేపటికి ఒక చిన్న వెలుగు కనిపించి ఆరిపోయింది. అది దాదాపు ఒకదీపం వెలిగించినట్లుంది. తరువాత నిప్పురవ్వలా కనిపించింది. రఘూకూడా మెల్లగా చీకట్లోకి వెళ్ళాడు. వెంకన్న చూడలేదు. అతడు ముంగాళ్ళ మీద కూర్చుని చుట్టకాలుస్తున్నాడు. రఘూ వెనకొంగా వెళ్ళి కొంచెం దగ్గాడు. వెంకన్న చుట తీసి 'నిద్రపట్టలేదా బాబూ' అని అడిగాడు. దానికి రఘూ సమాధానం చెప్పలేదు. 'వెంకన్నా పొగ త్రాగవచ్చా' అన్నాడు. వెంకన్న నవ్వి 'పొగబండి ఎక్కవచ్చా' అని మళ్ళీ ప్రశ్నించాడు. అంతటితో ఆ సంభాషణ ముగిసిపోయింది. రఘూకు సిగరెట్లు ధ్యాస చిత్రంగా పోయింది. నిత్యనూతనమై మారాకులొడుగుతూ లతికలు కుసుమించేచోట నీరసమైన ధూమలతలు సృష్టించడం అతనికిష్టం లేకపోయింది. సిగరెట్‌తోపాటు పొడిదగ్గు—ఆ దగ్గుకు ఆందోళనపడే రాగిణినిగూర్చిన ఆలోచనలు అతనికి కొంచెం తగ్గిపోయినాయి.

* * *

ఆ మూడోరోజున సుగాలీ నాయకుడు, రాజులు, మరికొందరు వచ్చి రఘూను తిరణాల సంబరాలకు రమ్మని కోరారు. వారికి భోజనాలు గూడెంలోనే వండుకునే ఏర్పాట్లు చేశామన్నారు. రాజులు హార్మోనియం తీసుకున్నాడు. రఘూ వెంకన్నలు సుగాలీలను అనుసరించారు. కోనకోనంతా కోలాహలంగా పచ్చతోరణాలతో కళకళలాడుతున్నది. సాయంసంజలో రాతి తిన్నె దగ్గర రావిచెట్టుసమీపంలో రఘూ పాటకచేరీ ఏర్పాటు చేశారు. అక్కడ సుగాలీ కుటుంబాలన్నీ చేరాయి. పిన్నలు, పెద్దలు, స్త్రీలు, అంతా చేరారు. వారంతా కలంకారీ పావడాల అలంకారాలతో, పూసల హారాలతో ఉత్సాహంగా ఉన్నారు. తిన్నెపై పరచిన కిత్తనార జంపఖానాపై రఘూ కూర్చున్నాడు. సుగాలీ వీరుడొకడు హార్మోనియం తెచ్చి తల్లక్రిందులుగా రఘూ ముందు పెట్టాడు. ప్రక్కనే కూర్చున్న వెంకన్నకు నవ్వు ఆగింది కాదు. మన సంగీతం తల్లక్రిందులు చేశారు సుగాలీలు అంటూ దానిని సరిగా పెట్టాడు వెంకన్న. ఎక్కడో జనం వైపు వెతుకుతున్న కళ్లు ఇటు త్రిప్పి ఆ మాటకు నవ్వాడు రఘూ. పదేళ్ళలోపు పిల్లలంతా ముందు ముందుకు వచ్చి కూర్చున్నారు వింతగా చూస్తూ. రఘూ తొలిసారిగా హార్మోనియం మీట నొక్కినప్పుడు పలికిన స్వరానికి వాళ్ళందరికీ సంభ్రమం కలిగింది. పిల్లలు చేతులు చరుచుకుంటూ ఒకళ్ళ మొహాలు ఒకళ్లు చూసుకుని ఫక్కున నవ్వుకున్నారు. అనర్గళంగా పాట సాగింది. రఘూ ఎక్కువగా జానపద గీతాలు పాడాడు. మధ్యలో కూర్చున్న నాయకుని ప్రక్కన ఇంతలో తొలినాడు చూసిన సుగాలీ పడుచు వచ్చి కూర్చున్నది. అతని ఒడిలో మోచేయి మోపి ఆమె చనువుగా కూర్చున్నది. తెల్లపావురం ఇంతలో రివ్వున ఎగిరివచ్చి ఆమె తలపై తెల్లతామరలా వాలింది. దానిని చేత్తో పట్టుకున్నది ఆ పడుచు. మధ్య మధ్య నాయకుణ్ణి ఏవేమిటో హార్మోనియం చూపుతూ ఆమె అడుగుతున్నది. నాయకునితో సహా ఆమె కొంచెం ముందుకువచ్చి కూర్చుని ససంభ్రమ చంచల నేత్రియై హార్మోనియం జిలిబిలిపలుకులు విని మోహావివశ అవుతున్నది. రఘూ తదేకదీక్షగా కంఠ వైశాల్యంతో సుగమ సంగీతవాహిని పారువారిస్తున్నాడు. ఆమె మనస్సు పరవశమౌతున్నది. అతను ఉత్తేజితుడౌతున్నాడు. ఆమె కన్నులు మూసింది. ఆ గాన తరంగిణిలో ఆమె నావలా తేలిపోయినది. సోలిపోయినది. అందరూ ఆ సుగమ సంగీతామృత వృష్టికి తడిసి ముద్దలైనట్లు స్తబ్ధులైనారు.

ఆ వేళలో రఘూ మనస్సొక వెల్లి పెల్లు. అతని సంగీతమూ వెల్లి పోరు. సుగాలీ కన్య ముఖ చంద్రదర్శన మాత్రమున అతని మనసు మొదట చెరువై దబకలాడింది. పిదప సరోవరమై కల్హారపంక్తుల నిండార విచ్చి వికసించి హాసించినది. ఒక పరిణత వేళకు అది మహాసముద్రమై ఉప్పొంగి ఉల్లోలమైనది.

రఘూ విసిరిన మధుర సంగీత స్వరజాలంలో ఆకోనగూడెపు నివాసులందరూ మీనములై మేను మరచినారు. ఒక మలయపవనవీచికకు సుగాలీకన్య మోముపై చెదిరిన ముంగురులు సైతం నర్తించి తమరసికత వెల్లడించుకున్నాయి.

నాయకుడు తండాలను నాట్యం చేయమని ఆజ్ఞాపించాడు. పడుచులంతా ముందుకు వచ్చారు. తక్కినవారంతా వెనుకకు వెళ్లారు. మధ్యన కర్రలు పాతి నూనె గుడ్డలు చుట్టి

దివ్వటీలు వెలిగించారు.

వారు రంగురంగుల చోళీలతో, పూసల హారాలతో రెండుమూడు తండాలుగా చుట్టుగా తిరిగి చప్పట్లు చరుస్తూ నాట్యం ప్రారంభించారు. సుగాలీకన్య వారితో కలసి నాట్యంలోకి రాలేదు. నాయకుడు 'రజనీ' అని ఉరిమాడు. ఆ ఉరుమును ఆమె నెమలిలా విన్నది. ఆమె ఈ అరపుకుతండాలో చేరి అగ్రగామిగా నాట్యం మొదలుపెట్టింది. రఘూ పాట క్షణం ఆపాడు ఆ నాట్యానికి లయగా ఎలా సాగాలో అతనికి ముందు తెలిసిందికాదు. 'కానీ దొరా పాటపెట్టి పలికించు' అన్నాడు నాయకుడు. సుగాలీకన్య అడుగులలయతో హార్మోనియం పలికింది. ఆమె చప్పట్లకనుగుణంగా అతనిపాట కొనసాగింది. ముసుపు పాడకుండా, పదంలేకుండా తండాలు, నటుపాటతో కాలంగడిపేవారు. ఈ కొత్తపాట నూతన చైతన్యం కలిగించింది. వాళ్ళ నాట్యానికి కొత్త సొంపు చేకూర్చింది. అందెల, మువ్వల సందడులతో సుగాలీపడుచులు మైమరచి పంచవన్నెల నెమళ్ళు పురివిప్పి ఆడినట్లుగా నాట్యంచేశారు. నవలావణ్యవిలాసినులనడుమ రతివలె ఆమె నాట్యంచెయగా నాటిరాత్రి సంబరములు, దేవుడికొలుపులు ముగిసినాయి. రాజులు రఘూను గట్టిగా కౌగలించుకుని ఎత్తివేశాడు. ఆమె నాట్యవిలాసానికి నాయకుడు సుగాలీకన్యను కౌగలించుకొని తలపై ముద్దుకున్నాడు. వెంకన్న నాయకుడిదగ్గరకు వచ్చితన ఆనందంవెల్లడించాడు. సుగాలీకన్య తనకు 'దేవుడిచ్చినబిడ్డ' అని నాయకుడన్నాడు. ఆమాటకు వెంకన్నలో ఏవో పరిపరి ఆలోచనలు పరుగులెత్తాయి. నాయకుని కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి. తల్లి లేని పిల్ల అని ఆమెతలను నాయకుడు తనహృదయానికి హత్తుకున్నాడు. వెంకన్న ఆమె పేరేమిటని నాయకుణ్ణి అడిగాడు. చెప్పమని ఆమెనే ఆజ్ఞాపించాడు నాయకుడు. బెదురుతున్న కళ్ళతో జాలిగా వెంకన్నవైపు చూసి 'రజని' అన్నది ముక్తసరిగా. మనుష్య భాషలో భీతహరిణం పలికినట్లుగా ఉన్నది ఆమె మాట. సుక్క పొడిచేపొద్దయిందని వెళ్ళమన్నాడు నాయకుడు.

ఆ రాత్రి రఘూ-వెంకన్న యిద్దరూ నిద్రపోయినట్టే లేదు. తెల్లవారే వేళ వెంకన్న లేచి కూర్చుని ఏదో శూన్యంలోకి చూస్తూ ఆలోచిస్తున్నాడు. రఘూకు ఏదో అనుమానంగా ఉంది. తనకు రజని చేసిన నాట్య భంగిమలు ఆమె సౌందర్యమూ కన్నులలో మెదలటంతో కలతనిద్రపట్టింది. వెంకన్న ఆలోచన యేమిటో అతనికి అంతుపట్టలేదు.

'ఏమిటి వెంకన్నా రాత్రంతా నిద్రపోయినట్టే లేదు. తీవ్రంగా ఏదో ఆలోచిస్తున్నావు'

'మరేం లేదుబాబూ' ఈమాటలు భారంచేసిన గొంతు పలికినట్లు వినవచ్చాయి.

రఘూ లేచి దగరగా వెళ్ళి వెంకన్నతో 'నువ్వెన్నాళ్ళుగానో నాతో అసలువిషయం చెప్పక బాధిస్తున్నావు వెంకన్నా. నేను నీబిడ్డవంటివాణ్ణి కాదూ- నాతో దాపరికం ఎందుకు- నీ బాధ యేమిటో నాక్కూడా చెప్పరాదూ- నేనంత పరాయివాడినా" అని అనునయంగా అడిగాడు.

'బాగా వేసింది బాబూ- నేను చెబుతానే అనుకోండి- పైగా నాబాధ మీరుకూడా విని బాధపడాల్సి రావటం మినహాగా దానివల్ల మంచి యేంజరుగుతుంది. పిచ్చివారుగాని- పరాయివాణ్ణిగా చేసి చెప్పకపోవటం కాదు బాబూ-! ఇక వెంకన్న మాట్లాడలేక క్షణం ఆగి- 'అరెబాన తీరేబాధ అయితే చెప్పకున్నా- విన్నా బాగుంటుంది. నాది అటువంటిదికాదు రఘు బాబూ' అని గద్గద కంఠుడై అన్నాడు.

రఘూ పెద్ద ఒట్టుపెటుకుని వెంకన్నను బలవంతపెట్టాడు. ఇరుకున పెట్టాడు. వెంకన్న చెప్పక తప్పిందికాదు.

వెంకన్నకు ఇరవయ్యోయేట మేనకోడలితో పెళ్ళి అయింది. అతనికి లేక లేక నలభైయేళ్లకు లొచ్చునపడ్డ కొంపలో వెలుగురేకలా ఒక ఆడపిల్ల కలిగింది. వెంకన్నకు మగపిల్లలంటే మోజు. ప్రాయపు సూర్యుడు పశ్చిమటికి తిరిగినప్పుడు కలువవిచ్చినా అతడు అట్టే ఆనందించలేదు. అతని భార్య అమందానందం పొందింది. ఆ పిల ముమ్మూర్తులా తల్లిపోలిక. ఆ పిల్ల పుట్టినప్పటినుంచీ ఆమె శరీరం దెబ్బతిన్నది. జబ్బుతో ఆమె బాధపడటం తరచుగా జరిగేది- కోటప్పకు మొక్కుబళ్లు చెల్లించాలని, శరభయ్యను వరాలడగాలని ఉన్న రెండెడ్లబండిలో శివరాత్రి తిరునాళ్ళకు వెళ్లాడు వెంకన్న. అప్పుడు తన బిడ్డకు మూడేళ్ళ వయస్సు. మహాజనంలో అపరిమితమైన తొక్కిడిలో వెంకన్న భార్య కొలుపులు చెల్లించడంలో కళ్ళుతిరిగి పడిపోయింది. ఆ బేజారులో వెంకన్న పిల్లమాట మరచాడు. అసలు ఆ పిల్ల పుటకతోనే తన ఇంటికి ఇటువంటి విపత్తులు వచ్చాయా అనే మూఢ అనుమానాలు అతనికుండేవి. తొక్కిడిలో భార్యను మంటపానికి భుజంమీద మోసుకు వచ్చాడు వెంకన్న. ఒక నాటువైద్యుడు ఏదో కలకం తీసియిచ్చి నాడి బలహీనంగా ఉందనీ, రక్తం లేక పాలిపోయిందని చెప్పి విశ్రాంతిగా అలాగే పడుకోనియ్యమన్నాడు. కనురెప్పలు బలహీనంగా తెరచి చూస్తూ పాప యేదని భార్య అడిగేదాకా వెంకన్న ఆ విషయం ఆలోచించనేలేదు.

దేవాలయమంతా సంబరాలూ, సంతలూ అన్నీ తిరిగిచూశాడు వెంకన్న. ఆనాడు మధ్యాహ్నం ఒంటిగంట మండుటెండలో తిండీ తిప్పలు లేక గుండెలు బాదుకుంటూ వెంకన్న పరుగులుపెట్టాడు. ఎందరినో అడిగాడు. పిచ్చిప్రశ్నలు అడిగాడు, అతనికి పాపదొరకలేదు. రిక్తచేతులతో అతను తిరిగి

# ★ జీవనరాగం ★

భార్య ముఖం చూడలేక అలమటించిపోయాడు. ఆమె నోట్లో చుక్కెడు నీళ్ళు పోసినాళ్ళయినా లేకపోయారు. సాయంకాలం అయింది. జగజ్జ్యోతి ధ్వజస్తంభానికి వ్రేలాడింది. గుడిబయట ఒకటే కోలాహలం ఎంతయినా వెంకన్న కాళ్ళు గుడివైపు నడవలేకపోయాయి. అతని మనస్సు భార్యను గురించి, ఆందోళన పడుతున్నది - వెళ్ళలేడు - వెడితే 'పాప' సంగతి తనేం చెబుతాడు!

కాలువలు తీర్చి వస్తూ పోతున్నారు మహాజనం. ఊరిబయట కొండమలుపున ఉన్న వెంకన్నకు "ఎక్కడపుట్టిందో ఎక్కడపెరిగిందో మహాతల్లి పార్వతమ్మలాగా పసుపుకుంకాలతో వెళ్ళిపోయింది - శివరాత్రి పూటా" అనే అమ్మలక్కల మాటలు వినిపించాయి. వెంకన్న చెవులు గట్టిగా మూసుకున్నాడు. ఊపిరి స్తంభించిపోయింది. ప్రపంచం తలక్రిందులైపోయింది. ఛా! భగవంతుడు లేడా. ఇంతని జరుగుతుందా. ఏమిటీమాటలు ఎవరి పాలిటికి...అనుకున్నాడు వెంకన్న.

ఆ శివరాత్రి అతనిపాలిట కాళరాత్రి అయింది. భగవంతుడూ. తనూ ఇద్దరూ మిగిలారు - ముగ్గురు గోపురాలు రాతి రప్పలూ చెట్లూ చేమలూ-నదులూ సముద్రాలూ-అన్నీ స్థిరంగా ఉన్నాయి. తను వాటితోపాటు ఈ లోకంలో ఉండిపోయాడు. ప్రియ భార్యా వియోగ బాధాసంతప్తుడై వెంకన్న జీవితం మనోకల్పిత వానప్రస్థంలో గడుపుతున్నాడు. జీవితం కేవలం భారంగా ఇసుకలో నడకలా ఉంది సుదీర్ఘంగా. కారణజగత్తులో మరణించిన వెంకన్న జీవచ్ఛవమై ఉన్నాడు. అతని బిడ్డ ఏమయిందో - ఎక్కడ ఉందో - అదంతా ఆ దేవుడికి తెలిసే ఒకటే తెలుసుకో ఒకటే - అయినా తనకు తెలిసి మాత్రం ఏమిటి ప్రయోజనం! ఆ తెలిసేదన్నీ కాటప్పకే తెలుసే మంచిది - మిగిలిన జీవితం వెళ్ళబుచ్చడమే అతని బాధ. అయితే ఎప్పటికయినా తన బిడ్డ అంటూ కనిపిస్తే ఒక్కసారి నేత్రానందం జ్యోత్స్న అయిన తన గృహలక్ష్మిని జ్ఞప్తికి తెస్తుంది. పోలికలన్నీ ఆ తల్లివే - అంతకు మించి వెంకన్న జీవితానికి పరమవాంఛ చరమవాంఛ తనే లేవు.

వెంకన్న ఆవేశం రఘూ గుండెలో ప్రతిధ్వనించింది. రఘూ గుండె బాధతో కృంగిపోయింది.

వెంకన్న కళ్ళు తుడుచుకుని తన పంచతోనే రఘూ కళ్ళు కూడా తుడిచి 'అగుగో ప్రాదక్షిణం బాబూ నీ వెనుక పావనిమూర్త్యడికెప్పుడూ యింతవరకు తెలీదు' అన్నాడు. రఘూ గట్టిగా వెంకన్నను కౌగలించుకున్నాడు 'నువ్వు ఒక మహానుభావుడివి వెంకన్నా. చూడు ఆ ఎదురుగా ఉన్న కొండకన్న నువ్వు ఎంత ఎత్తుగా గంభీరంగా కనిపిస్తున్నావో' అని దుఃఖావేశంతో అన్నాడు రఘూ

రఘూ మనస్సులో ఎప్పటికయినా వెంకన్న కూతురు ఎక్కడ ఉన్నదో వెతికి తెలుసుకుని తండ్రినీ కూతురినీ కలపాలనే ధర్మావేశం పరవళ్ళు త్రొక్కింది. కాని అందుకు గల అవకాశాలు? ఆచరణ కనువదించలేని ఆశకాన్ని సుదీర్ఘ నిశ్వాసంగా నిట్టూర్చాడు రఘూ.

వెంకన్నకు ఆనుగారీ కన్యను చూస్తే ఏదో చిరస్మృతి కలిగింది. మనస్సు కంపించింది. ఆ సంగతి రఘూ మాత్రం చెప్పలేదు. నాయుడుగారు తనకు దేవుడిచ్చిన బిడ్డ ఆ పిల్ల అన్నాడు. అయితే దేవుడే తీసుకుపోయిన తనబిడ్డ మాటేమిటి! దేవుడు తన దగ్గర తీసుకుని నాయుడికిచ్చాడా తన బిడ్డను! ఏమిటీ ప్రశ్నలు. ఎవర్ని అడిగితే ఎవరు చెబుతారు. వెంకన్న ఆలోచనే కలతగా మారింది. వంటో నలత కూడా వచ్చింది. తల తిరిగిపోయింది. ఎన్నడో జరిగిపోయిన కథను తిరిగి తనలో తెల్లకరిగింది వ్యథ. కొండల్లోకి ఒంటరిగాపోయి పెద్ద పెట్టున ఉన్మాదంతో అరచాడు. ఆ నిశ్చల ప్రకృతిని ప్రశ్నించాడు, నా బిడ్డ ఏమయింది. ఎక్కడుంది? ఈశ్వరం, చెప్పండి.

ఈ ప్రశ్న ఒక్కటి, కొండలూ కోనలూ విన్నాయి. వినగానే తిరిగి అవన్నీ అన్ని కంఠాలతోను మళ్ళీ ప్రశ్నించాయి. వాటికి కూడా ఆ రహస్యం తెలియాలి. తెలియజెప్పమంటున్నాయి. ఆ అరపుల ప్రతిధ్వనులకు చెట్లమీది పిట్టలు చెల్లాచెదరై బెదరి ఎగిరిపోయాయి. భూనభోంతరాలకు ఆ ప్రశ్నలు రెక్కలువిప్పి ఎగసిపోయాయి. తన ఒక్క ప్రశ్నకు వేయి అవే ప్రశ్నలు బదులు వచ్చాయి. వెంకన్న జీవితం బదులులేని ప్రశ్న! అతడు తిరిగి కుటీరం చేరాడు. ★

(సశేషం)

## ★ కలిసిన ద్రువాలు ★

(28-వ పేజీ తరువాయి)

చిన్న సంఘటన ఎంత మార్పును దెచ్చిందో. గమనించనే లేదండోయ్ నేను. మనం చీలి పోయేదారి వచ్చేసింది! మాటల్లో ఇట్టే గడిచిపోయింది సుమండీ! కాలం. ఇక వస్తాను. కథకంచికి మనమింటికి" అంటూ పూర్తి చేశారు శాస్త్రులుగారు.

"అహా! ఇంకా పూర్తిగాలేదండోయ్! కాస్త ఆగండి!" అంటూ రాజారావు ఒక శుభలేఖతీసి శాస్త్రులుగారిచేతి కిచ్చాడు.

"ఇదేమిటండీ! ఎవరికి పెండ్లి!" అని కండ్లు ఇంతవి చేశాడు శాస్త్రులు.

"ఈ వివాహ విషయంలో మీరు చేసిన సహాయం అమూల్యమైంది. ఎన్నటికీ మరువలేను నేను. మీకు చాల కృతజ్ఞుణ్ణి. మీ కోసం నేను రావాలనుంటె మీరే వచ్చారు. పెండ్లి సామాను తీసికొచ్చేప్పుడు మొదటగా ఈ గ్లాస్కో పంచలచాపు తీసికొచ్చాను. మీకు ఉడుతాభక్తిగా సమర్పించేందుకు. మీరు తప్పక వివాహానికి విచ్చేసి ఈ స్వల్పకానుకను స్వీకరించవలసిందిగా ప్రార్థిస్తున్నాను!" అన్నాడు రాజారావు.

"ఏమిటండీ! మీరనేది! ఈ వివాహం ఎవరిది! ఇందులో నేచేసిన సహాయమేముంది! వివరంగా చెప్పండి, రాజారావుగారూ!" అని ప్రశ్నించాడు శాస్త్రులుగారు.

"పదిరోజుల క్రితం, నేనూ మీరూ, బస్సుదొరక్క కూర్చొని కబుర్లు చెప్పుకున్నాంగదండీ! అప్పుడు మీరు "దూరపు కొండలు నునుపు" అంటూ దగ్గరసంబంధాల్ని వదలుకొని దూరపు సంబంధాలకు ప్రాకులాడేవార్ని గురించి వ్యాఖ్యానించారు సోదాహరణంగా. బహుశా మీకు జ్ఞప్తి ఉండకపోవచ్చు. కాని ఆమాటలు నామీద చాలాగొప్పగా పనిచేశాయి. నేనూ ఆరోజు మా చెల్లెలి పెండ్లి సమ్మంధం విషయమై బయలుదేరానులెండి. వరుడు యఫ్. ఏ. తప్పినవాడు. పదిఎకరాల పొలమూ నలుగురన్నదమ్ములూను. నాల్గువేలు కట్నమడిగారు. ఏదో ఒకరకంగా సెటిల్ చేసికొని ఈ శ్రావణమాసంలోనే పెండ్లి చేసేద్దామనే బయలుదేరాను. మీతో సంభాషించాక నా మనస్సు మారిపోయింది. అస్పష్టంగా నాలో మెదలే భావాలకు స్పష్టమైన రూపం కల్గించారు మీరు. ఆ ప్రయాణం మానుకొని వెంటనే మా మేనత్తగారి ఊరికి పోయాను. మా మేనత్త కొడుకున్నాడులెండి. మ్యాట్రిక్ ఫైనల్ తప్పాడు. వినా ఒక్కడే మొగపిల్లాడు, లోటేదు ఆ స్థితుంది. మొదట బెట్టుసరిచేసేవారల్లా నేను పోయేసరికి తటాలున తగ్గివచ్చి అంగీకరించారు. కట్నం గూడ రెండువేలకి లోపే. ఈ సమ్మంధం కుదరటంలో మీ సహాయం పరోక్షమైనదే అనుకోండి, మరువరానిది. ఎల్లుండి రాత్రికే పెండ్లి. మీరు వివాహానికి తప్పక విచ్చేసి వధూవరుల నాశీర్వదించి నా యీ స్వల్పమైన సత్కారాన్ని అందుకొంటారని ప్రార్థిస్తున్నాను" అని రాజారావు నడిచిపోయాడు. "ఓరా!" అని శాస్త్రులవారు ముక్కుమీద వ్రేలు వేసుకొని అలాగే చూస్తూ ఉండిపోయారు, రాజారావు వెళ్ళినవేపు. ★

## ★ కొత్త అల్లుడు ★

(43-వ పేజీ తరువాయి)

నొక్కాణ్ణే వంటింటితలుపు తాళం తీసి ఆ దయ్యం జుట్టుపట్టుకు తీసుకు వస్తాను," అన్నాడు భూతవైద్యుడు. అల్లుడికి గుండెఆగినంతపని అయింది. అయినా మంచిధైర్యం తెచ్చుకొని మూలనున్న రోకలి చేతపుచ్చుకుని తలుపుపక్కనే నిలబడ్డాడు. భూతవైద్యుడు తలుపుతెరచి పెద్దగా అరుస్తూ, ఒకచేత్తోనిప్పు, ఒకచేత్తో గుగ్గిలం పట్టుకొని వంటింట్లో ప్రవేశించాడు. తలుపుచాటునదాగివున్న అల్లుడబ్బాయి భూతవైద్యుడి కంట పడకుండా తప్పుకొని, వెనుకమాటున రోకలితో వాడివెన్నుమీద పొడిచి వాడు కిందపడి తిరిగి చూచేలోపుగా బయటికి జారుకుని వంటింటిపక్కనే వున్న మేడమెట్లు నాలుగు అంగల్లో ఎక్కి తన గదిలో చేరుకున్నాడు. రాగానే గుఱ్ఱుపెడుతున్న హనుమంతరావుని కోపంకొద్దీ ఒక్కపోటు పొడిచి లేపాడు. జరిగిందంతా స్నేహితుడివల్ల విని హనుమంతరావు తన నిద్రమత్తుతనానికి నిందించుకొని, స్నేహితుడి ధైర్యసాహసాలకు మెచ్చుకున్నాడు.

అల్లుడబ్బాయి తన మసిగుడ్డలు గబగబా మార్చివేసి మరచెంబులో నీళ్లతో కాస్తముఖం, కాళ్లూకడుగుకొని, ముస్తాబయాడు. స్నేహితులిద్దరూ మేడ దిగి క్రింద జరుగుతున్న గల్లంతుకు అప్పుడే మెలకువ వచ్చినవాళ్ళలా నటించి, శాస్త్రుల్లుగారు చెప్పిన కథంతా విని లోలోపలే నవ్వుకున్నారు. కాని వంటింటి ముందు వరండాలో కూలబడి "పాడు దయ్యం నా నడుం విరగ్గొట్టి పారిపోయిందర్రో" అంటూ గోలపెడుతున్న భూతవైద్యుణ్ణిచూచి మిత్రులిద్దరూ నవ్వు ఆపుకోలేక ఫక్కున నవ్వేశారు. ★

రైల్లో ఒక ప్రయాణీకుడు కోపంగా రెండోవాడితో

'నీకళ్ళు ఎక్కడున్నయ్ మిస్టర్' అన్నాడు.

'నా తలలో' అన్నాడు రెండోవాడు.

'మరి నా కాళ్లు ఎందుకు కనపడ్లేదూ'

'బూట్లు తొడుక్కున్నావు గనుక' అని వక్రమంగా సమాధానం యిచ్చాడు అదను.

# వనితాలోకం



## కళ్ల ప్రాముఖ్యం

### అందానికి అనుభవానికి అవసరమైన నయనాలు

(కళ్ల ప్రాముఖ్యం అవి ఉన్నవాళ్లందరికి తెలుసు. అవిలేని అభాగ్యులకు వేరే చెప్పనక్కరలేదు. మరీ తెలుసు. 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అనే సూక్తికి అర్థం ఇదే.
కాగా కళ్లు ఎంత అవసరమో అంత అందాన్నిస్తాయి. కనుముక్కుతీరులు అందానికి ముఖ్యఅనుబంధాలు. ఆడవాళ్ల అందానికి కళ్ళు మరీ ముఖ్యం. స్త్రీలు కళ్లతో మాట్లాడతారు. అవసరమైతే పోట్లాడతారు. కనుక వాటి విషయమై జాగ్రత్త వారికి మరీ అవసరం.)

వనితాలోకంలో చాలమంది సోదరీమణులు వివేక, విజ్ఞానములతో కూడిన శీర్షికలెన్నో, వ్యాసాలెన్నో వ్రాశారు. వీటన్నిటిని ప్రచురించి మహిళలలోని అజ్ఞానాన్ని పోగొట్టి, యువతులను ఆదర్శమహిళలుగా తయారుచేసేందుకు కంకణం కట్టుకొన్న మహిళలకు నా హృదయపూర్వక వందనములు.

మా మామూలుగా వంటకాలు, అల్లికలు, గృహిణీమణులకు, కన్యలకు పనికివచ్చే వ్యాసాలెన్నిటినో ప్రచురించారు. మానవునికి వినోదాలు, వింత లెంత అవసరమో దేహారోగ్యాన్ని కాపాడుకోవడం కూడ అంత అవసరము. శరీరములో ఏ అంగానికి కష్టము కలిగినా శరీరమంతా బాధపడాల్సొస్తుంది. ప్రతిదినము జీవించేందుకు తిండితినట మెంత అవసరమో, అన్నిటి కాలవాలమైన ఈ శరీరాన్ని జాగ్రత్తగా కాపాడుకోవలసిన బాధ్యతఅంత వుంది.

పంచేంద్రియములు ఐదు—అవి ముక్కు, కళ్లు, చర్మము, నాలుక, చెవులు. ప్రాణిలోని ప్రతి యింద్రియము చేసే పనుల కవే సాటి. దేనిలోపమైనా ఆ లోటప్పుడే తెలుస్తుంది. ప్రస్తుతం మన కళ్ల ప్రాముఖ్యతను గూర్చి చర్చిద్దాం.

అన్ని అవయవాలకన్న కన్ను చాల ప్రాముఖ్యత వహిస్తుంది. అందుకే "సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" అనువారి సూక్తి నుడుకలో నున్నది. అది లేందే ఏపని చేయటానికి సాధ్యపడదు. ఒక చేయి లేకపోయినా, ఒక కాలు విరిగిపోయినా, ఎలాగో సర్దుకోవచ్చుగాని కళ్ళు లేకపోతే మాత్రం జీవించటం దుర్లభమవుతుంది. అయితే ఇప్పుడు జీవిస్తున్న అంధులమాటేమిటంటారేమో! దానికి మనమేమి చేయలేము. మనలాగా ప్రకృతినిచూసి ఆనందించే భాగ్యం వారికి లేదు. కళ్ళుండి నేత్రానందము నోచుకోలేని వాడు అంధునితో సమానమే. అలాంటి కళ్ళను మనం జాగ్రత్తగా చూచుకోవాలనుకుంటే దోషమేమీ లేదు.

ఓలేటి నాగరత్న సత్యం

స్వచ్ఛమైన మెరపుతీగలాంటి కళ్ళు కల స్త్రీని చూచినపుడు అబ్బా! ఎంత బాగుందని ఆశ్చర్యపోతాము. ఇంకా చూచేందుకు ఉవ్విళ్ళూరుతాము. ఆ కండ్లలోనే ఆమె ఆరోగ్యమంతా చూచినట్లు ఆనందపడుతాము. మంచి నేత్రాలు ముఖానికి కళ నిస్తాయనడంలో సందేహము లేదు. కాని ఎంతో మంది ఇప్పటికి పరిమళవస్తువులు వాడి అజాగరూకతతో ప్రవర్తించి రోగములు తెచ్చుకొనుచున్నారు.

నేత్రాలను శుద్ధంగా, మల్లెపూవులా ప్రకాశవంతముగా వుండేట్లు చూసేందుకు పరిమితమైన వెలుతురులోనే పనులు సాగించాలి. అలా అని సూర్యకిరణాలు దూరమంతా, అన్ని వాకిండ్లు బంధించి కూర్చుని కాదు నే చెప్పేది. మిరుమిట్లు గొలిపే వెలుతురు కండ్లకు ఎంతైనా చెడ్డది.

అందుకనే పడకగదిలో చదువుకొనేందుకు గదిలో వెలుతురు మామూలుగా ఒక బల్బు, చదువుకు మాత్రమే ఒక బల్బుండేట్టుగా చూచుకోవాలి. చదువుకొనేప్పుడు వెనుకనుండి వెల్తురు పడేట్లుగా బల్బునమర్చుకోవాలి.

వరుసగా 4, 5 గం||లు చదువుకు కాని, కుట్టుపనికి కాని, వ్రాసుకొనే పనికి కాని ఉపక్రమించినప్పుడు ½, లేక 1 గంటకో పది నిముషాలు విశ్రాంతి తీసుకొనుట ఉత్తమము. ఓరకే కండ్లు మూసుకొని దిండు మీద తల వాల్చడమో, కిటికీలోంచి చూసుకోవటమో చేస్తే చాల మంచిది.

అప్పుడప్పుడు కండ్లను బోరిక్ ఆసిడ్ సొల్యూషన్తోనో, లేకపోతే ఉడుకు నీటితోనో శుభ్రపరచుకొనినట్లయితే ఎర్రబడిన కళ్ళు, కండ్ల నొప్పి, అలసట నుంచి కొంతవుపశమనం కలిగిస్తుంది. ప్రత్యేక రక్షణ తీసుకొనకపోయినా మామూలు జాగ్రత్త తీసుకొనే పక్షంలో మన కళ్ళను జీవితాంతం చూపు తగ్గిపోకుండా చేసుకోవచ్చు. ఇది ఇప్పటి మన అమ్మమ్మగార్లను పరిశీలిస్తే తెలుస్తుంది. వయస్సు 80 సంవత్సరాలైనా ఉపలోచనములు లేకుండానే పనులు చేస్తుంటారు. ఇప్పటి కాలములో చెప్పక్కర్లేదు. 16, 17 సం||లు రాకనే చాలమంది కంటద్దములు ధరిస్తున్నారు కొంతమంది తలనొప్పికి కూడా (కొంతమంది ఫాషనుకు కూడా ననుకోండి) వేసుకుంటున్నారు. అవి లేందే ఏమి కార్యములు చేయలేరు. అదే ఆకాలానికి, ఈ కాలానికి తేడా! కళ్లు అరిగిపోతాయి, కరిగిపోతాయనే విషయం ఎచ్చట లేదు. మనం పెట్టుకొనే జాగ్రత్తలోనే వుంది. పరిసరాల్లో ప్రసరించే వెలుతురు మంచిదై, తగినంత విశ్రాంతి వుండినట్లయితే నరములు గట్టిపడి చక్కని చూపు కల్గిస్తుంది.

ఎలాగయినా కొన్ని అపాయాలు కలిగే సూచనలు కూడా వున్నాయి.

కనురెప్పలు వాచుట, కళ్ళు ఎర్రగా వున్నను, లేకున్నను నొప్పికల్గుట, దృష్టిలో మార్పు (మసకగా గాని, రెండుగా కాని కన్పించుట) కళ్లు మూసుకొనుట, తెరచుకొనుట, కను కొలకుల్లో ఒక రాత్రికి, కంది

ఇరుగు పొరుగుల ఋణాగుణ ధ్వని

# అంతూపొంతూ లేకుండా అప్పులకొచ్చే అతివలు

లీలావతి.

ఇరుగు-పొరుగు అన్నతర్వాత అప్పులు ఇచ్చుకుంటుండటం, పుచ్చుకుంటుండటం పరిపాటి. ఎంత జాగ్రత్తగా ప్రతివస్తువు ఇంట్లో "లేదు" అనుకోకుండ సంసారం చేసుకుంటే వాండ్లకుగూడ, ఎప్పుడో ఒకరోజు ఏదో ఒక వస్తువ అకస్మాత్తుగా అయిపోవటం జరుగుతుంటుంది. అలాటి సమయాల్లో మగవాళ్లు ఆఫీసుల్లో వుంటారు; పిల్లలు స్కూళ్లకు పోయుంటారు. ఇక అప్పు దుగత్యంతరం ఏమిటి? ఏపక్కింటి పిన్నిగారింటికో పోయి "గరిటెడు కాఫీపొడి వుంటే ఇద్దురూ. ఓగరిటెడు పంచదారుంటే ఇద్దురూ." అంటూ అడుగుతుంటారు. ఇది నేటి మన సంఘంలో జరుగుతున్న నగ్నసత్యం. అనుక ప్రతి ఒక్క కుటుంబానికి ఇరుగు-పొరుగు కుటుంబాలతో సహాయసానుభూతులు ఎంతయినా అవసరం. కాని ఈ అప్పులు పుచ్చుకుంటానికి ఒక హద్దు అంటూ వుండాలి. ఒక వస్తువ మనం పొరుగింటినుంచి అప్పు పుచ్చుకున్నపుడు, బజారునుంచి మనం ఆవస్తువ తెప్పించుకున్న వెంటనే ఇచ్చివేస్తుండాలి. అలా ఇచ్చిపుచ్చుకున్నప్పుడే ఇరుగు-పొరుగు కుటుంబాల్లో సరియైనసఖ్యత ఏర్పడుతుంది.

ఎప్పుడో ఒకరోజు నూటికి కోటికి అత్యవసరపరిస్థితులలో అప్పులకొచ్చే వాండ్లను గురించి మన కనవసరం. కాని కొందరుంటారు. వీళ్ళు నిత్యం ఏదోఒక వస్తువుకై ఇతర్ల ఇండ్లపై దండయాత్రలు సల్పుతుంటారు. ఇలా అప్పులకొచ్చే అతివల్లో నాలుగు తెగలవాండ్లున్నారు.

## అప్పుల తిప్పలు

మొదటిరకం వాండ్లు: వీళ్ళు "ఓ డబ్బా బియ్యం వుంటే ఇవ్వండి పిన్నిగారూ; ఓ గరిటెడు కాఫీపొడివుంటే ఇవ్వండి వదినగారూ" అంటూ వరసలు పెట్టుకొని నిత్యం ఏదో ఒకదానికి అప్పుకొస్తుంటారు. ఇరుగు-పొరుగు అన్నతర్వాత ఒకరికొకరు సర్దుకుపోవాలని అప్పు ఇస్తిమా, రోజులు, వారాలు, నెలలు గడిచిపోయినా అప్పుతీసుకొన్న వస్తువ తిరిగి ఇవ్వరు. మనమే సిగ్గువిడిచి "మొన్న తీసుకెళ్ళిన కాఫీపొడి తిరిగి ఇస్తారా" అని అడుగుతే, "ఇంకాతేలేదు. ఇంకో అరగంటలో తెప్పించి యిస్తాము." అంటారు. కాని తెచ్చివ్వరు. ఒకటికి రెండుసార్లు రెట్టించి అడుగుతే "అబ్బ! ఇంత పదిరోజులనాడు యిచ్చారో లేదో కంఠం మీద కూర్చున్నారు. ఇలా కంఠంమీద కూర్చుని ప్రాణాలు తీస్తారని తెలుస్తే, అసలు అప్పు పుచ్చుకుండేవాళ్ళమే గాదు. మీ గరిటెడు కాఫీ పొడితో మేడలు గడతామా, మిద్దెలు గడతామా." అని ముఖానే ప్రత్యక్షంగా అడిగేస్తారు. లేదా ఇరుగు-పొరుగు గృహిణులతో పరోక్షంగా మనకు విన్పించేలాగా చెప్పుతారు. ఈ తరహావాండ్లను భరించటం మహాకష్టం. వాళ్ళ సూటిపోటి మాటలు వింటూ నోరుమూసుకొని వూరుకోవల్సిందే. నోరుతెరిస్తే ఇంకా ఎన్నో రకరకాలనిందలు మోపుతారు. ఇలాటి వాళ్లకు అప్పుఇస్తే, మన వస్తువ అప్పుఇచ్చి మన చేజేతులా మనమే విరోధం తెచ్చుకున్నవాళ్ళమవుతాము. పోనీ వాళ్ళే తెచ్చిస్తారులే నిదానంగా అనుకుంటే, రోజులు, వారాలు, నెలలు గడిచిపోయినా తెచ్చివ్వరు. ఆతర్వాత మరీ వుండబట్టలేక మనమే అడుగుతే "ఎవ్వే! అప్పుడే యిచ్చేశాంగదండీ. ఇన్నిరోజులు అట్టిపెట్టుకుండే అలవాటు మాకులేదు బహుశః మీరు మర్చిపోయుంటారు. బాగా జ్ఞాపకం తెచ్చుకోండి" అంటారు మళ్ళీ మనం నోరుమెదపను వీల్లేకుండా.

## నిక్కులూ, నిష్ఠూర్యాలూ

పైవిధంగా అనేవాండ్లకు అప్పులు ఇవ్వటం మన తెలివితక్కువ అనుకొని, ఏవాడైనా ఒకవస్తువ లేదని చెప్తే, దాంతో వాండ్లు కళ్లు-చింతనిప్పుల్లా చేసుకొని, అగ్నికణాలు కురిపిస్తూ, "నిన్న మీవారు బజారునుండి సరుకులు తెస్తుంటె చూశామే. అప్పుడే అయిపోయాయా! ఏంభాగ్యమమ్మా! మీకుమటుకు అవసరాలు రావూ?" అంటూ ముఖానే అడిగేస్తారు. వీధిపాలుగువా తిట్టిపోస్తారు. చుట్టుప్రక్కల ఇండ్లకుపోయి

గింజల్లాంటి ఖళ్లు లేచు, అక్రమముగానున్నట్లు గోచరిస్తుంది. కొన్ని సందర్భాల లో కొంతసేపు మసకగా కన్పించినను వెంటనే మాయమవుతుంది. అది నిలకడగా వుండటం కూడా కద్దు. చాలమందికి దానికి కారణమేమంటె సినిమాలు—చీకటిని చీల్చుకొని వెలుగును చూసేందుకు కళ్ళపైని ఒత్తిడిచేసి చూడవలసొస్తుంది. దానిఫలితంగా మసకగా కన్పించుట, కళ్ళలో నీరు కారుట నొప్పి మొదలగునవి సంభవిస్తాయి. కాని చాలమంది పోతుందిలే అని నిర్లక్ష్యం చేస్తారు. పోతాయిలే అని జాగుచేయక కంటిశాస్త్ర నిపుణుని వద్దకు వెళ్ళి చూపించటం మంచిది.

40 ఏండ్లు పైబడినవారికి 2½% గ్లూకోమా అనేవ్యాధి వస్తుందని శరీరశాస్త్ర నిపుణులు తెల్పారు.

కళ్లు రక్తసిక్తమైయుండి ఒక రాత్రి పూర్తి విశ్రాంతిచే గుణము కనబడని ఎడల డాక్టరును కలుసుకొనుట ఉత్తమము. కంటిలో ఏదో దుమ్ము పడిందనుకొందాం. కనురెప్పలు మెల్లగా రుద్దినను, కండ్లు మూసి తెరచినను, అటు ఇటు ఆడించిన పోనియెడల "బ్లంట్ ప్రోబ్" అనే పరికరముతో ఉల్లిపొర గుడ్డ సహాయముతో తీసివేయవచ్చును. కనురెప్పలను గట్టిగా రుద్దినట్లయితే కంటిపాప కపాయము కలుగవచ్చును. తిగువాత చింతించి లాభము లేదు. అందుకే డాక్టరుతో తక్షణం సంప్రదించవలయును.

ప్రతి ఏడాదికో సారి కండ్లను డాక్టరుచే శుభ్రపరచుకొన్న యెడల ఏరోగాలు రాకుండా ముందుగానే జాగ్రత్త పడవచ్చు. కళ్ళు సున్నితమైన నరములతో తయారైనవి. వైద్యులు ఇతర రోగాలను కండ్లను చూసిన వెంటనే పసిగట్టగలరు. బ్లడ్ ప్రెషర్, డైయాబిటిస్, జాండిస్ అప్టిక్ నరము గట్టిబడి సిఫిలిస్ వ్యాధి గుణము చూపిస్తుంది. ఇవన్ని కండ్లలోనే ద్యోతకమౌతుంది. అందుకే మన ఇంటిలోని బామ్మలు కండ్లను చూడగానే ఏరా అలా వున్నావే మనడిగేస్తారు.

కొన్ని సందర్భాలలో ఒక పొజిషన్‌లో తల పెట్టినట్లయితే కండ్లకు ఏమీ కనబడదు. అప్పుడు పొజిషన్‌లో వున్నపుడు 1, 2 సెకండ్లు వస్తువు గోచరించలేదని తెలుసుకుంటాము. ఇది మామూలుగా జరిగేది దీనిని గురించి భయపడవలసిన అవసరం లేదు.

మనిషికి వయస్సు మీరిన కొద్ది నరములకు శక్తితగ్గి చూపుతగ్గిపోతుంది. ఎంతగా వయస్సు ఎక్కువవుతుందో అంత ఎక్కువగా వెలుతురు చూసేందుకు కావలసివస్తుంది. 45, 50 సంll లు సమీపించే సరికి కండ్లద్దాలావశ్యకమౌతవి.

కాబట్టి కళ్లు, ఆరోగ్యంగా వుండాలంటె ప్రకృతిచేసిన మూసి అనదించి భాగం పంచుకోవాలంటె-తగు జాగ్రత్త అవసరం.



ఎప్పుడూ ఇంతే—10 శంకర్




"ఫలానావిడ వఠి పిసినిగొట్టు. ఇంట్లో వస్తువ పెట్టుకు వెళేదన్నారు......" అంటూ చిలవలు, పలవలు కల్పించేస్తారు. ఇలాటి వాండ్లతో మహా చెడ్డ అవస్థ. అప్పు ఇస్తేమూ, ఆ వస్తువ మనకు తిరిగి వస్తుందనే ఆశవదులుకోవాలి. ఇవ్వకపోతేమూ, వాళ్ళనే నూటి పోటీమాటలు పడాలి.

రెండోరకంవాళ్ళు: వీళ్ళు మొదటిరకం వాళ్ళకంటె కొంచెం మెరుగులెండి! అప్పు తీసుకెళ్ళే వస్తువుల్లో కొన్ని మంచివస్తువులు తెచ్చిస్తారు. కొన్ని తిరిగి ఇవ్వరు. కొన్ని మంచిరకం సరుకులు తీసుకెళ్ళి, కీతారకం తెచ్చిస్తారు. మరికొన్ని పెద్దవస్తువులతో కొలుచుకొని తీసుకెళ్ళి, చిన్న వస్తువుతో కొలిచిస్తారు. బియ్యం, పప్పులు......... వగైరా సరుకులు సగం కొల్చేసి పోతారు. చింతపండు, బెల్లం......వగైరా వస్తువులు నారింజకాయంత పరిమాణంలో తీసుకెళ్ళి, చిన్న నిమ్మకాయంత పరిమాణంలో తెచ్చిస్తారు. "అలా ఇస్తారేం?" అని అడగటానికి మొహమాటంగా వుంటుంది. అలాటప్పుడు మనం నోరుతెరిచి చూడటంతప్ప మరేం చేయలేం.

ఇకపోతే మూడోరకంవాళ్ళు: వీళ్ళు పైరెండురకాలవాళ్ళలాగా అప్పు తీసుకోరు వస్తువులు. "కొంచెం పసుపుంటే పెట్టండి; కొంచెం పంచదారుంటే పెట్టండి; కొంత కాఫీపొడివుంటే పెట్టండి" అంటూ అడుగుతారు. అంటే పై రెండు తెగలవాళ్ళలాగా వీళ్ళు తీసుకున్న వస్తువులు అప్పుకాదన్నమాట. ఇలా కొంచం, కొంతపెట్టమని అడిగే వాళ్ళతో మరీ చెడ్డ అవస్థ. కొంచం పెడితే ఏమనుకుంటారోనని సిగ్గుగా వుంటుంది. మరి కొంత ఎక్కువగా పెట్టటానికి మనస్కరించదు—తిరిగి ఇవ్వరు కనుక. పోనీ అలా అడగవద్దని చెప్పటానికి దూషిస్తారేమోనని భయంగా వుంటుంది. ఏమైనా ఇలాటి వాళ్ళతో వేగలేం. ఈ రకంవాళ్ళకు యేవస్తువ యివ్వకుండ, శాశ్వతంగా విరోధంగా వుంటేనే బాగుంటుందనిపిస్తుంది.

## గుక్కెడు కాఫీ.....

నాలుగోరకంవాండ్లు: ఈ తెగవాండ్లు పై మూడు రకాలవాండ్లకు విరుద్ధం. వీళ్ళ ప్రత్యేకించి అప్పులకంటూ రారు. ఏదైనా వస్తువ కావాలంటే, దానికోసం సరియైన టైముకుపోయి, ఇతర్ల ఇండ్లలో తిష్ఠ వేసుకొని కూర్చుంటారు. ఈ తరహాకు చెందిందే మా పక్కింటావిడ. మధ్యాహ్నం కాఫీల టైమప్పుడు కబుర్లకొచ్చి కూర్చుంటారు ఆమాట ఈమాట మాట్లాడుతూ —
"అమ్మాయ్! ఇవ్వాళ ఇంట్లో కాఫీపొడి లేనట్టుంది. ఆయనతో చెప్పటం మర్చిపోయాను. నా గొంతులో ఓ గుక్కెడు కాఫీ పొయ్యమ్మా. కొంచెం పుష్టిగా వుంటుంది" అంటారు. గుక్కెడు యిస్తే ఏమనుకుంటారోనని, మేము మామూలుగా చేసుకుండే కాఫీ కంటే కొంచం ఎక్కువ పొడి వేసి, గ్లాసెడు కాఫీ చిక్కగా చేసిస్తారు. ఇలా నిత్యం కాఫీల టైమప్పుడు కంపల్సరీగా హాజరవుతారు. ఇవ్వకుంటే తోటానికి మొహమాటంగా వుంటుంది. ఇస్తూ ఎన్నిరోజులని భరించటం? మరొకటి: మధ్యాహ్నం భోజనాల అనంతరం రేడియో వింటానికంటూ వచ్చి "అమ్మాయ్! ఓ వక్కపలుకు పెట్టమ్మా" అంటారు. ఒక్క పలుకు పెడితే ఏమనుకుంటారోనని సీసా చేతికిస్తే గుప్పెడు వక్కపొడి నోట్లో పోసుకొని, ఇంకో గుప్పెడు చెంగున కట్టుకుంటారు రాత్రికి. మధ్యతరకం కుటుంబీకురాలినయిన నేను ఈమెకు పంవత్సరాల పర్యంతం కాఫీ, టిఫిను, వక్కపొడి ఎలా సరఫరా చేయగలను? ఈ సమస్యను ఎలా పరిష్కరించుకోవాలో నాకర్థంకావటంలేదు—పోనీ మాయింటికి రావద్దనిచెప్పటానికి, పిసినారివంటూ వీధి పొడుగునా ప్రచారం చేస్తుందేమోనని భయంగా వుంటుంది. ఒక్కొక్కసారి ఈమెను చూస్తుంటే ఒళ్ళుమండి, ఏ అడివిలోనో ఇల్లుకట్టుకొని జీవిస్తే బాగుంటుందనిపిస్తుంది. మీరేమంటారు?

## ఋణపాఠం

ఇంతకూ నే చెప్పేదేమిటంటే, ప్రతి ఒక్క కుటుంబానికి ఇరుగు - పొరుగు కుటుంబాలతో అవసరం వుంటుంది. అప్పులు ఇచ్చి పుచ్చుకోవాల్సిన అవసరాలు లేర్పడుతాయి. కనుక అప్పులు ఇచ్చి పుచ్చుకుంటూ అవసరాల్లో ఆదుకుంటుండాలి; ఆపదల్లో సహాయం చేసుకుంటుండాలి. కాని ఈ అప్పులకు ఒక హద్దు అంటూ వుండాలి.

# ఉత్తరాలు



(2 వ పేజీ తరువాయి)

వారిజీవికి. కొంగా దోసకాయల అమ్మకము, కేసుపంప్ల అమ్మకమూ వారు ఆయాకాలాలలో చేస్తారు. వినాహాలలో రూపాయ బిళ్లను పసుపుకుప్పల్లో పెట్టి వధూవరులచే కి కట్టించడము సరికాదు కొండగోగువంటి లతలతో ఎదురుబదుర్లుగా వధూవరులను నిల బెట్టి కుడి ఎడమచేతులు వాళ్లముతా పెద్దచేత కట్టిస్తారు కట్టెలుకొట్టి అమ్మి జీవించటం కూడా చాలపోల్ల వీరి ప్రధానవృత్తి, పాలు పెరుగు అమ్మకం చాలాతక్కువ.

ఇటువంటి ముఖ్యాచారాలు వింతగా చిత్రించిన ఈవ్యాసం వింతగానే ఉం దంటే వింతయేమీ లేదు.

జి. మునుస్వామి, మద్రాసు.

## గొలుసుకట్టు

వారపత్రిక (4-11-59) గొలుసుకట్టుకు జవాబులలో "ఆ, ఈ" రెండూ ఎంతఆలో చించినా రాలేదు. "ఆ" జవాబు మూడు అక్షరాల్లో ఇచ్చారు. కాని గళ్లు నాలుగు ఉన్నాయి. అలాగే "ఈ" జవాబు ఐదక్ష రాలలో ఇచ్చారు. కాని గళ్లు నాలుగే ఉన్నాయి. అచ్చు పొరబాటనుకుంటాను. ఆంధ్రపత్రిక గళ్లనుడికట్టు వేస్తున్నప్పటి నుంచి పత్రిక ఎప్పుడువస్తుందా అని చూస్తూ యుంటాం. నుడికట్టు మానకుండా ఎప్పుడూ ప్రచురిస్తారని ఆశిస్తాం.

వై. సీతాదేవి, నర్సాపురం.

* పొరబాటే. "ఆ" జవాబు "శకలము"అని ఉండాలి. "ఈ" జవాబు "పరువము"అని నాలుగుఅక్షరాల్లోనే ఉండాలి.*

* * *

నవంబరు 18 పత్రిక 'వనితాలోకం' శీర్షికక్రింద 'శైలజ' వ్రాసిన "మనలోనే ఉన్నాయి లోపాలు"అనే వ్యాసము చాలా బాగుంది. స్త్రీ పక్షపాతం లేకుండ, తాను ముల్లును కేవలం మొగవాళ్లపైకి మొగ్గనివ్వకుండా ఆమె మొత్తానికి వ్యాసాన్ని చాలా బాగా వ్రాసిన పురుషులస్థానానికి ప్రత్యేకత

నిత్యం ఇతర్ల యిండ్లపై దండయాత్రలు చేయగూడదు. ఎప్పుడో అత్యవసర సమయాల్లో మటుకే ఇతర్ల ఇండ్లకు అప్పుకు పోవాలి ఇంకోటి. కాఫీలకు, టిఫిన్లకు పతర్ల ఇండ్లకుపోక, ఎప్పుడో విశ్రాంతి సమయంలో కాలక్షేపానికి, కబుర్లకుమటుకే పోవాలి. అలా టప్పుడే ఇరుగు - పొరుగు కుటుంబాల్లో స్నేహసౌహార్ద్రాలు వెలివిరుస్తాయి. ఏమంటారు? ★

చూపించారు. చదువుతుంటే అయిపోయిందని తెలిపే నక్షత్రం గుర్తుచూచి రైలు దిప్పిన ప్రయాణీకుడు విచారించినట్లు విచారించా.

కొంకరపర్తి రామచంద్రరావు,

* * *

కేవలం స్త్రీల లోపాల్నే విశ్లేషించి విమర్శించేరు. స్త్రీలలో లోపాలు ఉండటం వాస్తవం కాని వాటికి పురుషులే చాలావరకు బాధ్యులు అని చెప్ప వలసి ఉంది. వరకట్నాలు పెరగటానికి కారణంమాత్రం ఆమె అన్నట్లు "లేనిపోని అశలు పెటుకొని తమ తాహతు కందని సంబంధాలకోసం ఆశపడే స్త్రీల గురవాం కాగమనే చెపక తప్పదు.

'సుదేవి'

కోటబొమ్మాళి, శ్రీకాకుళం జిల్లా.

* * *

శైలజగారి వ్యాసం బాగుంది. బహుశా చాలా వ్రాద్దామనుకొని కొద్దిగ వ్రాసి ముగించారేమో అనిపిస్తుంది. వీరు తమ అభిప్రాయాలను వ్యాసరూపంలో గాక కథానిక రూపంలో వెలువరించితే చాలా బాగుండు నని నా అభిప్రాయం.

మధు, వరంగల్.

* * *

వ్యాసం చాలా బాగున్నది. నా కెంతో నచ్చింది. ఆవిడన్నట్లు ముందు మనలోని లోపాలను సరిదిద్దుకొన్నాక, మగవారి ననటం సబబు

కె. కిరణ్, భీమవరం.

* * *

నిజంగా చూస్తే స్త్రీ అభ్యుదయ నిరోధకులు స్త్రీలేనని చాలవరకు స్పష్టమయింది. ఒక స్త్రీ సంఘంలో ముందంజ వేసిందంటే ఆమెకు ప్రోత్సాహం ఇవ్వక పోగా లేనిపోని అభాండాల్ని ఆమెపై వేసి యితరుల దృష్టిలో చులకన చేస్తారు కారణం ఈర్ష్య, ఓర్వలేనితనం మొదలయినవే

గుడిపాటి లీల, బొంబాయి.

* * *

గౌరిగారు వ్రాసిన "సంసారములో సహకారం" అను వ్యాసములో, మగవారిపైన నే తప్పంతయూ పెట్టుట సరికాదుగాదు. అటువంటి గుణములు కలవారు స్త్రీలలోనూ ఉన్నారు.

ఎస్. ఎమ్. లింగమ్, నెల్లూరు.

* * *

"శాఖా చంక్రమణం" అన్న వ్యాసం చాల బాగున్నది. ఎప్పుడో జరుగబోవుదానిని వూహించుకుంటూ వున్నవాళ్ళకి ఈవ్యాసం చక్కగ పనికొస్తుంది. ఈ వ్యాసం వ్రాసిన ఎం. ప్రభావతిగార్కి నా ధన్యవాదాలు.

ఆ. దుర్గా, హనుమకొండ.

* * *

లలితాదేవిగారు వ్రాసిన 'పెండ్లి చూపులు' అనువ్యాసం చాలా అసమంజసము గా నున్నది. దినదినానికి నాగరికత వృద్ధియగు చున్న యీ రోజుల్లోకూడ దస్తూరీనిచూచి పిల్లనివ్వడము అను పూర్వాచారమును ఒల పరచడంలో అర్థమేమీ లేదు. పెండ్లికొడుకు పిల్లని చూచుకొనుటకు వచ్చుట ఒక దురభ్యాసమనియు, విధిగా వచ్చినవారు పెండ్లికూతురికి అనేక వంకలుపెట్టుదురని వ్రాశారు. కాని పెండ్లికొడుకు వచ్చిన తరువాత పెండ్లికూతురువిటకారము గా అనే మాటలుమాత్రలు వ్రాయలేదు. అదీ గాక యిటువంటి పెండ్లి పరీక్షలో బి.ఎ. పాసయిన అమ్మాయికూడ నెగ్గడం కష్టమని వ్రాశారు. బి.ఎ పాసయినంతమాత్రాన ఆ అమ్మాయి రంభఅని ఎట్ల చెప్పగలము? ఆమె గుణగణములు సరియైనవని ఋజువేమిటి? ఇటువంటివి ఏమీ ఆలోచించకుండా వ్రాయుట యెంతమాత్రము సబబుగా లేదు.

చదువు ఉద్యోగంకోసం మాత్రమే గాదనియు, సంగీతం నేర్చుకొనినంత మాత్రాన గానసభలు చేయునవసరము లేదనియు, అవి కేవలము ప్రపంచజ్ఞానము కోసం మాత్రమేనని రచయిత్రిగారు గ్రహించుట మంచిది.

లలితాదేవిగారు వ్యాసములో విపరీతమైన పెండ్లిఖర్చులగురించి, నిరాశ చెందిన అమ్మాయిల రెండవవివాహముగురించి, కట్నంకొరకు అందరలేనివార్ని వివాహము చేసుకొనుట - యిటువంటి విషయములలో అంగీకరించకతప్పదు.

కె. వెంకటేశ్వరరావు, కాకినాడ.

* * *

ఈ మధ్య సోదర సోదరీమణులు 'పెళ్ళి' అనే విషయంమీదే ఎక్కువగా వ్యాసాలు వ్రాస్తున్నారు. అంటే: పెళ్ళికాని అమ్మాయిల హాహా- పెళ్లా, మీ అమ్మాయి పెళ్లెప్పుడు?, పెళ్లి అంటే తుళ్లిపడే పరిస్థితులు మొదలగునవి. పెళ్లి అనే విషయం మీద తప్పించి ఇంక ఇతర విషయాలమీద వ్యాసాలు వ్రాయుడం చేతకాదా? ఇంకే వ్యాసాలూ కనబడలేదా? ఎంతసేపూ పెళ్లి - పెళ్లి అనే గొడవేనా? ఇకముందు పెళ్లి అనే విషయంమీద వ్యాసాలు వ్రాయవద్దని నా మనవి

"పేరంటానికి రండి" అనే వ్యాసము చాలా బాగుంది.

మిస్ ముంతాజ్ బేగం, కాకినాడ. ★

# ★ కల్యాణ స్మృతులు ★

(13 - వ పేజీ తరువాయి)

అంతటి కొంటె మనిషి కూడా. కాలేజీలో అతడంటే విద్యార్థినులకు కోపం. ముఖ్యంగా విజయకు — తనని సారస్వత సంఘానికి సెక్రటరీ కాకుండా చేశాడని–భానుమూర్తి మీద తగని క్రుధ. ఇక కృషి పట్టి వీళ్ళంతా సమయం చిక్కినప్పుడల్లా భానుమూర్తిని విమర్శిస్తుండేవాళ్లు. ఇదెలాగో భానుమూర్తికి తెలిసినట్టుంది...ఆ సంవత్సరం పబ్లిక్ పరీక్షలు నెలరోజులున్నాయనగా 'కల్చరల్ వీక్స్' జరిగాయి. ప్రతి యేటా చాలా ఘనంగా జరుగుతాయి. ఆ సంవత్సరం ఆహ్వాన పత్రాలు కూడా చాలా ఆకర్షణీయంగా అచ్చు వేయించారు. అందులో మొట్టమొదటి రోజు వైస్ ఛాన్సలర్ ఉపన్యాసంవుంది. అయితే భానుమూర్తి ఆ రోజు ఆహ్వాన పత్రంలో, 'ప్రార్థన: మిస్. డి. విజయ' అని వేయించాడు. పాపం, విజయకు వాగ్ధోరణయితే వుందిగాని, కంఠం మెత్తితే కీచురాళ్ల ధ్వనికన్నా అధ్వాన్నం! ఈ సంగతి తెలిసే భానుమూర్తి ఇలా చేశాడు. విద్యార్థులంతా ఇది చూసి "ఓహో, ఈ రోజు లతా మంగేష్కర్ ప్రార్థన గావిస్తుందా?...సరిసరి. వచ్చే వాళ్ళంతా చెవుల్లోకి దూది, తలకాయకు 'నో పెయినూ' సిద్ధం చేసుకు మరీ రండి" అని గోల!...ఈ బాధ భరించలేక విజయ ఆ రోజు సెలవు పెట్టింది. మీటింగుకు హాజరు కావలసి వస్తుందని! ఈ అవమానంనుంచీ సరిగ్గా కోలుకోలేక, 'కల్చరల్ వీక్సు' కూడా సరిగ్గా హాజరు కాలేకపోయింది..."ఇలా జరిగిందని ప్రిన్సిపాలుతో చెప్పు" అని తోటి విద్యార్థినులు సలహాయిస్తే "దేనికి? ఆ రోజు కళ్యాణివెళ్ళి నిర్వాకం చేసుకొచ్చింది చాలు." అంటూ వుడికిపోయింది విజయ

భానుమూర్తి చేసే కొంటె పనులు లెక్చరర్లు కూడా అడ్డుపెట్టి మందలించే వాళ్లు కాదు. చాలామందికి అతడంటే నెత్తిమీద దేవత! విద్యార్థులు కూడా తెగ గౌరవించే వాళ్లు అతన్ని! అతడి ముఖంలో ఏదో ఆకర్షణ — తెలియని శక్తి — వుంది. దాన్నుంచి ఎవ్వరూ తప్పుకోలేరు. ఆ ముఖం చూస్తే అతడితో మాట్లాడాలనీ, మరోసారి మాట్లాడి స్నేహం చేసుకోవాలనీ బుద్ధేస్తుంది!

పరీక్షలై సెలవులిచ్చారు. కాని పరీక్షల్లో బాగా చదవటంవల్ల, పరీక్షలు పూర్తయినరోజే భానుమూర్తికి సన్నగా జ్వరం వచ్చింది.

తనకు చాలా భయమేసింది. మనసులో కలతరేగింది, ఎందుకీ మనోవ్యాకులత? అతడికీ తనకూ ఏమిటీ ఆత్మానుబంధం? ఇది స్త్రీ హృదయానికి సహజమైనమార్దవప్రభావమా? లేక–?......

మళ్ళీ తనకు ధైర్యంతో జవాబు చెప్పుకుంది. తోటిమనిషి ఒకడు — తన ఆత్మీయులూ, ఆప్తులూ దగ్గర లేనప్పుడు జ్వరంవచ్చి బాధపడుతుంటే, వెళ్లి సాయపడటానికి ఇన్ని ఆలోచనలేమిటి?

ఇది సహజమైన హృదయమార్దవమే— అనుకుంది.

వెళ్లి నాన్నతో చెప్పింది. ఆయనకూడా ఆదుర్దా కనబరుస్తూ, "అరె! అలాగా?... అమ్మాయీ, నువ్వువెళ్లి పలకరించి ఎలా వుందో అడిగిరామ్మా! వెళ్లి ఏంకావాలో తెప్పించివ్వు. ఈ రొంపలో ఆ తలతిక్క మనిషి హోటలుకు పడిపోతాడేమో, వద్దని చెప్పు. అమ్మతో చెప్పి పథ్యం చేయించి, వెంకన్నను వెళ్లి డాక్టరు సాంబశివరావుగారిని తీసుకురమ్మను ... త్వరగా వెళ్ళమరీ ..." అన్నాడు.

తనకు కొండెక్కినంత సంతోషమూ, ధైర్యమూ కలిగాయి ఇంతకుముందు, తను ఒక్కతే వెళ్లితే ఇంట్లోవాళ్లేమనుకుంటారోనని భయపడింది. ఇప్పుడా భయం తీరిపోయింది.

తను వెళ్ళేసరికి భానుమూర్తి పడుకుని వున్నాడు. లేవలేదు. తను కదిలించితే మెల్లగా కళ్లు తెరిచి చూశాడు. ఒంటిమీద చెయ్యివేసి చూసింది. తెగ మసిలిపోతోంది.

"ఎలా వుందండీ?" అంది.

"మరేం లేదులెండి. ఏదో వేడిచేసినట్టుంది." అని నీరసంగా మూలిగి "తలనొప్పి జాస్తిగా వుందండీ" అన్నాడు.

తను తనిచేత అమృతాంజనం తెప్పించి రాచింది. ఓ పావుగంటసేపు నుదురుమీద అలాగే రుద్దుతూ కూచుంది. కాస్సేపటికి డాక్టరుగారొచ్చారు. ఆయన భానుమూర్తికి టెంపరేచరు చూసి, పరీక్షల్లో ఎక్కువగా చదవటంవల్ల వేడిచేసిందనీ, అంతకంటె మరేంలేదనీ చెప్పి మందిచ్చి వెళ్ళిపోయారు. జ్వరం తగ్గేవరకూ భానుమూర్తికి తనే పథ్యం తీసుకెళ్ళి ఇచ్చింది.

జ్వరంతగ్గాక ఓరోజు మధ్యాహ్నం, తను వెళ్ళినప్పుడు భానుమూర్తి ఏదో మేగజైను చదువుతోంటే, "జబ్బుపడ్డవాళ్ళిలా చదివితే మెంటల్ వీక్‌నెస్ వస్తుం"దని మందలించి ఆ మేగజైను తను తీసుకువచ్చేసింది.

భానుమూర్తి వూరికి వెళ్ళేముందు ఓరోజు అతన్ని తమయింటికి భోజనానికి పిలిచాడు నాన్న. ఆరోజు తనే మార్కెట్టునుంచి కూరలూ అవీ తెప్పించింది. ఆ పూట భోజనాలదగ్గర కళ "నేను మా మేష్టరుపక్కన కూచుంటా"నని మారాం పెట్టింది.

'ఒద్దు. తప్పు" అంది తను.

"ఆఁ! వద్దేం? మరి నువ్వు కూచుంటావా?" అన్నదాపిల్ల వెక్కిరింపుగా. అంతానవ్వారు. అప్పుడు తనముఖం కందగడ్డలే అయిపోయింది. ఆ మర్నాడే భానుమూర్తి వూరికి వెళ్ళిపోయాడు. వెళ్ళేటప్పుడు తన అడ్రసు రాసిచ్చి వెళ్ళాడు. సెలవుల్లో అతడు రెండు మూడు ఉత్తరాలు కూడా రాసినట్టు గుర్తు.

ఆ తరువాత కొద్దిరోజులకు—తాను తన వివాహ నిశ్చయాన్ని వెల్లడించినప్పుడు

# ★ కల్యాణ స్మృతులు

అందరూ ఆశ్చర్యపోయారు. "నీ ఆదర్శాలన్నీ యేమయినయ్?" అన్నారు. లెక్చరర్ కామేశ్వరమ్మ మరీను, "ఇదేమిటే కల్యాణీ?...మరి నీ ఆశయాలూ, ఫేషన్లూ, హక్కులూ వీటి గతేం కాను పాపం?... అయినా యీ కుర్రాడింత కాలాంతకుడనుకోలేదు సుమా!" అన్నది.

తను బదులు చెప్పలేదు. అమ్మ సుతరామూ యిష్టపడిపోయినా, విజయా తగ్గరా స్నేహితురాళ్లంతా "ఓ సీవ్, అతడు స్టూడెంట్సు యూనియన్‌లోనే మనకు ప్రాతినిధ్యం లేకుండా చేశాడే...ఇక నీ ఆదర్శాలన్నీ ఏం చేస్తాడో!" అని వేళాకోళం చేసినా,—తనమాటే తనది. చిన్నాన్న కూడా తన పక్షమే అయ్యాడు. "దాని ఇష్టం దానిది—ఇంత చదువు చదువుకున్న దానికి మనకున్నంత జ్ఞానం లేకపోలేదు. ఇక మీ గొడవలు చాలించండి. నేను రేపే ప్రయాణమై వెళ్లి వాళ్ల పెద్దవాళ్లతో మాట్లాడుతాను." అన్నాడు.

అమ్మో! మరి భానుమూర్తి మాత్రం సామాన్యుడా? "నేను ఫలానావాళ్ల కల్యాణిని తప్ప మరొకర్ని చేసుకునే పక్షంలో కాఫీ మానేస్తా"అని వాళ్ల వాళ్లతో తెగేసి చెప్పేశాడట; నాన్న చెప్పాడు. అప్పుడు తనెంత ఆశ్చర్యపోయింది, "ఆ 'రాతిగుండె మనిషి' ఇంత మంచివాడేమిటా?" అని!

వెంటనే కబురు తెప్పించి ఈ వివరాలన్నీ అక్కయ్యకు జాబు రాసింది. అందులో 'పరాగ్గా—"వారంగోజుల్లో శుభలేఖలు అందుకోగలరు" అని రాసింది.

వెంటనే బదులు వచ్చింది...దాన్లో విశేషాలేవీ లేవు గాని, ఓ అందమైన బావగారి సిన్ స్టేట్‌మెంట్ వుంది, భానుమూర్తిని గురించి: "ఆ కుర్రాడెవడో నేనీ సంవత్సరంలోనూ చూశాను అయినా ఘటికుడు లాగే వున్నాడు. ఇరవైరాళ్ల గాయి పిల్లకు గాలం వేసిన ఆకుర్రాడికి, ఈ అన్నగారి హృదయ పూర్వక అభినందనలు." అని రాశాడు.

నిజమా? భానుమూర్తి తనకు గాలం వేశాడా? - అవును. అయితే ఆ కాలాంతకుడు బయట పడలేదు!... భానుమూర్తి "నేను నమ్మిడీ కట్నం పుచ్చుకోను" అన్నాడని విన్నప్పుడు, "ఆ 'రాతిగుండె మనిషి' కూడా ఆదర్శాలున్నాయన్న మాట!' అని తాను ఆశ్చర్యపడ్డది!

తరువాత — ఏముందీ — ఆకాశమంత పందిట్లో కామేశ్వరమ్మ, శర్మగార్ల యాజమాన్యంలో, దైవజ్ఞ సాన్నిధ్యంలో మంగళ వాద్యాలమధ్య — ఆ భానుమూర్తి అనే కుర్రాడితో తనకు శాశ్వత దాంపత్య జీవన బంధంగా, ఓ కల్యాణబంధం!

"అమ్మ! ఇక అతడు నీకనుమాపుల్లో మెలుగుతాడుగా! ఇకనైనా మనకు సారస్వత సంఘంలో ప్రాతినిధ్యం సంపాదిస్తావా?" అంది విజయ.

తను నవ్వింది

"ఎబ్బే...నో నో" అన్నాడు భాను.

"మేష్టారూ! పైపైవేటుగా రమ్మంటూ రండీ!" అంది శశి

'గాకుంటే విపు మోత మోగుతుంది. నీకూ, నీతో బాటు—" తనవేపు చూసి కొంటెగా నవ్వాడు భాను—అంతా అలాగే ఆఫోటోలో లాగే!—

...కల్యాణి ఆలోచనలకు ఫుల్ స్టాప్ పడింది. అలాగే ఫోటో వేపు చూస్తూ నిల్చుంది.

"అబ్బబ్బబ్బబ్బా!... సినిమాల్లో గజకుమారిలాగా ఎంతసేపు చూస్తావే ఆ ఫోటో వేపు?"

వెనక్కు తిరిగి చూసింది కల్యాణి... విజయ!

వెళ్ళి కౌగిలించుకుంది

"ఎన్నాళ్ళకు ఆ ఫోటోలోని మనిషే నీవాడైనాడు దా!...ఇంకా ఎందుకు చెప్పు ఆ ఫోటో వేపు అలా చూస్తావ?" అంది విజయ

"నీ కోణంగి మాటల కేమొచ్చెలేవే... మరి భానూ యేడీ?"

"భానా?...ఎవరో అమ్మాయి సైకిల్‌లో—తన భర్తే అనుకుని భానూను తీసుకుపోయింది."

విజయ పెట్టె బెడింగూ పట్టించుకుని భాను లోపలికి వచ్చాడు

"గాడిదగుడ్డు మీ ఆవిడ కాదు! ఇన్నాళ్ళు నెలపుగా నేనిక్కోట్టా వస్తే 'కాసిని కాఫీనీళ్ళు తాగుతావా?' అనైనా అడగలేదూ...పైగా 'మా భానూను ఏం చేశావ్'అని గదమాయిస్తోంది!..."

అంది విజయ.

మధ్యాహ్నం ఫ్లాస్కులో పోసిపెట్టిన కాఫీ తీసుకురావటానికి లోపలికి వెళ్ళింది కల్యాణి. ★

# ★ ప్రాజెక్టులు, పరిశ్రమలు

9 వ పేజీ తరువాయి)

ప్రాజక్టువలన 14,000 ఎకరాలకు క్రొత్తగా నీటి వసతి లభిస్తుంది.

ఆంధ్రప్రదేశ్‌లో చిన్నా పెద్దా అన్నీ కలిపి, రెండవ ప్రణాళిక క్రిందకు వచ్చేవి మొత్తం 34 ప్రాజక్టులు - ఇవి (1) నాగార్జునసాగరం (2) నారాయణపురం పథకము (3) నాగావళి ప్రాజక్టు (4) వేగావతి ప్రాజక్టు (5) సీతానగరం ప్రాజక్టు (6) వక్కలగడ్డ ప్రాజక్టు (7) పాలేరు ప్రాజక్టు (8) ఉప్పుటేరు ప్రాజక్టు (9) కాంగి ప్రాజక్టు (10) మల్లిమడుగు ప్రాజక్టు (11) లోయర్ సాగిలేరు ప్రాజక్టు (12) ప్రాంగా ప్రాజక్టు (13) కె. సి. కెనాల్ పునర్నిర్మాణ పథకము (14) భీమవల్లి ప్రాజక్టు (15) కోయిల్ సాగర్ ప్రాజక్టు (16) సరళాసాగర్ ప్రాజక్టు (17) మూసీ ప్రాజక్టు (18) సిరలా ప్రాజక్టు (19) తుంగభద్రా రైట్ బాంక్ లోయర్ లెవెల్ కెనాల్ (20) ప్రకాశం బారేజ్ (21) భైరవాని తిప్ప ప్రాజక్టు (22) ఎగువ పెన్నార్ ప్రాజక్టు (23) రాళ్లపాడు ప్రాజక్టు (24) రాజోలి బండ ప్రాజక్టు (25) కడెం ప్రాజక్టు (26) పాలేరు బిట్రగుంట ప్రాజక్టు (27) పైడిగాం ప్రాజక్టు (28) తోట్రిగడ్డ పంపింగ్ స్కీము (29) జటాపల్లి ప్రాజక్టు (30) లక్ష్మీపురాగు ప్రాజక్టు (31) సువర్ణ ప్రాజక్టు (32) దొరపల్లివాగు ప్రాజక్టు (33) తాండవ రిజ్

యుగ ప్రాజక్టు (34) తుంగభద్రా హై లెవెల్ కెనాల్ ప్రాజక్టు.

ఇన్ని ప్రాజక్టులుండగా మనకేం లోటు ఉండడానికి వీలులేదు. పై వాటియందు చాలమటుకు చాలా చిన్న ప్రాజక్టులు, భారీప్రాజక్టుల నిర్మాణమంతా ముందే ఉంది. ఏది ఏమైనా రామపాదసాగరం ప్రాజక్టు అవతరించకుండానే అంతరించడం ఆంధ్రులకు తీరని లోటు. ఎన్ని నిర్మాణాలు జరిగినా ఆ లోటును భర్తీచేయలేవు.

## పరిశ్రమలు

ఇక మన పరిశ్రమల విషయం పరిశీలిద్దాం. ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల అభివృద్ధికి చాలా అనువైన ప్రదేశం. అయినప్పటికి పరిశ్రమల విషయంలో మనం చాలా వెనుకబడానికి – ముఖ్యకారణం ప్రభుత్వానికి, ప్రజలకీ, పెట్టుబడి పెట్టకలిగిన సామర్థ్యం లేకపోవడమే. ఇక కేంద్రప్రభుత్వానికి, తెలుగువారికి పరిశ్రమలేమిటి? అన్న భావం ఏనాడో కలిగింది, ఆంధ్రప్రదేశ్ పరిశ్రమలలో ఎల్లాగా వెనుకబడింది కనుక...మనం ఎక్కువ పెద్ద గ్రాంటుని సహాయం ఎలాగా చేయలేం కనుక, ఏదో కొద్ది కొద్దిగా గ్రాంట్లను ఇస్తే సరిపోతుందని వారి భావమేమో! ఇంతటి విస్తృత రాష్ట్రానికి, ఇన్ని అవకాశాలు కల రాష్ట్రానికి ద్వితీయ పంచవర్షప్రణాళికను మొత్తం అంతా కలిపి పరిశ్రమలవృద్ధికై కేటాయించిన సొమ్ము రూ 14.45 కోట్లు మాత్రమే. ఈ కేటాయింపు విషయంలో మనం ఇంక ఏమనుకున్నా లాభంలేదు కాబట్టి ఉన్నదానిని సక్రమంగా వినియోగించుకోవాలి.

## సిమెంటు

ఆంధ్రరాష్ట్రపు ప్రధాన పరిశ్రమలు సిమెంటు చక్కెర పరిశ్రమలు. సిమెంటు పరిశ్రమకు కావలసిన ముడిపదార్థాలు సున్నపురాయి బంకమన్ను మనరాష్ట్రంలో అతి చౌకగా లభిస్తాయి. ఆదిలో కృష్ణానది ఇరువంకలా ఆంధ్రా, కృష్ణా సిమెంటు ఫ్యాక్టరీలు వెలిసేయి. అప్పట్లో ఈ రెండు ఫ్యాక్టరీలు కలిసి మొత్తంసాలుకు 85,000 టన్నుల సిమెంటుని మాత్రం ఉత్పత్తి చేయగలిగేవి. క్రమంగా ఇవి ఉత్పత్తిని పెంచసాగాయి. ప్రణాళికలందు భారీప్రాజెక్టుల నిర్మాణానికి సిమెంటు అత్యవసరవస్తువు కనుక వీటి ఉత్పత్తి బాగా పెరిగింది నేడు కృష్ణా సిమెంటు ఫ్యాక్టరీ 2.5 లక్షల టన్నులను, ఆంధ్రా సిమెంటు ఫ్యాక్టరీ 2.0 లక్షల టన్నులను సాలుకు ఉత్పత్తి చేస్తున్నాయి. అయితే సిమెంటుకి నేడు దేశంలోగల రాకీని బట్టిచూస్తే ఈ ఉత్పత్తిమనకి ఏ మూలంగాను సరిపోదు. దీనిని గురించి ప్రభుత్వం క్రొత్తగా ఏడు సిమెంటు కర్మాగారాలను అనుమతి ఇచ్చింది. వీటియందు కొన్నిటి నిర్మాణం పూర్తి అయాయి. సంవత్సరానికి 1.88లక్షల టన్నుల సిమెంటు నుత్పత్తి చేయగల మాన్‌చర్ల సిమెంటు ఫ్యాక్టరీ, 1 లక్ష టన్నుల సిమెంటును ఉత్పత్తిచేయగల కమలాపురం, ఎర్రగుంట్ల, సాలూరు, నడికూడి ఫ్యాక్టరీలు, 0.636 లక్షల టన్నుల సిమెంటును ఉత్పత్తిచేయగలిగిన పాణ్యంసిమెంటు ఫ్యాక్టరీ, 0.56 లక్షల టన్నుల సిమెంటుని ఉత్పత్తిచేయగల మాన్‌చెరియల్ సిమెంటు ఫ్యాక్టరీ ఈ పథకం క్రిందకు వస్తాయి. ఈ విధంగా మనరాష్ట్రంలో సిమెంటు పరిశ్రమ బాగా వృద్ధిపొందుతోంది. క్రొత్త రకాల సిమెంటు తయారుచేయడానికి ముమ్మరంగా పరిశోధనలు జరుగుతున్నాయి.

## పంచదార

ప్రస్తుతం మనరాష్ట్రంలో 12 పంచదార ఫ్యాక్టరీలు ఉన్నాయి. ఒక పంచదార ఫ్యాక్టరీ పరిమాణాన్ని అది దినానికి ఉపయోగించగల చెరకుపరిమాణంతో కొలుస్తారు. దీనిని "క్రషింగ్ కెపాసిటీ" అంటారు. మన రాష్ట్రంలో అన్ని కర్మాగారాలు కలిపి మొత్తం క్రషింగ్ కెపాసిటీ (సి.సి.) 12,200 టన్నులు. ఇప్పుడున్న పంచదార కర్మాగారాలన్నింటిలో పెద్దది నిజాంషుగర్ ఫ్యాక్టరీ దీని శక్తి 3200 – 3500 సి. సి. మధ్య ఉంటుంది. ఈ ఫ్యాక్టరీ తరువాత క్రమంగా పేర్కొనదగినవి—ఉయ్యూరులోని కె. సి. పి. షుగర్స్ (2,500 సి సి.) లక్ష్మీపురంలోని చల్లపల్లి షుగర్ ఫ్యాక్టరీ (1,000 సి. సి.) తణుకులోని ఆంధ్రా షుగర్ మిల్సు (1,000 సి. సి.) నాగవరంలోని వి. వి. ఎస్. షుగర్స్ (1,000 సి. సి.) పిఠాపురంలోని కిర్లంపూడి షుగర్ మిల్సు (900 సి. సి.) సామర్లకోటలోని దక్కన్ షుగర్ అబ్కారీ ఫ్యాక్టరీ (700 సి సి.) దార్లపూడిలోని ఏటికొప్పాక షుగర్ మిల్సు (600 సి. సి.) బొబ్బిలిలోని శ్రీరామా షుగర్ మిల్సు (450 సి. సి.) అనకాపల్లిలోని షుగర్స్ అండ్ రిఫైనరీస్ (450 సి. సి) తణుకులోని లక్ష్మీ షుగర్స్ (300 సి. సి.) సీతానగరంలోని శ్రీరామా షుగర్స్ (300). నానాటికీ పంచదారకు గిరాకీ అధికమైపోవడంవలన రెండవ ప్రణాళికలో క్రొత్తగా ఎనిమిది ఫ్యాక్టరీల నిర్మాణానికి అనుమతినిచ్చారు. ఇవి కైకలూరు, రామచంద్రపురం, శ్రీకాకుళం, హిందూపురం, పాలకొల్లు, చిత్తూరు, చోడవరం, మరక్‌నగర్ లలో నిర్మితమౌతాయి. వీటియందు అయిదు ఫ్యాక్టరీలు సహకారసంఘాలచే నడిపింపబడతాయి. అయితే వీటిలో కొన్నింటికి మాత్రమే విదేశీమారక ద్రవ్యం లభ్యం కాగలదు.

## బొగ్గు

1871 వ సంవత్సరంలో భారత భూగర్భ శాస్త్ర సంఘానికి చెందిన డా॥ కింగ్ అనే ఆయన ఎల్లెందువద్ద బొగ్గుగనులను కనిపెట్టినప్పటినుండి నేలబొగ్గు పరిశ్రమ క్రమంగా వృద్ధిపొందుతోంది మన రాష్ట్రంలో. ఇపుడు ప్రభుత్వ యాజమాన్యాన పురోగమిస్తున్న సింగరేణి కాలియరీస్ కంపెనీ అధీనంలో క్రొత్తగూడెం, యల్లెందు, తాండూరు అనే చోట్ల మూడు గనులున్నాయి. వీటియందు మొత్తం 1,326 మిలియను టన్నుల బొగ్గు కలదని అంచనావేసేరు. మొదటి ప్రణాళిక పూర్తిఅయేసరికి 15.26 లక్షలటన్నుల బొగ్గు ఉత్పత్తి అయింది. దీనికి రెట్టింపు బొగ్గు రెండవప్రణాళికాంతానికి ఉత్పత్తి కాగలదు. సింగరేణి కాలియరీస్ కంపెనీని త్వరలో నే చిన్నూరు, సం పల్లి, కొర్లపల్లి, లింగాల, దామెరచర్ల, కనిగిరి గ్రామాలలోని బొగ్గు గనులకు కూడా విస్తరించడానికి పథకాలు తయారయాయి.

ఆంధ్రప్రదేశ్ లో కాగితపు పరిశ్రమ ఇంకా ప్రారంభదశలోనే ఉంది. సిరిపూర్ కాగితపు మిల్లులో రూ 2.5 కోట్లతో దినానికి 100 టన్నులు కాగితం తయారయ్యేట్టు చేసేందుకు నూతన పథకాన్ని అమలులో పెట్టేరు. బోథన్‌లోని న్యూస్ ప్రింటు కర్మాగారంలో రూ 5, 6 కోట్ల వ్యయంతో అభివృద్ధి జరుగుతోంది. రాజమండ్రి పేపర్ మిల్సులో ఉత్పత్తిని 10 టన్నులనుండి 40 టన్నులకు పెంచేందుకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. తిరుపతిలోని పేపర్ ఎండు స్ట్రాబోర్డు ఫ్యాక్టరీని వేలంపాటలో రూ 10.35 లక్షలకు ప్రభుత్వం కొని అభివృద్ధిచేస్తోంది.

మన రాష్ట్రంలో మొత్తం వస్త్ర పారిశ్రామిక కేంద్రాలు పదిహేను ఉన్నాయి. సాలుకు 4 కోట్ల రూపాయల విలువచేసే వస్త్రోత్పత్తి ఇచట జరుగుతుంది. జనపనార మిల్లులు కూడ నాలుగున్నాయి వీటికి అభివృద్ధి పథకాలు తయారవుతున్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద అనేక నూతన కర్మాగారాలు నిర్మితమౌతున్నాయి. వీటన్నిటియందు 30 కోట్ల రూపాయల వ్యయంతో నిర్మింపబడనున్న ఎరువుల ఫ్యాక్టరీ ముఖ్యమైనది. బోధన్ పవర్ ఆల్కహాల్ ఫ్యాక్టరి గరివిడిలోని ఫెర్రో మాంగనీస్ ఫ్యాక్టరి, బెల్లంపల్లి రసాయనాల ఉత్పత్తి ఫ్యాక్టరీ, గూడూరు సిరమిక్ (పింగాణీ) ఫ్యాక్టరీ, కూడ చెప్పుకోదగినవి. ఇవి కాక ఇంకా అసంఖ్యాకమైన గ్రామీణ, చేతి పరిశ్రమలకు మన రాష్ట్రం కూడలి స్థానం. ★

## చిత్ర సమీక్ష

## పెద్దకోడలు

పెద్దకోడలు, కథారంభకాలానికి పెద్ద కోడలు కాదు ఏమంత పెద్దకోడలూ కాదు ఆయింటికి వచ్చిన కొత్తకోడలు. పండరీబాయిలా నిండుగా, పందనంగా, టీకీగా ఉండే చక్కటి చిన్నకోడలు. ఆమె కాపరానికి వచ్చేసరికి ఇల్లు గుల్ల కావడానికి అన్ని హంగులూ సిద్ధంగా ఉంటాయి. క్లబ్బు, పేకాటలమీద మోజుగల భర్త, ఎంత చదువుకున్నా సంస్కారవతిగా ఉన్న భార్యను ఈసడించుకో, అందుకు విరుద్ధంగా బొంబే ఫిలింలో వకీలీ నైట్ క్లబ్ నాటీలా వున్న అన్యకన్యను ఆరాధిస్తూ, భార్యను మూడు నెలలలోగా విడాకు లిచ్చి పొమ్మంటాడు.

మరోవంక మరిది మంచి వాడే అయినా, తీరిక వేళల్లో చితుగా తాగి బాక్సాఫీసు చెప్పలు చేస్తాడు మామగారు జూదరి. పేకాట వికులతో డబ్బు ఖర్చు పెడతాడు. అత్తగారు దొంగసాధువుల సజ్జును కొంపలో పోగేసి వారికి అల్లుడ మర్యాదలు చేస్తూ వుంటుంది నౌకరు కింకుచేతులా దోచుకుంటారు. ఈ స్థితిలో ఇన్ని చిక్కులమధ్య, మనువాడిన వాడిని తనవాడిని చేసుకోడానికి మూడు నెలల గడువుతో ఆ పెద్దయింటి పెట్టుమీద నిలబడ్డ పెద్దకోడలు, ధైర్యంతో ఓరుపుతో ఆమె కుశలతో అందరినీ మంచిగా వంచించి మంచి మార్గానికి తెస్తుంది. భర్తకు తనమీద ఎంతకోపం వున్నా, ఒక్కమాట అనడానికి వీలేనంత నిస్సహాయుణ్ణి చేస్తుంది తన మంచితనంతో. ఇంకా కొన్నాళ్ళుంటే ఆయన నెరశ్రేవాడేమో అప్పు తప్పవారి మారేవాడు కావచ్చుననిపిస్తూ ఉండగా అంతలో వాంప్ నూర్జహాన్‌కి కథమీదా అతనిమీదాకూడా విసుగెత్తి అతన్ని దగాచేసి ఇంకోకతో వెళ్ళిపోతుంది. పూర్తిగా భార్య దాక్షిణ్యం వల్ల కాకపోయినా అవతెలతను దగాపడడం వల్ల అతను కన్ను తెరచి వాలిక్కురచుకుని భార్యను ఏలుకుంటానంటాడు

ఇంత కథా నిజంగా ఇదేవిధంగా జరుగుతుందనడానికి ఏమాత్రం నదుపాయం లేకపోయినా, ధర్మానికి విజయం లభించడం అనేది ఇలా సాఫీగా మన కంటిఎదుట జరగాలని అందరికీ అనిపించేవిధంగా, వెన్నని జానపదాల కాశీమజిలీల పద్ధతిలో 'ఫెయిరీ టేల్స్' పరిమళంతో కట్టుకొచ్చి సమకాలీక వేషభాషలలో ముస్తాబుచేసిన ఈ చిత్రం తమిళంలో 'అన్బు ఎంగె' అనే పేరుతో తయారైంది. కల్పకరెడ్ ప్రొడక్షన్స్‌వారు దీనిని తెనిగించి 'పెద్దకోడలు' పేరిట నవంబరు 20 న విడుదల చేశాక ... తెలుగు యాసభాషా,

చిన్న అవకతవకలూ పట్టించుకోకుండా చూస్తే, చూసిన కాసేపూ హాయిగా ఉంటుందీ చిత్రం. కోడలుగా పండరీబాయి సమర్థంగా నటించింది. మిగతావారు పట్టు తగ్గకుండా కళ్ళా చేతులా నటించి, చాలాసేపు మాట్లాడినందువల్ల, ఈమె, రంగారావూ, చిన్నకోడలు ప్రమీల (దేవిక) ప్రదర్శించిన నటన, వారి మిథిభావన మరింత రాణించాయి. చాలా మాట్లాడి కూడా ఉత్సాహకరంగాఉన్న ఇద్దరు - హాస్యపాత్రధారి టి. ఆర్. రామచంద్రన్; అతనికి గాత్రధారి పేకేటి శివరాం.

ఈ చిత్రంలో ఆర్. బాలసరస్వతి ఒక పాటపాడింది.



వరలక్ష్మీ ఫిలింస్‌వారి కొత్త సాంఘిక చిత్రంలో గిరిజ.

## లండన్‌లో భారతీయ చిత్రాలు

లండన్‌లోని నేషనల్ ఫిలింథియేటర్‌లో వచ్చే వేసంగికి భారతీయ చలన చిత్రోత్సవం ఏర్పాటు చేస్తున్నారు.

సత్యజిత్‌రాయ్ చిత్రం జల్సాఘర్ ఇక్కడ ఆడవలసివున్నా, ఆచిత్రం ప్రతి చెడిపోయినందువల్ల, మంచిది తెలియ వచ్చే అవకాశం లేనందువల్ల ఈసారి చలన చిత్రోత్సవాలలో ప్రదర్శించ ఎంచ్చుకుంటారు. రాయ్ నాలుగో చిత్రం అపూర్ సన్సార్ ప్రస్తుతం అక్కడ ఆడుతోంది. చలనచిత్రోత్సవాలలో ప్రదర్శించడానికి 28 భారతీయ చిత్రాల జాబితా తయారుచేశారు.



"నమ్మినబంటు"లో నాగేశ్వరరావు, సావిత్రి.

## ఓ తేరా క్యా కహనా

వసం ఇంకా చాలా బాగుండవచ్చునని పించింది. ఇదె సమర్థులైన భక్తులగల బాక్సాఫీసు ముఖర్జీ యితే, బ్రహ్మాండమైన హిట్ చిత్రంగా తీసేవారనిపిస్తుంది. ఇన్నింటిలో పని చేసిన టెక్నీషియన్లు సాధ్యమైనంతవరకూ బాగా చేసినందువల్ల, వారంతా కొత్తవారూ ఇదంతా తొలి ప్రయత్నమూ అయినందువల్ల దీనిని హర్షించి ప్రోత్సహించడం వాంఛనీయం.

భారతీయ చలనచిత్ర సంగీతంలో మౌలికమైన, స్వచ్ఛమైన కొత్తసంగీతన్ని ప్రవేశపెడుతున్నట్లు కల్యాణ్ జీ-ఆనంద్ జీ గురించి ఇదివరకే పుకార్లు వచ్చాయి. ఈ మాట నిజమే అయితే కావచ్చునుగాని ఇందులో సంగీతం చేసినవాటికి వారా ప్రతిభను వెలువలచేసినట్టు కనిపించింది. ఎందుకంటే ఇది అద్భుతంగా లేదు. అయితే కొన్నే, భగవాన్ మహమూద్ ల హాస్యంలో పోటీచేసింది. ఒక వేళ ఇదికాదు, పట్టా బజార్ పాటలు విని చూసినంటే, అదీ వినిపూర్ణాము. అదీ వీరి ప్రతిభకు ముమ్మాటికి అయి వుండదు. ముఖ్యంగా ఏమైనా ఉంటే ఇక పోతే, ఇందులో నాయికా చిత్రానికన్న లభువించులా అవి చేసినందువల్లనూ, వర్తక కథకారుల వాటాగా ఉండటం మానేసి పోను పోను లావుపాటి కారెక్టర్ ఆక్ట్రెస్ కాగల ధోరణిలో నడుస్తున్నందువల్లనూ అటుతిరిగి ఇటు తిరిగి చిత్రం బరువంతా మళ్లీ మహమూద్ భగవాన్ల మీదకే ఒరిగింది. వాళ్లు సునాయాసంగా ఈ భారాన్ని నిర్వహించి సెబాసనిపించుకొన్నారు. మొగతావారిలో మహమూద్, భగవాన్, భగవాన్ మహమూద్ మహమూద్ భగవాన్ బాగా నటించారు. ఆ తరువాత, కనిపించింది కొనసేపే అయినా, లేనా మేకర్ ను చెప్పుకోవాలి. భగవాన్ బృందం లేనివేళల్లో హుషారుగా తిరిగి నవ్వించిన నయీంకే కూడా ప్రశంసనీయుడు. మహమూద్ గురించి మరొక్కమాట చెప్పుకోవలసి ఉంది. కిషోర్ కుమార్ ఒక్కడికే చెల్లే నవ్వే మాటలూ చేష్టలూ కొన్ని ఇతనికి ఒప్పగించారు. కిషోర్ అల్లరి కిషోర్ చేస్తేనే బాగుంటుంది అని నిర్మాతలు గుర్తించాలి. ఎవరికి ఎందులో ప్రావీణ్యం ఉందో వారిచే ఆ పని చేయించడం మంచిది తప్ప ఒకరినొకరు అనుకరించడం గొప్ప కాదు, బాగానూ ఉండదు.

మొత్తానికి, ఉత్తమ కళాఖండం అనేందుకు ఎంతమాత్రం వీలేకపోయినా, ఖులాసాగా కాలక్షేపం చేయడానికి తగిన చిత్రం 'ఓ తేరా క్యా కహనా'.

## గెస్ట్ హౌస్

గోల్డెన్ మువీస్ వారి 'గెస్ట్ హౌస్' బహుళ జనాదరణ పొందుతున్న, పాట లక్షణాలున్న చిత్రం. ఇందుకు ఒక ముఖ్య కారణం ఇందులోని సంగీతం. నెలల తరబడి రేడియోలో వినిపించి జనాన్ని ఆకట్టుకుని చిత్రం చూడడానికి ఆయత్తులను చేసింది.

మొగతా కారణాలు పట్టుకుండికి అంకవు మాటవరసకు ఇందులో కథ ఏమిటి? అని అడిగండి. కథ ఉందా అన్నది, లేదా-ఉన్నది కథాకీ అన్నదీ దానికి జవాబు. పుతాయి పాత మూసలో పోసి తీసిన (దీన్నే పరిభాషలో సంప్రదాయం అంటారు) ఈ చిత్రంలో, ఇందులోని సంఘటనలో-ఉన్నదేదీ మనసుకు పట్టదు. నీతితోడు ముఖ్య పాత్రకు పదిహేనో కళాబ్బపు సుగుణం ఒకటే—(సత్య వ్రతి!) అంటగట్టడంలో కథ హాస్యాస్పదంఅయిపోయింది. మనం రోజూ ఆలించి పాలించేది కాకపోయినా, సత్యంపట్ల మనకి ఉన్న గౌరవం కూడా దెబ్బతింటుంది. చివరకు సత్యమే జయము అని నీతి చెబుతున్నపుడు నవ్వు కూడా వచ్చేస్తుంది, కాలవైఖరిత్వాలు బాగా వంటపట్టించుకున్న వాడికి.

ఇందులో సత్యవాది, వాళ్లమ్మ చనిపోతూ ఉండగా ఎప్పుడూ అబద్ధం చెప్పనని ఒట్టు వేస్తాడు. నిజం చెప్పడంవల్ల వేలు బరులు ఇంత పెద్ద సినిమా కథ జరిగింది. అది పూర్తిఅయే వేళకు ఆపడంకోసం అంతా ఖులాసాగా ఉన్నట్టు చూపించినా మనం ఇంటికెళ్ళేలోగా ఆ పిల్లాడు మళ్ళీ నిజం చెప్పడం మొదలెడితే మళ్లా బోలెడన్ని సినీకష్టాలు కుప్పతిప్పలుగా ఇంకో సినిమాకు సరిపడే అన్ని విరుచుకు పడతాయనడానికేం సందేహం లేదు. ఈ నిజం చెప్పే వెర్రిబాగులవాడుగా అజిత్ నటించాడు. నిజానికి కెంగలో నటించడం ఏమీ ఉండదు. నిజం చెప్పేవాళ్ళు మనకి అడుగడుగునా కనబడటం లేదు. కాబట్టి, అజిత్ ఎలా నటిస్తే అదే సత్యవ్రతుడి రూపరేఖావిలాస చిత్రణ కావాలి. అజిత్ ఎలాగా నటించలేడు. అన్ని చిత్రాలకీ ఎలా నటిస్తున్నాడో దీనికీ అలాగే చేశాడు. బార్ దిల్ బార్ రహేలో అతన్ని చూసిన మీదట చాలా గౌరవం పెరిగింది. కాని ఇది

ఆ గౌరవం కొత్తగా ఏమీ పెరగ గస్ట్‌హౌస్ చిత్రంలో వకీలా, సినీ బ్రాణ్ చాలా బాగున్నారు. ద్దరూ తెరమీదఉన్నంతసేపూ,పక్కని తో ఉన్నాసరే చాలా బాగుంటుంది. తావారిలో మారుతి తృప్తికరంగా ం సరఫరా చేశాడు. హేలెనీస్ 'న్సులు పూర్వం అంత మనోహరంగా వు. ఆమె అభినయం ఎక్కువ అయి పోయింది.

గెస్‌హౌస్‌లో అన్నిటికన్న బాగున్నది, జనాన్ని ఆకర్షిస్తున్నదీ చిత్రగుప్త సంగీతం. దర్శకుడు రవీంద్రదవే 'పాటల రూపకల్పన ప్రతిభావంతంగా లేకపోయినా, పాటలు బాగున్నాయి. దర్శకుడు, ఇతర భాగాలను మాత్రం బాగా చిత్రించాడు. ఇంతకన్న మంచికథ దొరికితే ఇంతకన్న అందంగా చెప్పగలిగి ఉండే వాడనడానికి సందేహం లేదు.

—టచ్‌స్టోన్.

## కీ॥ శే॥ నిరంజన్‌పాల్

భారతీయచలనచిత్ర పరిశ్రమకు పూజనీయులైన వారిలో ఎన్నతగ్గ వ్యక్తిదర్శక రచయిత నిరంజన్‌పాల్ (బిపిన్‌చంద్రపాల్ కుమారుడు) నవంబర్ 9న, తన 69వ ఏట కాలధర్మం చెందారు. నిరంజన్‌పాల్ సినిమా తొలిరోజులనుండీ. ఉండి, ఆనాడు ఆది గౌరవ ప్రతిష్ఠ లార్జించడానికి పాటుపడిన బృందంలో ఒకరు. ఆదిలో చాలాచిత్రాలకు కథ, స్క్రీన్‌పై రచయితగా పనిచేశారు. అచ్యుత్ కన్య జీవన్‌ప్రభాత్ మొదలైనవి ఈయన రచనలే. 1925 లో వచ్చిన 'లైట్ ఆఫ్ ఏషియా' చిత్రానికి రచయితగా సహ దర్శకుడుగా పనిచేశారు. డాక్యుమెంటరీల పట్ల ఈయనకు విశేషమైన గౌరవాభిమానాలు ఉండేవి. 75 పైచిలుకు డాక్యుమెంటరీ చిత్రాలు తీశారు.

*  *  *

మెట్రో గోల్డ్విన్-మేయరువారు ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ దర్శకత్వాన నిర్మించిన "నార్త్ బై నార్త్‌వెస్ట్' హాలీవుడ్, న్యూయార్క్,వాషింగ్టన్‌నగరాలలో విడుదలయింది. విస్టావిజన్,టెక్నికలర్ చిత్రాన్ని చిత్ర విమర్శకులందరూ ప్రశంసించారు. "ఇటీవలి చిత్రాలన్నిటికంటే అది అత్యంత వినోదాత్మకంగా ఉన్నది" అని న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక సమీక్షకుడు వ్రాశాడు. 'శృంగారంతో సునిశిత హాస్యంతో అతివేగంగా సాగిపోతుంది' అన్నాడు, న్యూయార్క్ టైమ్స్ పత్రిక సమీక్షకుడు. సాటర్‌డే రెవ్యూ పత్రిక విలేఖరి ఇలా వ్రాశాడు: ఇదొక విచిత్రమైన కథ. ఒక న్యూయార్క్ అడ్వర్టైజింగ్ సంస్థ ఉద్యోగి (కారీగ్రాంట్) ని ఎఫ్. బి. ఐ. (ఫెడరల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్) ఏజెంట్ మనిషి అని పొరబాటుగా భావిస్తారు. అంతటితో కథ అడ్డం తిరుగుతుంది. ఒక విదేశీ వేగులవాళ్ళ జట్టు నాయకుడు (జేమ్స్ మాసన్), అతని భార్య (ఈవా-మేరీ సెయింట్), అనుయాయులూ గ్రాంట్ వెంటపడతారు. 'నార్త్ బై నార్త్ వెస్ట్" అనే పేరు కూడా హిచ్‌కాక్ సరదాగా పెట్టిందే, ఎందుకంటే అలాంటి దిశ దిక్సూచి (కాంపస్) లో అసలు కానరాదు. ★

# రాజధాని కబుర్లు

(4-వ పేజీ తరువాయి)

డానికి యత్నించినవారు మఖ్దూల్ అహ్మద్ జమాయ్. రాజీనామా చెల్లదంటారుఆయన. చెల్లిందని ఎన్నిక ప్రకటించింది కార్పొరేషన్. ఈ తగాదా ప్రధాన న్యాయస్థానం ముందుండడంవల్ల, ఇక్కడ చర్చించదగింది కాదు. ఎన్నికలు జరిగిపోయాయ్.

నగర కాంగ్రెస్‌లో విభిన్నదృక్పథాలుకల వ్యక్తులుండడంవల్ల, కాంగ్రెసు ఈ ఎన్నికల్లో అభ్యర్థుల్ని నిలకొల్పలేదు. ఇత్తెహాద్ కూడా నియోజకవర్గంలో ఇత్తెహాద్ సంస్థ అభ్యర్థుల్ని నిలకొల్పదామని యత్నించింది కాని తగినవాడు దొరక్కపోడంవల్ల శ్రీ అనంతరెడ్డిని బలపరచింది. అతనికి 1620 ఓట్లు వచ్చాయ్. అతని ప్రత్యర్థి శ్రీ శిర్వాల్ ఖాన్‌కు 891 ఓట్లు వచ్చాయ్. కాంగ్రెసులో కొందరువ్యక్తులు శ్రీ అనంతరెడ్డిని, అదికారణంగా మరికొందరు కాంగ్రెసీయులు ప్రత్యర్థిని బలపరిచారు.

శ్రీ జమాయ్ రాజీనామా చేయగా ఏర్పడిన దర్గా యూసిఫీన్ నియోజకవర్గంలో ఇత్తెహాద్ బలపర్చిన శ్రీ సిరాజుద్దీన్ 1089 ఓట్లతో నెగ్గారు. మిగిలిన అభ్యర్థులు ధరావతులు కోల్పోయారు.

ఈ ఎన్నికలు ఇత్తెహాద్‌కి విజయాలని భావించి, గందరగోళ పడవలసిన అవసరం లేదు. కాని ఈ ఎన్నికల్లో నియమబద్ధంగా పనిచేసి, తాముబలపర్చిన అభ్యర్థులు ఎన్నిక కావడం చూసేభాగ్యాన్ని ఇత్తెహాద్‌కి మిగిలిన రాజకీయపక్షాలు కల్పించాయ్. కాంగ్రెసును సమర్థించి ప్రయోజనంలేదని ఇత్తెహాద్‌ను సమర్థిస్తే కొట్టివిరిగి, మళ్ళీ, నేతిలో పడుతుందని భావించే అవకాశం మహమ్మదీయులకు ప్రభుత్వం, అధికారపక్షం కల్పించాయ్. కొన్ని వర్గాలకు లాభంకలిగేటట్టు చూడ్డం వాంఛనీయం కాకపోయినా, ఏ వర్గానికీ అన్యాయం కలక్కుండా చూడవలసిన బాధ్యత అనుభవజ్ఞులైన నాయకులది. ★

# చదరంగం

# ప్రజ్ఞాశాలి శ్రీ దీక్షిత్

శ్రీ జి. ఎస్. దీక్షిత్ పంద్రెండు సంవత్సరాల లేత వయస్సులోనే అత్యద్భుతమైన సామర్థ్యాన్ని ప్రకటించిన ధీశాలి. పాల్ మార్ఫీ, కేప బ్లాంకా (మాజీ ప్రపంచ ఛాంపియను) రెషెవ్స్కీలు ఈ వయస్సులోనే వారి ధీశక్తిని టోర్నమెంట్లలో ప్రదర్శించారు. జాతీయ ఛాంపియన్లుగా అగ్రస్థానం అందుకొన్నారు. అసమాన ప్రజ్ఞాశాలురైన బాలురని (Boy Prodigies) పేర్కొనబడుతూ ఉంటారు. టోర్నమెంట్లలో పాల్గొనకపోయినా, అదేవిధంగా ప్రతివారిమీదా వీరు యౌవనవయస్సులోనే జయం పొందారు.

అసామాన్యమైన ఆలోచనా బలాన్ని ప్రదర్శించే వ్యక్తిని జీనియస్ అంటాము. ఆయన ఆటల్ని చూచిన వారికి 'జీనియస్' అనే పదానికి నిర్వచనం వివరించనక్కరలేదు. అలెగ్జాండర్ అలెఖిన్ (మాజీ ప్రపంచ ఛాంపియను), రెటీ, స్పీల్మన్, నిమ్జోవిచ్, జనోవ్స్కీలు గతశకంలో ప్రముఖ నాయకులుగా ప్రఖ్యాతికెక్కారు. ప్రస్తుతంలో అంతర్జాతీయ రంగంలో గ్రాండ్ మాస్టర్స్, ఇంటర్నేషనల్ మాస్టర్స్, మాస్టర్స్ అనే శ్రేణులేర్పరిచారు. గ్రాండ్ మాస్టర్స్ శ్రేణిలో ప్రపంచ ఛాంపియను బాట్వినిక్, స్మిస్లావ్, బ్రాన్‌స్టీన్, టాల్, స్పాస్కీ కెరిస్ (ఇంకా రష్యన్లు చాలామంది వున్నారు). రెషెవ్స్కీ బాబీ ఫిషర్, శెకో (అమెరికనులు), ఏవే (మాజీ ప్రపంచఛాంపియన్ హాలండ్) మొదలుగాగల వివిధ దేశీయులు చాలామంది వున్నారు. శ్రీ దీక్షిత్ ఈ శ్రేణికి చెందినవారు. ఆటయొక్క ప్రాథమిక, మాధ్యమిక అంత్యదశలన్నిటిలోనూ అసమాన ప్రతిభులు. ఎప్పటికప్పుడు ఆటపరిస్థితుల్లో శిల్పాన్ని సృష్టిస్తారు. ఎప్పుడూ పెద్ద కాంబినేషన్ల మీదే వుంటుంది ఆయనదృష్టి. ఆయన అభిమాన గ్రంథం అలెఖిన్ ఆడిన ఆటల సంపుటులు. అలెఖిన్ విమర్శ 10, 15 ఎత్తుల్ని మించి వుంటుంది. పేర్చుకొంటూ అవగాహనం చేసుకోటం చాలా బాధాకరం. పేర్చుకోకుండా ఊహించటం కష్టం చాలామందికి కాని శ్రీ దీక్షిత్ పుస్తకం చేతులో చూచుకుంటూ ఆటని, అలెఖిన్ విమర్శని గ్రహిస్తారు. ఒకపరిస్థితిలో అలెఖిన్‌ని ఒకగుమి అభిమాన గ్రంథాలేమని అడగ్గా ఆయన "నేనే" "I am the book" అని సమాధానం యిచ్చేరు. భారతీయ బృందం అంతర్జాతీయరంగంలో పాల్గొనవలసి వుంది. అందులో శ్రీ దీక్షిత్ ప్రముఖస్థానం వహించవలసి వుంది.

ప్రాథమికంగా శ్రీ దీక్షిత్ ఫిలాసఫర్. ఎల్లప్పుడూ ఆధ్యాత్మికంగా ఒక ఉన్నత స్థాయిలో ఉండే వ్యక్తి. ఏ టోర్నమెంటుకీ ప్రత్యేకంగా కృషి చేయరు. జాతీయ అంతర్జాతీయ టోర్నమెంట్లలో పాల్గొనేముందుగా ఆయన కొంచెం కృషి చేయటం ఎంతైనా అవసరం.

గడచిన రాష్ట్రీయ ఛాంపియన్ షిప్‌లలోనూ నాల్గింటిలో ప్రథమస్థానం, 1959 వ పోటీలో ద్వితీయస్థానము పొందిన విషయం అందరకూ విదితమే. జాతీయ పోటీలలో, రెండుసార్లూ కూడా మూడవ స్థానం పొందారు. వీరు పాల్గొన్న అన్ని ఇతర టూర్నమెంటులలోనూ ప్రథమస్థానంలోనే వున్నారు.

తృతీయ జాతీయ ఛాంపియన్ షిప్ పోటీలో ఆయన అగ్రస్థానంలో వచ్చే అవకాశం ఆశ్చర్యకరమయిన విషయం కాదు. జాతీయ ఛాంపియన్ కాగల అవకాశం మిక్కిలి హెచ్చు. ఆయన ఆటశైలి సునిశితమై, సుదీర్ఘమైన గణనతో ఉంటుంది. ఎక్కువబలం కాపలాలోనే వుంటుంది. దీనికి కారణం ఆయన కాంబినేషన్లలోనే ఊహించటం.

ఈ క్రింది ఆట 2 వ జాతీయ ఛాంపియన్ షిప్ టోర్నమెంటులోనిది. ఫ్రెంచి డిఫెన్స్.

| | తెలుపు | నలుపు |
|---|---|---|
| | ఎ. జి. మల్గోంకర్ | జి. యస్. దీక్షిత్ |
| 1. | బ—రా 4 | బ—రా 3 |
| 2 | బ—మ 4 | బ—మ 4 |

దీక్షిత్ ఫ్రెంచి డిఫెన్సును ఎంచారు. ఒకటి రెండు నలుపు ఎత్తులో ఈ డిఫెన్సు ప్రారంభం. ఇంకా తెలుపుబలం రాజుబంటును రా 5 లో పాతవచ్చు. దాన్ని నల్లబలం క్రమంగా ఛేదించవచ్చు.

| | | |
|---|---|---|
| 3. | బ×బ | బ×బ |
| 4. | గు—రా శ 3 | శ—మ 3 |
| 5. | గు—శ 3 | గు—రా 2 |
| 6. | శ—మ 3 | 0—0 |
| 7. | 0—0 | బ—మ శ 3 |
| 8 | శ—రా గు 5 (a) | బ—శ 3 |
| 9. | శ—ఏ 4 | శ—రా గు 5 (b) |
| 10. | బ—రా ఏ 3 | శ—ఏ 4 |
| 11. | మ—రా 2? (c) | ఏ—రా 1 |

తెల్లబలం ప్రారంభదశ పూర్తిఅయినట్లే కాని ఏనుగులు రావటం తరువాయి. నల్లబలం రాజు ఏనుగు ఖాళీ చేస్తేను ఇంకా ఒక గుఱ్ఱం ఏనుగు వున్నా వాటి అవసరం లేకుండా పూర్తి అయినది.

| | | |
|---|---|---|
| 12. | బ—రా గు 4 | [illegible]—రా [illegible] |
| 13. | మ—మ 2 | గు—గు 3 |
| 14 | శ—గు 3 | మ—శ 2 |
| 15. | రా—గు 2 | గు—శ 5 |
| 16. | రా—ఏ 2 | బ—రా ఏ 4 |
| 17. | గు—రా 2 | గు×బ |

(తెలుపు-14)



(నలుపు-10)

కాంబినేషన్ ప్రారంభం మొదటిఅంకంలో రాజుని ఏ 4 లో నిస్సహాయుణ్ణి చేయడం. రెండో అంకానికి నలుపుబలంలో మంత్రి ఏనుగులు ఆటకటడం. ఈ క్రమం వరకు 13 ఎత్తులు. ఈ 13 ఎత్తులూ ఆయన ఆలోచించేరు. ఈ ఆలోచనకి 20, 30 నిముషాలు పట్టవచ్చును.

| | | |
|---|---|---|
| 18. | రా×గు | బ×బ షా |
| 19. | రా×బ | మ—మ 2 షా |
| 20 | రా—ఏ 4 | ఏ—రా 5 షా (d) |
| 21. | శ×ఏ | బ×శ |
| 22. | శ×శ | బ×గు |
| 23 | శ×గు | బ×గు |
| 24. | మ×బ | ఏ×శ |
| 25 | బ—శ 3 | ఏ—రా 1 |
| 26. | మ—మ 3 | ఏ—రా 4 |
| 27 | బ—శ 3 | ఏ—రా గు 4 (e) |
| 28 | ఏ—రా గు 1 | మ—మ 3 |
| 29. | మ—శ 2 | మ—శ 5 షా |
| 30. | రా—ఏ 3 | మ×బ షా |

**ఆట సమీక్ష :**

(a) ఈ తెరవు నల్లబలానికి ఏమీ వ కల్పించలేదు. పైగా శకటు నల్ల దాడికి గురౌతుంది.

(b) ఈ తెరవు తెల్ల బలానికి బీభత్సం కలిస్తుంది. తెల్లబలం చాలా యోచనమీద గాని దీని బారినుండి తప్పుకోలేదు.

(c) అనవసరం. శ—రా 2 వల్ల ఎత్తునష్టం, శకటు తిరోగమనం అయినా తెరవుపీక ఒదిలే మంచిమార్గం.

## న్యూఢిల్లీ లేఖ

(...వ పేజీ తరువాయి)

"...స్పను" అని శ్రీ ...డేసమండి ...ల్లీ వ్యాఖ్యానించారు.

### ఎత్తుకు పైయెత్తు

...కు పైయెత్తు వేయడంలో కమ్యూ... చతురులు. కమ్యూనిస్టేతర పత్రికలకు కల్పించడానికి తమలో చీలికలు వచ్చా...టూ వారు కట్టుకథలు కొల్లలుగా ...రు. భారత భూభాగంలో ప్రతి అంగు...న్ని రక్షించుకోవడానికి తాము సంసిద్ధుల... కేరళ మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఇ. యం. యస్. నంబూద్రిపాద్ అన్నట్లు పత్రికలు ప్రకటించాయి. జాతీయ కమ్యూనిస్టు నాయకుడుగా శ్రీ డాంగేను 'భారతీయ టిటో'గా కొందరు అభివర్ణించారు. ఒకానొక సమయంలో. శ్రీ డాంగేకు కమ్యూనిస్టు పార్టీ...ం ఎక్కువైనట్లు అధికి శ్రీ భూపేష్ ...డా ఆయన్నే సమర్థిస్తున్నట్లు ప్రక...నలు వెలువడాయి. వీటిపై అందరూ చల్ల... ఏవేవో ఊహాగానాలు మొదలుపెట్టారు. ...మ్యూనిస్టుల మీరట్ సమావేశం ఈ ఊహ...లన్నీ అపోహాలు చేసేసింది.

మీరట్ సమావేశంలో కమ్యూనిస్టుల ఎత్తుగడ ఒక్కటే. అది ప్రధాన మంత్రిని తమవైపుకు త్రిప్పుకోవడం! అంటే 'కాంగ్రెసు పక్షంలోని మితవాదులనుంచి శ్రీ నెహ్రూను రక్షించుకోవాల'ని కమ్యూనిస్టులు తాపత్రయపడుతున్నారని కొన్ని అర్థం తీశాయి.

మెక్‌మహాన్ రేఖపై శ్రీ నెహ్రూ బలంగా నిలబడ్డారు. అక్కడనుంచి ఆయనను అంగుళం జరపడం సాధ్యంకాదు. అందుకని కమ్యూనిస్టులు తమ అంతిర్యంలో ఎలాఉన్నా మెక్‌మహాన్ రేఖను గుర్తించక తప్పలేదు. కమ్యూనిస్టులు ఒకవిధంగా గాంధీ పద్ధతి అవలంబిస్తున్నారు. మహాత్మాగాంధీ ఎన్నడూ ఇతరులను వేలెత్తిచూపి నేరారోపణచేసి యెరుగరు. నేడు మన కమ్యూనిస్టులూ అంతే! చైనా ఉద్దేశ్యాలను శంకించలేదు. దురాక్రమణను ఖండించలేదు. 'ఇది ఏమ'ని ప్రశ్నించలేదు. భారత ప్రధానమంత్రిని కలుసుకోవాలని కోరిన చైనాప్రధాని కోరికకు వీరు హార్దం వెలిబుచ్చారు. శ్రీ కృశ్చేవ్ లాగా వీరు కూడా హిమాలయాల్లో ఒక మైలు అటైనా ఇటైనా పట్టించుకునేటట్లు లేరు. ఒడంబడికలను భగ్నంచేసినా దురాక్రమణలు జరిపినా కమ్యూనిస్టులు ఖాతరు చెయ్యరు.

కాంగ్రెసు భారతదేశాన్ని ఇంకా పాలించదలిస్తే, కమ్యూనిస్టులనుంచి చతురంగప్రయుక్తులు ఎన్నో నేర్చుకోవలసి ఉన్నది.

## 7-వ నుడికట్టుకు జవాబులు

| 1 పా | రా | ణి | | | | 2 స | రి | 3 గ |
|---|---|---|---|---|---|---|---|---|
| రు | | | 4 కా | 5 క | రి | | | ల |
| వం | | 6 సు | ర | టి | | 7 హా | | భా |
| | 8 ర | మ | ణ | | | 9 ద | 10 వే | |
| | 11 ప | ర | ము | | 12 పో | రా | దో | |
| | 13 శి | మ | | | 14 రు | బా | యి | |
| 15 న | | ణి | | 16 స | న | దు | | 17 అ |
| లు | | | 18 అ | రి | ష్టం | | | ధ్యా |
| 19 వ | లు | వ | | | | 20 కు | రం | గి |

ఏది ఏమైనా లేకపోయినా, క్రమశిక్షణ నేడు కాంగ్రెసుపార్టీలో ఎంతయినా అవసరం. ★



d) దాడిని ఈ తమశైలిలో సాగిస్తుంది. ఇక పైని జరిగే కొట్లాటలో నల్లబలం చంపులు, తెల్లబలం చంపులుగమనార్హం. నల్లబలం ప్లాను, దాని ఒత్తిడిక్రమంగా తెల్లడి అవుతుంది.

...ఏనుగు మ ఏ 1 నుండి 8వ అంచిలో ...యూవేగంతో విమానంలా తయారైంది.

### సమస్య 13

ంబినేషన్—4

నలుపు

తెలుపు

ఎత్తు తెల్లబలానిది

మూడవ ఎత్తులో ఆటకట్టాలి

## వార్తలు

### బోట్వినిక్-టాల్ ప్రపంచపోటీ

మార్చి 1960 లో జరుగనున్న ప్రపంచ చతురంగం చాంపియన్‌షిప్ పోటీలో, ప్రపంచ చాంపియన్ బోట్వినిక్ (రష్యన్)ని సవాల్ చేయటానికి పోటీదార్ని ఎంచే టోర్నమెంటు బెల్‌గ్రేడ్‌లో ఇటీవల ముగిసింది. 20 సం॥ యువకుడు మైకేల్ టాల్ ఈ పోటీలో విజయం సాధించేడు. ఈయన ఆట, శైలి, పిండీవంటల సువాసనతో విరాజిల్లే విందులా ఉంటుంది.

### జాతీయపోటీలలో ఆంధ్రటీము:

### ఆంధ్ర ప్లేయర్లు

డిశంబరులో జరిగే తృతీయ జాతీయ పోటీలు, రాజధాని ఢిల్లీలో నిర్వహించబడతాయి. ఇందు ఆంధ్రటీము వల్లునూ హైద్రాబాద్ నుండి ఆంధ్రటీము వల్లునూ, కాక ఒరిస్సా టీములో శ్రీ యస్. రామారావుగారు, సీడెడ్ ప్లేయర్సులో శ్రీ జి. యస్. దీక్షిత్ మొత్తం 10 మంది పాల్గొనే అవకాశం ఉంది.

ఆంధ్రలో చతురంగం స్టాండర్డు ఏ రాష్ట్రానికి తగ్గదు అని రుజువుచేస్తూ, విజయవంతంగా తమ ప్రజ్ఞల్ని ప్రదర్శిస్తారని, అగ్రస్థానాల్ని అందుకుటారని ఆశిద్దాం. ★

# ఆంధ్రపత్రిక గొలుసుకట్టు

ఇక్కడ అ నుంచి డ వరకు 25 వరుసలున్నాయి. ఆధారాల సహాయంతో వీటిని అడ్డంగా మాత్రమే పూర్తిచేయండి. అలా పూర్తిచేస్తే ఆయా వరుసల్లో 1 నుంచి 18 వరకు ఉన్న గళ్ళలో పడే అక్షరాలను కలిపితే "మహానుభావులైన" త్యాగరాజు గారి ఒక పెద్ద కీర్తన పల్లవిస్తుంది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అ | 1 | | | | |
| ఆ | | | | | |
| ఇ | | 2 | | | |
| ఈ | 3 | | | | |
| ఉ | | 4 | | | |
| ఊ | | 5 | | | |
| ఎ | | 6 | | | |
| ఏ | | | | | |
| ఐ | 7 | | | | |
| ఒ | | 8 | | | |
| ఓ | | 9 | | | |
| ఔ | 10 | | | | |
| అం | | | | | |
| అః | | | | | |
| క | | 11 | | | |
| ఖ | | 12 | | | |
| గ | 13 | | | | |
| ఘ | 14 | | | | |
| చ | | 15 | | | |
| ఛ | | | | | |
| జ | | 16 | | | |
| ఝ | | 17 | | | |
| ట | | | | | |
| ఠ | | | | | |
| డ | | 18 | | | |

## ఆధారాలు

అ. ఈ జానపద నాయికను గురించి ఒక ఆధునిక కవి పాటలు వ్రాశారు.

ఆ. గొంతుకలో విషం సంగతి విన్నాము గాని, విషంలో గొంతుక ఎప్పుడన్నా విన్నామా?

ఇ. పద! ముగ్గురితో ఒక్క మాటమాత్రం చెబుదాం.

ఈ. అయిదురోజులు జాగ్రత్తగా వదిలి చూడండి. ఒక రాతి వస్తువు లభిస్తుంది.

ఉ. వాడు మనుష్యులలోనే పోటివాడు.

ఊ. ఆ గొలుసు తినండి.

ఎ. ఇటూ అటూ ఎటు చూసినా నిద్దరే.

ఏ. వారు వంచంచుట్టూ ఉండటానికి వీలు ఉంది.

ఐ. మాట.

ఒ. కొదు మాత్రం కాదు.

ఓ. ఈ రంగేమిటో కొంచెం అర్థమయ్యేట్లు చెప్పి చూద్దాం.

ఔ. మీ చేతికి చిక్కాం, ఎంత సాగమన్నా సరే.

అం. అటకలో కొమ్ములు పెట్టండి, తికెంపు కొకటి మిగులుతుంది.

అః. మాదీ మీదీ కాదు వారిది. ఒక అక్షరం మారిస్తే సముద్రంలో తేల్తామేమో.

క. అడవి పొదలో దానికి చేర్చి ముఖం చూసుకోండి.

ఖ. కేసరి గమనంలో స్వరాలున్నాయి.

గ. కనుక కొమ్ము తిరిగితే కోపంరాదూ?

ఘ. ఈ రాష్ట్రంలో ఒక్కటే ఒక్క కూరగాయ ఉంది.

చ. ఈ లోహానికి కాలంతో సంబంధం ఉంది. కనుక ఒకచోట నిలవదు.

ఛ. పంచమీ విభక్తిలో ఆభరణం.

జ. వాన ముసురుకుండా ఉంటే కోతి ఒకటి బయటకి వస్తుంది.

ఝ. చిన్న గింజ గడ్డిమేట అంత.

ట. వారు తీసుకురారు, రథంలో ఎక్కిద్దామా!

ఠ. అతను దేహం కలవాడు కాదు.

డ. ఏటవాలుగా కత్తిరించాలి.

మహాత్మా గాంధీ ఆఖరి దినాల్లో [illegible]లుకని, శ్రీ వినోబా భావే చేతి[illegible] పెద్ద ఉద్యమంగా మారి, శ్రీ జయప్రకాశ్ నారాయణ్ వంటి సామ్యవా[illegible] సామ్యవాదిగా చేసిన సర్వోదయ సిద్ధాంతాని ఇంగ్లండులో కూడా ప్రతిధ్వనులు విన్పిస్తున్నాయి. ప్రముఖ రచయిత ఆర్థర్ కోయిస్ట్లర్, చరిత్రకారుడు ఆర్నాల్డ్ టాయిన్‌బీ, డేవిడ్ ఆస్టర్, లేడీ క్రిప్స్, క్వేకర్ నాయకులు పలువురూ కలిసి ఇంగ్లండులో సర్వోదయ సంఘంగా ఏర్పడ్డారు ఇటీవల విదేశయాత్రకు బయలుదేరిన శ్రీ జయప్రకాశ్ ఈ సంఘం ఏర్పాటుచేసే చర్చల్లో పాల్గొంటారు.

* * *

అటు సోవియెట్ రాకెట్లూ, ఇటు అమెరికన్ రాకెట్లూ చంద్రగోళం వైపు పోటాపోటీలుగా ఎగరడం చూసి భిలాయ్‌లో ఒక ఆసామికి చంద్రగోళంలో మంచిహోటల్ పెట్టుకుంటే బావుంటుందని ఆలోచన కలిగింది. ఈ హోటల్‌కు పెట్టుబడి కావాలని అతగాడు అమెరికన్ రాయబారి ఎల్స్వర్త్ బంకర్‌ను కోరాడు. "ఊహ చాలా బావుంది. రాకెట్ యుగానికి తగు. ఊహే" అని బంకర్ అన్నారు.

* * *

అస్త్యుత్తరస్యాం దిశిదేవతాత్మా, హిమాలయో నామ నగాధిరాజః, కుమార సంభవ కావ్యాన్ని ప్రారంభిస్తూ, మహాకవి కాళిదాసు హిమాలయం అనే పేరుగలిగిన నగాధిరాజు పూర్వాపరసముద్రాలలోకి చొచ్చుకుని పృథ్వికి కొలబద్దలా వుందని వర్ణించాడు. ప్రపంచవాఙ్మయంలోనే ప్రాచీనమని చెప్పదగిన ఋగ్వేదంలో భరతఖండానికి ఉత్తరాన హిమాలయాల ప్రశంస ఉంది. ఏనాటిదో తెలియని విష్ణు పురాణంలో వీటి ప్రస్తావన ఉంది. ఇంకా రామాయణం, భారతం ఇత్యాది ప్రాచీన గ్రంథాలలో హిమాలయ ప్రశంస ఉంది. 2,500 మైళ్ళ పొడుగున వున్న హిమాలయ శ్రేణి 8,000 ఏళ్ళుగా భారత పరిహద్దుగా ఉంటోంది. ఇది కాదనడానికి వీల్లేని చారిత్రిక సత్యం, అని చారిత్రిక గాథాగాల వన్నిటినీ ఏర్చి కూర్చిన ఒక అధికార పత్రాన్ని నవంబర్ 16 వ తేదిన ప్రారంభమైన లోక్‌సభ సమావేశానికి భారత ప్రభుత్వం సమర్పించింది. ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd. by S. Radha krishna at

